శ్రీ

# పుష్పావతి

(శృంగారప్రబంధము)


కర్త:

కవిసార్వభౌమ - వీరప్రబంధ పరమేశ్వర - మహాకవిమార్తాండ -

సాతాూ ద్వీరప్రతాప - అభినవ టాదిత్యాది బహుళబిరుద విఖ్యాత

**డి. రాజశేఖర శతావధాని,**

ప్రొద్దుటూరు.



ప్రచురణకర్త:

S. విశ్వనాథం

మద్రాసు.



# కవిసమ్రాట్టులు శ్రీ శ్రీ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ఎం. ఏ. గారి

## పీఠిక.

శ్రీ మద్యాల రాజశేఖర శతావధానిగారు మహాకవి అనిపించుకొన్న కొద్ది మంది యాధునికాంధ్ర కవిశ్రేష్ఠులలో నొకరు. వీరు సుప్రసిద్ధులు-కీర్తి.

నేటి కవులలో పలుమంది పలు వస్తువులు గ్రహించినారు. కొంద రింగ్లీషు కవుల ననుసరించి ప్రతిష్ఠ సంపాదించిరి. కొందఱు స్థానికగాథల నుండి వస్తువు తెచ్చుకొనిరి. ఒకరు మహారాష్ట్ర చరిత్ర కెక్కిరి. వీరు రాజస్థాన కథావళి నాశ్రయించిరి. "సాక్షాద్వీర ప్రతాప" యన్న వీరి బిరుదమే యేతత్సర్వమునకు వ్యాఖ్యానము. పుష్పావతి యన్న ప్రబంధము రాజపుత్రస్థాన కథావళిలో నొకటి.

వీరు సంపన్న గృహస్థులు. పదివేలిచ్చినను కాలు గడప కీవల నెట్టరు. తమ జేబు లా! కాదు! ఉన్నదానితో తృప్తిపడినవారని యర్థము. ఎందరో కవు లెన్నియో గ్రంథములు వ్రాయుదురు. అందొక్క విషయమే తత్ప్రతిష్ఠా హేతు వగును. తిక్కన్నగారిలో కూడ కొన్ని ఘట్టములే పదిమంది చదువుదురు. మనుచరిత్రములో మొదటి మూడాశ్వాసములు దాటి వందలో తొంబది మంది చదువరు. తక్కిన కావ్యమీ ఘట్టములలో పోల్చినచో జనాకర్షకము గాదని చెప్పవలయును. కవి ప్రతిభాశక్తులు వేరు. లోకమునకు నచ్చుట వేరు. కవి యెంతి ప్రతిభావంతుడైనను గావచ్చును. పాఠక సమాజము నాకర్షింప లేక పోవచ్చును.

ఈ కావ్యము శృంగార రస ప్రబంధము. ఇందు వీరరసము గలదు. హాస్యరసము మిక్కుటముగా గలదు. హాస్యము శృంగారమున కంగము. ఈ ప్రబంధమున నీయంగ రసము నంగిరసమును మ్రింగివేయుచున్నదా! యన్న శంక యున్నది. స్థూలదృష్టికి మ్రింగి వేసినదనియే చెప్పవచ్చును. యథార్థమున కట్టిది జరుగలేదు. జరుగకపోవుటకు కారణము ఈహాస్యరస మంతయు ప్రతినాయక సమాశ్రయమై యుండుటయే! ప్రతినాయకుని ప్రబలవర్ణనము కావ్యరసము నెప్పుడు భంగింపదు. నాయక గుణోత్కృష్ట్యాపాదనకే హేతు వగును.

ఇది యొక సాంఘిక కథయని చెప్పవచ్చును. అప్పులబాధ పడలేక నరసింహారావు తన కూతును పుష్పావతిని మోహనున కిచ్చుట కంగీకరించును. నిజముగా నిది విషాదాంతము కానిచో సాంఘిక కథాదృష్టితో చూచినచో కథలో పట్టుండదు. ఇంచు మించుగా కనీథలో నాపట్టు చలిన దని చెప్పవచ్చును. కాని, గంభీరసింహుని వలన నొక యథా

త్త్వము కథలో ప్రవేశించి కథాప్రాణమును నిలిపినది. అద్భుతరసము దీనికి కొంత సాయము చేసినది. ఇది కథానిర్మాణ కౌశలము లోని రహస్యము.

కొన్ని చోట్ల మోహనునితో గంభీరసింహుడు ప్రసంగించునపుడు తేలికగా ననౌచిత్యశంక కలుగవచ్చును. కాని లోకమును జాగ్రత్తగా చూచినచో నీశంక పరిహరింపబడును. మోహను డొక ధనిక కుమారుడు. మూర్ఖుడు. అతనిని కాదనుటకు వీలులేదు. అవుననుటకు వీలులేదు. ఒక జమీందారు డున్నాడను కొందము! అతడు వెఱ్ఱివాడు. సభలో నెట్లు ప్రవర్తింపవలయునో తెలియదు. పదిమంది దొరలు చేరినప్పు డతని నుపేక్ష చేయుదురు. అచ్ఛముగా నుపేక్షించి యూరకుండుటకును వీలు లేదు. ఎంత యుదాత్తశీలుడును వానితో ప్రసంగించునప్పు డనుదాత్తుడుగా కనిపించుట తప్పదు.

ఈమోహనుని పాత్రనిర్మాణ మొక యద్భుతకార్యము. ఆంధ్రసారస్వతములో నిట్టి పాత్ర మరియొకడు లేదు. ఇతడు మూర్ఖుడా! కాదు. వివేకశాలియా! నిస్సందేహముగ నగును. ఇంత వివేకశాలి మూర్ఖునివలె నేల ప్రవర్తించును! కారణము ధనమదాంధత. నరసింహారావు తన చేతిలో చిక్కినాడు. అతడు తప్పించుకొని పోలేడని యతని తెలియును. ఈమోహనుడు పరాక్రమము వంకబోడు. అతడు వీరుడే కాడని చెప్పుటకును వీలులేదు. అతని కుదాత్తములైన భావములు లేవని చెప్పుటకు వీలులేదు. పుష్పావతితో మాట్లాడుచు,

"మద్భుజాత్మ్న ననుఁ జంపఁగఁ జూడకు! కూర్మి చూపు! నా
సేవలఁ జేసెదన్ జెఱకు సింగిణి మోయు బికారి మన్మథున్!"

ఇంత సుకుమారముగా మాటాడ గలవాడు! ఇతనిని నళినీరంజను [illegible]ము చేసికొన లేదు. నళినీరంజనుడు మోహనుని గూర్చి,

"జడ ప్రకృతి నుండి మానవ జన్మమునకు
నిప్పు డిప్పుడే వచ్చెనంచు నూహించు కొందు
మోహనునిఁ జూచి నప్పుడు నా బుద్ధియందు!"

అని యూహించెను! పుష్పావతీ నళినీరంజనుల వివాహమునాడు మోహనుడు తన పదునారు లక్షలు వధూవరులకు కానుక చదివించెను. అతడు లోభియైనచో నీపని చేయుడు!

ఈ పాత్ర మొక విచిత్రముగా నున్నది! మృచ్ఛకటికము లోని శకారుని పాత్ర యెట్టిదో యిది యట్టిది. 'హామ్లెట్' పిచ్చివాడా కాడా అన్న ప్రశ్న యెట్టిదో యిది యట్టిది. అన్నిటికన్న విచిత్ర మైనది నళినీ రంజనునిమీద మోహనునకు కోపము వచ్చి [illegible].

'నాఁడే నట్టి యుండిన క్షణంబునఁ దున్మియుండు నే! ఖడ్గముల్
నీపై నున్న దిప్పుడిక! నీగళముల్ తెగఁగోసి వెంచియుల్
నీకు తెలుసంగువాఁడవే! నిది నిక్కము! నమ్ముము నామాట!"

అని. ఇది వీరుని లక్షణమా! అసమర్థుని లక్షణమా! వెఱ్ఱివాని లక్షణమా!
ఇం కొక చమత్కారము! మోహనుని నటిని రంజని "సుస్మృతీ" యని పిలువగా.

"ఎవఁడా సుస్మృతి! నీవె దుస్మృతివి! నీవే క్రోధి! నీవే కఠో
రివి! నీవే ఖలి! నీవె కుశ్మలవు! నిర్దోషస్పృహవు నీవె! దరా
త్మవు! నీవేవళి! నీవె సుందుభివి"

ఇట్లు సంవత్సరాలు - నక్షత్రాలు - యోగాలు, గడచినవి. ఇక్కడ కవి నిర్దోషస్పృహ నటిలో గుణభక్తి మైనది. ఈగ్రంథములో గుణభంగమైన తావెచ్చటను లేదు. గొప్ప కవి వ్రాయునప్పు డట్టి పొరపాటొకండు జరుగును. ఇది పొరపాటు కాదు. మోహనుని పాండిత్యము దీనివలన వ్యక్తమగు చున్నది. అతడు గురు లఘు విభేద మెఱుఁగనివాఁడని తెలియుచున్నది. పాత్రయొక్క గుణమును మనో లక్షణమును వ్యంగ్య భూతములు చేయుటకు నిట్టి రచనచేసిన సంస్కృతాంధ్ర కవులెవ్వరు లేరు. షేక్స్పియరుకూడ నిట్టి శిల్పము చేసెనో లేదో తెలియదు. 'ఎస్కిలస్' అను గ్రీకు నాటకకర్త యిట్టి శిల్పమును చేసెను.

మజేయము.

'నీవే నిద్దుర పోతవు' నీవే నిష్ఫ్రష్ఫ్రూపమవు నీవే ప్రాచీనా పితివి"

ఈ ప్రాచీనాపితి శబ్దము వాడుటకు రాజశేఖర శతావధానిగారు పరమ హాస్య రస నిష్ణాతుఁడు కావలసి యుండెను.

ఈ గ్రంథము పాశ్చాత్య దేశములలో నున్నచో మోహనుని మనః ప్రవృత్తిని పరిశీలించు కొన్ని సంపుటములు బయలు దేరెడివి.

ఈకవి కవితాశక్తిని గురించి వ్రాయుట చాల యనవసరము. సూర్యుని దివిటీవెట్టి చూపించినట్లు. అయినను పగటి కాగడా లోక రాజ లక్షణము గదా!

"కమలేక్షణ సౌధ గవా, క్షమున నిలుచు రామణీయకముఁ గన్గొన జట్టము వలమి రహించెను చిత్ర మొకోయన నేత్రపేయతల్" సంధించెల్"

ఈ కల్పన యొక విలక్షణ మైన ప్రతిభా సమున్మేషము. ఈయన, లోకోక్తులు చిత్ర చిత్రములుగా నుండిను.

“వెంట్లి నేయేండ్ల వైరము”

“ఏ రేపాముపై లుండెఁగఁ జీర తేడయు ననుచుఁ బేసి శిరమున నిడు”

“కోప లుండినచోఁ గష్టలుఁగూడఁ గలవు”

“సిద్ధశిల నొక్కఁడని నమ్మ నెట్లు”

“ఈ మేల్బాయి సాధించి”

ఇచ్చట వేయి యనునది పురుషున కుపలక్షకము. మరిగడుసుఁ గనపు మాటలు ఉక్తి వైచిత్ర్యములు పెక్కులు.

“జనుకుకు నంటె”

“నీ కానము మిగ్రంగు నంతటికి, యాకలి గొం తావగింజ యంత

“అనఁగా ననఁగా నొక యజ్ఞాని యనియెడి ఛందమునను సంభాషణ మా వావరించెను”

అన్నిటికంటె విచిత్రమైనది.

“పొయ్యుండదే కబ్బాలాప దోషం”

అబ్బా! అబ్బా! అని యనుకొనుట యని యర్థము. సూరన్నగారి

“ఆహా వృషేంపదే”

యన్నట్లున్నది.

శైలి మొత్తముమీద సుకుమారము - పేశలము. అన్వయ కాఠిన్యము లేనిది. సులక్షణముగా నక్షమమయ్యెడిది. ఆప్రబంధ కవులు గడుసరులైన శతక కవులు విడిపోయిన తర్వాత రామలింగేశ్వర శతకముతో నారంభించిన యొక మెత్తని తెలుగు మాటల ప్రౌఢ నేతల వలన వికసించి విజృంభించిన శైలి. ఈ శైలి తిరుపతి వెంకటేశ్వర కవులయందు మహావృక్షముగా పెరిగినది. రాజశేఖర శతావధానిగారి యీ గ్రంథ మందలి శైలి గూడ నేతాదృశమైనది.

అడిదము సూరకవి నాటికి తెలుగు పద్యపు శోభ యంతయు యతిప్రాస లక్షణముల లోని చమత్కారముగా భాసించినది. ఈ యూహకు మొదటి ప్రోద్బలకమైనది “వశీకృతచిత్తుడు ధర్మసూతి మెత్తని పులి” తిక్కన్నగారి మొదలైన రచన.

ఓజోగుణము రెండు రకములు. ఎక్కువ భావమును తక్కువ మాటలతో చెప్పుటయు నోజోగుణమే! ఒక భావమును విస్తరించి యెక్కువ మాటలతో చెప్పుటయు నోజోగుణమే! ఈ కావ్య మందలి యోజోగుణము రెండవ రకమైనది. ఈ ద్వివిధా విలసితమైన యోజోగుణము కవి ప్రతిభా సముద్దీపితౌచిత్య ప్రకాశిత మగును. ఈ కావ్యము నందలి కథ సాంఘిక కథవంటి దగుటచేత నిది యిచ్చట నౌచిత్య సంధాయకము. ఈ కావ్యమునం దెచ్చటను దీర్ఘ సమాసము లుండవు. ఒకటి రెండు చోట్ల మాత్రమే కలవు!

శ్రీ

శ్రీసత్యదేవతాయైనమః

క్షీరసాగరం.

మ॥ భగవంతుండగు రాజశేఖరుఁడా నీపట్టుం గలాఁ! డాంధ్రమం
డ గణేయమ్మగు కీర్తిఁగల ప్రతాపాఖ్యు చారిత్రముల్
సొగసౌ రీతి రచించి సత్కవుల మెచ్చుల్ హెచ్చుగాఁ గొంటి! వెం
తగ వర్ణింతుము రాజశేఖర కవీ! ధన్యుండ వీవన్నిటన్!

చెళ్లపిళ్ల — వెంకటశాస్త్రి,
ఆంధ్రాస్థానకవులు, మదరాసు గవర్నమెంటు.

# "పుష్పావతి"

కృతికర్త. సుప్రాక రాజశేఖర శతావధానిగారు.

రాజశేఖర శతావధానిగారు రాయలసీమ యందే గాక [illegible] మంతటను ప్రఖ్యాతి జెందిన మహాకవులు. కవి పరమేష్ఠియగు శతావధాని శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారును కవి కుల గురువులగు విశ్వనాథ సత్యనారాయణగారును వారి కవితా వైశద్యమును గూర్చి ప్రశంసించి నపు డింక తక్కిన ప్రశంసలు జగా దివ్వటీ ముందర సన్న దీపములు.

"ఏక ఏవభవేదంగీ శృంగారో వీర ఏవహి" అను నాలంకారి కోక్తి ననుసరించి, వీరరసా విష్కరణమున 'రాణాప్రతాప చరిత్ర' మూలమున కవితా పీఠమైన వీర శృంగార రసా విష్కరణమున దమకు గల యసమాన చాతుర్యమును జూపుటకే 'పుష్పావతీ' కావ్యమును సంతరించిరి. ఈసంతరించినది నిండు జవ్వనమున యందుగాదు.

పదునాఱేండుల నుండియున్ హృదయ దౌర్బల్యంబు చేఁ గృంగుచున్
బదయుగ్మంబుఁ గదల్చి బైటఁ జరియింపన్ లేని, స్థితిలో!

అయిన కృతిరచన మనగ మంచినీళ్ల ప్రాయము! కృతి రచనము నెలో—పదినాళ్లో గాక తడవుండదు. అదియు సర్వాంగ సంపన్నముగ మూర్తీభవించినది!

పుష్పావతి వేయి పద్యములకు పైబడిన యైదాశ్వాసముల కావ్యము. కథ చరిత్రాత్మక మైనది..................

సముచితములగు వర్ణనములతో శృంగార రసము నవీన కాలానుగుణముగా పోషింపబడినది!

ప్రసన్న గంభీరమగు సమాసరచన జాతివార్తా చమత్కారములు—అసమాన ధారాదోరణులు కవిగారికి వెన్నతో బెట్టినవి. ఉత్తమసాహిత్య విద్యార్థులకు పట్టి గ్రంథములు ముఖ్య పఠనీయ గ్రంథములుగా నుండ దగినవి. విశ్వవిద్యాలయాధినేత లిట్టి యుత్తమ కృతుల నాదరింతురు గాత.

భారతి మేనెల 1949.

గీ॥ హాస్యరసము వరాఙ్మృతి ♦ నందె మోహ
నముగ నిలిపితివో యన ♦ నడిచె నావు!
మోహనుని పాత్రపోషణ ♦ మునకు నీకు!
శత కిరీటంబు లిచ్చిరఁ ♦ జాల కవులు!

కం॥ లాలిత్యము వశ్యసుత
శీలము సౌందర్యమహిమ ♦ శిష్టత పని యీ
భూలోక ప్రాచ్య నాయిక
పూలకు దొరసాని నీవు ♦ పుష్పావతియుఁగా!

కం॥ అలువది నాటకఁ పెన్నుట
ముదుపగు శృంగార కావ్య ♦ మును గూర్చితి! నీ
గమనము నుతింపఁ దరమే
చిర కీర్తి నిధానా! రాజ ♦ శేఖర సుకవీ!

ఇట్లు.
జి. లక్ష్మణశాస్త్రి.
ఆస్థానకవి
వనపర్తి.

---

ప్రతులు వలయు వారు:—

వృ క్షే బు క్కు డి పో,
గంభీర విలాస్, పొద్దుటూరు.
(కడప జిల్లా.)

Sri Kavi Sarwabhouma, D. Rajasekhara Satavadhai is the greatest of all the historical poets in Andhra Desc As the illustrious author of the immortal works, Viz "Th Rana Pratap "Amar Simha "Chandanripala" "Veeramati 'The Heroines of Hindusthan (in English) and Pushpava he is unrivalled in theme, diction, style, imagery and imagination.

The reader who would never condescend to laugh at Mohan Singh's words and deeds should either be a saint or a tyrant and his place can never be between them. This work excels many a modern contemporary classic in all points of literary excellence.

The Author's dexterous pen checkles into iife of blazen resplendence the marble cold characters and confirms the universal truth that the poet is the "Power of Eternal Truth". Kavi Samrat Sri Viswanadha Satyanarayana says well, 'Kavi Sarwabhouma alone, I declare, can claim Tikkana's genius in Andhra Desa".

**A. K. Muni.**



— కవిసార్వభౌమ —

డి. రాజశేఖర శతావధాని.



# పుష్పావతి

(శృంగారప్రబంధము)

కర్త:

కవిసార్వభౌమ - వీరప్రబంధ పరమేశ్వర - మహాకవిమార్తాండ - సాహితీ ద్వీరప్రతాప - అభినవ టాదిత్యాది బహుళబిరుద విఖ్యాత

**డి. రాజశేఖర శతావధాని,**

ప్రొద్దుటూరు.

- పబ్లిషర్:

**S. విశ్వనాథం**

మద్రాసు.

వెల రు. 2-0-0

# తొలిపలుకు



"పుష్పావతి" యను నీ ప్రబంధమును సుప్రసిద్ధకవులును- నవధానులును గవి సార్వభౌమాది బహుళ బిరుద విఖ్యాతులును-నగు డి. రాజశేఖర శతావధానిగారు వార్ధక్యమున రచించిన శృంగార రచన :

ఇతర సమయములలో వీరు కొన్ని రచనలు చేసి లోకమున కందఁజేసినను 'రసరాజ' మనఁదగు శృంగార రసములో నింతవఱకు నింత పట్టుదలతో వ్రాసినది లేదనియే చెప్పవచ్చును. ఏ రచనమునందేని రచన.సాగించి మెప్పుఁ గనవచ్చును. కాని, శృంగార రసమున మెప్పు సంపాదించుట దృశ్యాదృశ్యము. వీరు ప్రకృతము మెప్పుఁ గైకొని రనియే నా నిర్ణయము.

సుప్రసిద్ధ రచనలనుగూర్చి వ్రాయునపుడు 'ధార ధారాళము-రసవత్తరము' నిర్దుష్టము లోనగు పడికట్టు మాటలు వ్రాయవలసియుండదని విజ్ఞు లెఱుంగుదురు. ఇయ్యది యీ కవి సార్వభౌముని,

"పెద్ద తనంబునఁ గనిన బిడ్డ! సుధా మధురానులాప!" యని నొక్కి చెప్పఁ దగియున్నది! సహృదయు లిద్దానిని మిక్కిలి మెచ్చుకొనఁగలరు!

శ్లో॥ కవిః కరోతి కావ్యాని - లాలయ త్యుత్తమోజనః॥
తరుః ప్రసూతే పుష్పాణి మరుద్వహతి సౌరభం॥

బెజవాడ
18-3-47

చెళ్లపిళ్ల - వెంకటశాస్త్రి
శతావధాని

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము



## తృతీయాశ్వాసము

## చతుర్థాశ్వాసము



## పంచమాశ్వాసము





# పూర్వపీఠిక

మ॥ స్థిరభక్తిన్ భవదంఘ్రియుగ్మమును బూ♦జింతున్ గదా యెప్పు! నీ
కరుణాలోకమె నేఁటిదాకఁను ననున్ ♦ గాపాడె నేలోపమున్
వఱలన్ జేయక! యెప్పుడిట్లె కరుణా ♦ పాదత్వమున్ జూపి బం
గరు తల్లీ! నను నుద్ధరింపఁ గదవే! ♦ కామేశ్వరీ! శాంకరీ! 1

ఉ॥ నాఁడును నేఁడు నీదు చర♦ణద్వయిపై హృదయమ్ము నిల్పుకొ
న్నాఁడను! నీదు కూర్మివల♦నన్ బలు విఘ్నములన్ దొలంచుకొ
న్నాఁడను! నిన్నుఁ గొల్చుచు మ♦నః ప్రమదంబును గొంతకీర్తిఁ గొ
న్నాఁడను! నీకు నప్పువడి♦నాఁడను వేయివిధాల శాంకరీ! 2

క॥ శంకరుఁ-ద్రిపురాసుర విల
యంకరు-భక్తావలీ ప్రి♦యంకరు - రిపు నా
శంకరు - సకల జగత్క్షే
మంకరు - చరణాబ్జయుగము ♦ మది సేవింతున్! 3

మ॥ అనురాగోన్నతి నూత్నమూతన చరి♦త్రాంశంబులన్ జేర్చి యే
యనఘోర్వీశ్వర సత్కథల్ కృతులు వ్రా♦యన్ గంటిఁ! దద్వంశ క
ర్తను ఛాయాహృదయేశు - సర్వవిబుధో♦దాత్త స్వరూపున్ విక
ర్తను సర్వామరపూజ్యు భాస్కరుని మా♦ర్తాండున్ బ్రశంసించెదన్! 4

సీ॥ అసమాన వేద వి ♦ ద్యా ప్రౌఢి కేక ము
ఖబ్రహ్మ యనఁ గీర్తిఁ ♦ గనిన ఘనుఁడు!
సార భాషా మహా ♦ సాహిత్యరూఢికిఁ
గ్రతు భృగాచార్య ప ♦ ర్యాయపదము!
నఖిలాంధ్రభాషా ర ♦ హస్య పారీణతా
ప్రాభవస్ఫూర్తి స ♦ ర్వజ్ఞమూర్తి!
శబ్ద శాస్త్రాపార ♦ సామ్రాజ్య మేల జ
నించిన పుణ్య పా ♦ ణిని మహర్షి!

గీ॥ విష్ణు భక్తియె మూర్తీభ ♦ వించె ననఁగ
నలరు కందాళ్లవంశ దు ♦ గ్ధాబ్ధిచంద్రుఁ
బరమపురుష సాక్షాత్పర ♦ బ్రహ్మమూర్తి
మద్గురుస్వామి దాసార్య ♦ మది భజింతు! 5

గీ॥ భారతీనాథు నపరావ ♦ తారము లనఁ
గావ్య జగము సృష్టించి లో ♦ కముల మనుపు
నన్నయాది కవీంద్ర మం ♦ దార తరుల
నాంధ్రభాషా గురుల నిత్య ♦ మభినుతింతు! 6

సీ॥ ఆత్మలోఁ బొడమిన ♦ యతి సూక్ష్మ గూఢ భా
వము లెటులఁ గల స ♦ ర్వజ్ఞమూర్తి!
క్లిష్ట ఘట్టముల న ♦ తి సమర్థమునఁ గన్న
యట్లు వర్ణించు క ♦ వ్యగ్రగామి!
ద్విశతాధిక గ్రంథ ♦ వితతి వ్రాసి తనంత
వాఁడు లేఁడని పేరు ♦ వడసిన కవి!
నవలలు వ్రాయు నే ♦ ర్పవమున కేకము
ఖ బ్రహ్మ యని కీర్తిఁ ♦ గనిన మేటి!

గీ॥ నాంగ్ల భాషా వచన సౌష్ఠ ♦ వాతిరూఢి
నఖిలలోక గద్యబ్రహ్మ ♦ యన నెగడిన
"జార్జి – రైనాల్డ్సు" కవి 'బ్రాంజు ♦ ప్రాచ్యుఁ' డొనుచు
నొక్కనాఁ డేను జదువుచు – ♦ నున్న యపుడు! 7

మ॥ తనచిత్తంబున బాల్యమాదిగ సుహృ ♦ ద్భావంబు పెంపొంద న
న్ననయంబుల్ గడు గారవించి యనురా ♦ గాయత్త భావంబునన్
గను–నాభూతపురాన్వయాబ్ధి శశియౌ ♦ నారాయణస్వామి–నన్
గన నేతెంచె నొకప్డు మోద మలరం ♦ గా నింటిపై మేడకున్! 8

ఉ॥ ఆయననున్ 'నమస్కృతి' య ♦ టంచు వచించుచు నిల్చినంత నే
నాయత బాంధవంబును బ్రి ♦ యం బలరారఁ గవుంగలించి క
న్దోయికిఁ బారణంబుగ హి ♦ తున్ గని "మీ కృప యింతదొడ్డదా
నే! యిపు డిట్లు దర్శనము ♦ నిచ్చితి–రిన్ని దినాల కేనియున్!" 9

క॥ అని పలికి యతని నుచితా
సనమునఁ గూర్చుండఁ జేసి ♦ సంభావన చే
సిన ముసిముసి నగవులు మో
మున మొలకెత్తంగ నతఁడు ♦ మోదముతోఁడన్. 10

శా॥ "అన్నా! యెన్ని దినంబులో కడచెఁ గా ♦ దా మిమ్ము దర్శించి! నే
నెన్నో మాటలు వచ్చిపోద మన – ని ♦ ట్లే చెల్లెఁ గాలంబు! సం

మ॥ అరుసంశాంరగఁ జెళ్లపిళ్లి కుల దు ♦ గ్ధాంభోధి రాకా సుధా
కరుఁ డా వెంకటశాస్త్రి ముప్పదివుటల్ ♦ గ్రంథంబుగా వ్రాసి మీ
మెఱుఁగుల్ గావ్యము మెచ్చి 'మీరెపుడు వా ♦ ల్మీకిన్ గథాపోషణ
స్ఫురణన్ మీరెదిరించుఁ బల్కె! ననఘా! ♦ పుణ్యుండ వీ వన్నిటన్! 17

ఉ॥ పాయక విశ్వనాథకుల ♦ వార్ధి సుధాకరమూర్తి! సత్యనా
రాయణగారు! మీ కృతి తి ♦ రమ్ముగ 'భారత'మంచు మీరనన్
దీయని కైతకున్ 'సుకవి ♦ తిక్కన'లం చని ముందు భారతిన్
వ్రాయఁడె! మీ ప్రతాపకృతి ♦ వంటి మహాకృతి కల్గునే క్షితిన్! 18

మ॥ అరరే! మీకృతులెల్ల నుత్తమము "లా ♦ ర్యావర్త నారీమణుల్"
కరముల్ మెచ్చెద రాంగ్లపండితులు! త ♦ ద్గాంభీర్య సౌశీల్య బం
ధురతల్ గ్రంథముఁ జూచినన్ దెలియు! ను ♦ క్తుల్ దెల్పఁగా లేవు! భూ
ధర మధ్యంబునఁ జూపఁగాఁ దివ్వెడు చం ♦ దం బెందుఁ జెంపొందెడున్! 19

ఉ॥ వీరరస ప్రబోధక ప ♦ విత్ర చరిత్రల నాది నుండియున్
మీరు ప్రబంధరూపముల ♦ నించ రచించి కవీంద్రులందు వి
స్తార యశంబుఁ గాంచుట ప్ర ♦ శస్తమ! యైనను నిప్పు డొక్క శృం
గార రస ప్రధానమగు ♦ కావ్యము వ్రాయుఁ డటంచు వేఁడెదన్! 20

ఉ॥ ఒక్క రసంబునందున మ ♦ హోన్నతి ముట్టిన ప్రౌఢ కెందు వే
ఱొక్క రసంబు క్లిష్టముగ ♦ నుండును! సార రసానుభూతి తా
నెక్కడనైన నొక్క విధ ♦ మే కద! మీ కృతి యేదియేనియున్
జక్కని పాకమున్ గొని ప్ర ♦ సాదగుణంబున ముగ్గి తేలెడున్! 21

ఉ॥ ఎక్కడి వారలో - యెటులో - ♦ యెన్నియొ స్తోత్రములన్ రచింప - మీ
రొక్కగతిన్ గృతుల్ సలుప ♦ కూరక యుండఁగరా దటంచు నే
నొక్కి వచించువాఁడను! న ♦ నున్ క్షమియింపుఁడు! మీ సమత్వమం
దెక్కుడు పల్కఁ జాల! దయ ♦ యెంచి కృతిన్ రచియింపఁ బూనుఁడీ!" 22

మ॥ అను సత్యాదర మేదురం బతని వా ♦ క్యశ్రేణి నాలించి "యో
యనఘా! నీ హితవృత్తి కెంతయును నే ♦ హర్షింపఁగాఁ గంటి! నై
నను నారోగ్య విభూతిలేక కడు వం ♦ తన్ గుందు నాకున్ సుఖం
బన సున్నే! తను దార్ఢ్యహీను కడఁకల్ ♦ వ్యర్థమ్ములే యౌఁగదా! 23

మ॥ పదునాఱేఁడులనుండియున్ హృదయ దౌ ♦ ర్బల్యంబు బాధించుటన్
బదయుగ్మంబుఁ గదల్చి బైటఁ జరియిం ♦ పన్ జాల కున్నాఁడ! దై

న్యదశల్ నాకుఁ దొలంగుచున్నవో! యనూ ♦ ర్జుఁ బశ్యత్తా రూఢిమైఁ
సదనంబున్ విడలేని నేను గృతులన్ ♦ సంధింపఁగా నేర్తునే! 24

మ॥ సరసంబై - మృదుభావసంయుతమునై ♦ సర్వోచితీసార వి
స్ఫురణం బేర్పడ విశ్వనాథ విజయం ♦ బున్-రాయబారమ్మునున్-
మఱియున్ నిమ్నకులోద్భవోద్ధరణ మన్ ♦ బల్గ్రంథముల్ వ్రాసి నే
ర్పులతో మీకడఁ గావ్యకష్టముల నే ♦ వాక్రువ్వఁగా నేటికిన్!" 25

క॥ అన - "మీ వాఙ్మయము చా
లని వారలె కాని, మెచ్చ ద ♦ లంచిన లోక మ్మా
తన కృతి యనఁగా మీ కెం
త! నెల్లో పదివ్రాల్గి నాక - ♦ సజ నయ్యెడునే! 26

మ॥ రసమున్ దీర్పఁగ నౌచితిన్ నెఱపఁ బా ♦ త్రశ్రేణిఁ బోషింప - సుం
త సహాయత్వముఁ గోరఁ బోదు! కృతి నాం ♦ తంబైన నే వచ్చి యు
ల్లస మారంగఁ బఠించి మీకు హృదయో ♦ ల్లాసంబు సంధించెదన్!
బసఁ జెన్నారు భవన్మహాకృతిఁ బఠిం ♦ పన్ భాగ్య మె ట్టబ్బునో!" 27

క॥ అని పౌనఃపున్యముగా
నను నూతనకృతికిఁ బూన్చు ♦ నా సచ్ఛిలి మి
త్రుని గాంచి "వెఱఁగి వెఱఁగియు
నను నిర్బంధింప నే మ ♦ నన్ గలవాఁడన్! 28

ఉ॥ ఏయొక గంటసేపొ లిఖ ♦ యించినఁ బద్యము లెన్నియైన నే
వ్రాయఁగనేర్తుఁ! గాని యవి ♦ వ్రాసినతోడనె పైత్యధాటి యొం
తో వెసరేఁగి పుట్టుఁ దల ♦ నొప్పి! మహాకృతి కెట్టు లోపుదున్?
బాయక కొంకినక్క హిమ ♦ వద్గిరి పైనిడ మోయ నేర్చునే! 29

సీ॥ వలపుకానికిఁ దన ♦ వలపుకత్తియ పైనఁ
గొదకొన్న ప్రణయంబు ♦ గ్రుడ్డిదైనఁ-
దన కని పెంచు సం ♦ తానంబుపైసఁ దల్లి
స్వాంత మందలి ప్రేమ ♦ మంధమైనఁ-
దన యిలువేల్పుగాఁ ♦ గొను దేవతపయి భ
క్తునకుఁ గల్గిన భక్తి ♦ గ్రుడ్డిదైనఁ-
దన కష్టపడి చేర్చు ♦ ధనరాశిపైన స్వా
ర్థపరుని రక్తి యం ♦ ధంబయైన-

తే|| గ్రంథకర్తకు నిజమనః ♦ కల్పిత ప్ర
బంధ పాత్రలపైఁ గల ♦ ప్రణయబంధ
మంత నేయంతలుగ బ్రస్ఫూర్తి ♦ దగుట సత్య!
మటులు నాకున్నఁ గృతులు పా ♦ కటయుఁ గల్ల! 30

తే|| ఔదార్య-కాంతి-మాధు
ర్యములు-కావ్యముల నెన్ని ♦ యలరిన-హృదయా
హ్లాద మొనరింపలేవు! ప్ర
సాదగుణము తక్కువైనఁ ♦ జప్పనగుఁ గృతుల్! 31

ఉ|| కావున-నాకు నూత్నకృతిఁ ♦ గల్పనసేయు టసాధ్యమంచు నా
భావముఁ దెల్ప-నాయనయుఁ ♦ బల్మఱు పల్మఱు దానిఁగూర్చి ప్ర
స్తావ మొనర్చె! నేను హితు ♦ స్వాంతము నొచ్చునటంచు జంకి "పు
ష్పావతి యంచుఁ బద్యకృతి ♦ వ్రాయఁగఁ డంగుదు" నంచుఁ బల్కితిన్. 32

తే|| అమ్మ! భువనైకసార స ♦ ర్వాత్మకవు! స
స్స్వరూపిణివగు నిన్ను ♦ సంస్మరింతు!
నీకృతి రసోత్తరముగ వ్రా ♦ యింప వమ్మ!
శైలరాజన్య కన్య! సౌ ♦ జన్య ధన్య! 33

ఉ|| వీరరసప్రబోధక ప ♦ విత్రచరిత్రలె కాని యెప్డు నే
వేఱు రసమ్మునందుఁ జెయి ♦ పెట్టి యెఱుంగ! బుధేంద్రులెల్ల శృం
గార రసంబు వ్రాయుటది ♦ కష్ట మటందురు! కాన-నీకృపా
పూర మొకింత యెక్కువగఁ ♦ బూన్చి ననుఁ గృతకృత్యుఁ జేయుమీ! 34

మ|| జననీ! కష్టమొ సౌఖ్యమో! హృదయ చాం ♦ చల్యంబుమైఁ గావ్యముల్
బొనరింపన్ దొరకొంటిఁ! గోవిదచయం ♦ బుల్ మెచ్చ 'రాణా ప్రతా
పు'ని సృష్టించిన నాదు లేఖినిని వ ♦ మ్ముఁ జేయఁగాఁ బోకు! నీ
యనుకంపారతిఁ జెక్కుభంగుల మదిన్ ♦ ధ్యానింతుఁ గామేశ్వరీ! 35

మ|| లలితా! నీకృప నంత తక్కువగు వే ♦ శన్ భీప్రదుండా మహా
బలుఁడున్ సన్నని గడ్డిపోఁచను గద ♦ ల్పన్ లేఁడు! నీ సత్కృపా
బల మేపారిన - దుర్బలాత్ముఁ డయినన్ ♦ బ్రహ్మాండభాండంబు ముం
దల మోయంగలఁ! డీవె సర్వమున కా ♦ ధారంబ వో యంబరో! 36

ఉ|| అచింతరీతి భూమి జను ♦ లందఱు వాడుచు నుండు గాథలన్
మంచి వచో నిగుంభనలు - ♦ మంచి చమత్కృతి - మంచి శయ్యలన్

మంచిరసానుభావములు – ♦ మంచి యలంకృతుల్ – లొప్ప వ్రాయఁ–జే
ర్చాంచు నదే ప్రబంధ మనఁ ♦ గాఁ! కృతికిన్ గుణముల్ ప్రధానముల్! 37

చ॥ మృదుపదసంచయం బది శ ♦ రీరము! మానసమున్ గఱించుచున్
బొదలు రసాతి విస్ఫురణ ♦ ముల్ పెనుపొందెడు జీవశక్తి! య
భ్యుదయ విశేష ధర్మచయ ♦ ముల్ పరిణామ ఫలంబు లా కృతుల్
త్రిదశులకైన వంద్యములు ♦ దేవుఁడు మెచ్చు పవిత్ర పుష్పముల్! 38

ఉ॥ తతసాయంతనవేళ వచ్చి మకరం ♦ ద స్యందియౌ మల్లికా
ప్రతతిన్ జేరుమటంచు భృంగముల కె ♦ వ్వా రంపి రాహ్వాన! మా
గతిఁ గావ్యంబు రసార్ద్రమైన రసికుల్ ♦ గాంచున్ విలోకించి త
ద్గత శబ్దార్థ రసప్రభూత మకరం ♦ దం బానుటల్ వింతయే! 39

చ॥ సదమలమైన కావ్య మొక ♦ సాటి సమాదృతిమైఁ బఠించినన్
జదువరికిన్ హృదున్నతి నొ ♦ సంగి – వికాసముఁ బెంచి – చేతనా
భ్యుదయము నిచ్చు! నిట్టి గుణ ♦ ముల్ గలిగింపనినాఁడు కోవిదుల్
పదముల చేటుగాక – కృతి ♦ వ్రాయఁగనేల వృథా శ్రమించుచున్! 40

శా॥ నీజాగ్రత్కరుణాబలమ్మునఁ బ్రయ ♦ త్నింతున్ గృతిన్ వ్రాయ! వి
భ్రాజచ్ఛబ్దపరంపరల్ – మధురమౌ ♦ భావమ్ములున్ సద్రసా
వ్యాజశ్రీ మహిమంబు లిం పెనయఁగా ♦ సాంతంబుఁ గావింపు! మా
పూజాపుష్పము నుంచి నీపదయుగం ♦ బున్ గొల్తుఁ గామేశ్వరీ! 41

ఇట్లు

కవిసార్వభౌమ డి. రాజశేఖర శతావధాని

శ్రీ

# పుష్పవతి

## ప్రథమాశ్వాసము



శ్రీకొప్పారు తుషారపర్వత ముదీ ♦ చిన్ - బ్రాగ్దిశన్ భూరి బం
గాళాఖాతము - వింధ్య యామ్యమున - నిం ♦ కన్ బశ్చిమాశాతటం
బాలంబాంబుగ యావనాబ్ధి - యిటు లా ♦ ర్యావర్త దేశంబు ల
క్ష్మీలోలాక్షివిధాన భారతమహా ♦ గేహమ్మునన్ జెల్వగున్! 1

క॥ అవి — శాలివాహనశకో
ద్భవమునఁ బదునొకఁడునూర్ల ♦ పైఁ బదియునునా
ల్గవవత్సర నవవాసం
త విలాస విశాల విమల ♦ తర వాసరముల్! 2

చ॥ అదినెలలందుఁ జైత్రము - ది ♦ నాంతపువేళ - పవల్ మహోష్ణతా
స్పదుఁడయి చండభానుఁడు ప్ర ♦ పంచమునెల్ల సహింపరాని యెం
డదవులఁజేసి ఘర్మనిబి ♦ డంబొనరించుచుఁ బ్రాణులన్ గరం
బదవదసేసెఁ! బైన విల ♦ యావహవాతము వీచె నుగ్రమై! 3

"నలినీరంజనుఁడు రీవారణ్యముఁ బ్రవేశించుట."

ఉ॥ ఆసమయంబునందు శుభ ♦ దాయతలక్షణశోభి - వైరిసం
త్రాసకరప్రతాపమహి ♦ తంబగు నొక్కహయంబు నెక్కి మా
త్స్నసమ సుందరాంగుఁ డొకఁ ♦ డాత్రముతో నరుదెంచె నా'మహా
బా' సరిహద్దుతూర్పున 'రి ♦ వా'క్షితి భూరివనాంతరంబునన్! 4

చ॥ పడమటికొండనెత్తముల ♦ పైఁ బొదలన్ బ్రభవించు తీవెలన్
బొడమచు - వృద్ధినొంది - బలు ♦ పున్గని సద్రసపొష్ఠవంబు ని
న్నడిగ గడించి - దోరగిలి ♦ మాగిన గుమ్మడిపండు చందమై
పడియె దివాకరుం డపర ♦ వారిధి - లోహిత క్రమ దీధితిన్! 5

సీ. వ్యాళరాజేంద్రు సహస్రవక్త్రములఁ బోల్చినవేయినాల్కల ♦ ననుకరించి-
వనదేవతాలయ ♦ ద్వారంబుపై వ్రేలు తావిరేకలగుంపు ♦ రాణ మెఱసి
పేరడవిని నాల్క ♦ వేయినాల్కలు సాఁచు దావాగ్నిశిఖల చం ♦ దము వహించి-
విపినదేవతగుడి ♦ వ్రేలేడు నపరంజి చిఱుగంటదుచులతోఁ ♦ జెలిమి నెఱపి

గీ॥ యూకులే కెంపుకాయ లా♦ద్యంత మలమి
పెనుకొడలుచేయుచు శిరీష♦వృక్షవితతు
లుస్తమానార్క నిబిడ శో♦ణాంశుతతుల
నలరె వనమునఁ-గొఱవిద♦య్యముల కరణి! 6

మ॥ కలరావంబులెసంగఁ గోకిలతతుల్ ♦ గానంబుఁగావించెఁ గొ
మ్మలనందందును గూరుచుండి! యభిరా♦మస్వాదు దివ్యాంబుసం
కలితంబై ప్రవహించుచుండె సరసిన్ ♦ 'గ్రమోద' మన్ బేరిటన్
సెలయే! అందుఁజరించు పాంథుల శుభా ♦ శీర్వాదముల్ గాంచుచున్! 7

క॥ మొగమెల్లఁ గనులుగలిగిన
మృగములు మునిచీఁకటులకు ♦ నెదఁబెదరుచు వి
చ్చ్చగఁ జెంగలించె! నడవియుఁ
పొగలు విరియు కొలకుకరణి ♦ దోఁచుచునుండెన్! 8

మ॥ అట కేదేశమునుండివచ్చెనొకో! మ ♦ ధ్యాహ్నంబునన్ దిండియె
చ్చటనో! యెచ్చటి కేగఁగావలెనో! య ♦ శ్వం బింక వీరుండు మి
క్కుటమౌ నెండకు డస్సివచ్చినటు క ♦ న్గోనయ్యె! నావీరుఁడ
ప్పటి కచ్చోటికిఁ గ్రొత్తవాఁడని మదిన్ ♦ భావింప వర్తించెడిన్! 9

క॥ బలవైరిమణులఁగులికెడు
కళలను-నీలోత్పలముల ♦ కాంతులను-నభ
స్థలినలుపును-గలిపినగతి
నలరెన్ దురగంబు కోమ♦లాసితరుచులన్! 10

క॥ శారీరసౌష్ఠవంబు ను
దారమనస్సౌష్ఠవంబు ♦ దళముకొనెడు శృం
గారకళాసమయం బిది
వై రెండవవత్సరంబు ♦ వఱలు నతనికిన్! 11

ఉ॥ కోడెమిటారిమేఘముల♦కున్ నలుపున్ బదులిచ్చి-కుమ్మరో
రాడెడుముంగురుల్ నిజశు♦భాస్యసరోజముచుట్టు గుంపులై

యాడెడు గంధతుమ్మెదల ♦ యల్లి విలాసముఁబెంపు-మీరఁగన్
జూడఁగఁజొప్పె నప్పుడు ప్ర ♦ సూనశరప్రతిమాన వేషుఁడై! 12

గీ॥ పొట్టియునుగాక మిక్కిలి ♦ పొడవుగాక
నమరకమ్మైన తనమూర్తి ♦ నవకమునకుఁ
గోమలచూపు లుత్పలతో ♦ రణములుగట్ట
వదన మొరకుఁద్రిప్పు న♦భ్యాస ముంచె! 13

చ॥ మనమిటు వర్ణనమ్మునఁగ ♦ మందముగా దురగంబు ముందుకున్
జన నెగఁదోలి వీరుఁ డతఁ ♦ డాంద్రవనాంతరసీమఁజొచ్చె! నా
తనమృదులానిలాస్ఫురవి♦తానము స్వాగతమందఁజేసె నా
తని చెవికిన్ మనోహరసు♦ధామధురంబగు గానసంపదన్! 14

మ॥ పవమానుండిటు గానరూపమున నా♦హ్వానంబుసంధింప వీ
రవరుండున్ విపినంబుమధ్యమును జే♦రన్ యత్నమున్ జేయ-సైం
ధవమున్ వేగముపోక దానిగతి మం♦దంబయ్యె! వీరుండు హే
తువు యోజింపఁగసాగె! వేదియు మదిన్ ♦ దోఁపఁగలే దయ్యెడన్! 15

చ॥ పదియగునేండ్లనుండి కవు ♦ భక్తియు రక్తియుఁజూపి కొల్చి నె
మ్మదినలరించు వాడనము! ♦ నూపటివేళ! యరణ్యసీమ-యి
ట్లదవదనంది యాత్మహృద ♦ యంబుఁగలంచుట యొటికంచుఁ గొం
కఁదోడఁగె వీరుఁ! డంత దుర♦గం బచలస్థితి నిల్చె నచ్చటన్! 16

"పుష్పావతీదర్శనము"

మ॥ ఒకదూరమ్మునఁ బూవుటీరమున లీ♦లోద్యానసీమాంతమం
దొకకన్యామణి కేలఁ గుట్మలము న♦త్యుత్సాహయై త్రాల్చి త
ద్వికచశ్రీఁ దిలకించి చిత్తమున ను♦ద్భిన్నంబులౌ భావనా
ప్రకరంబున్ రమణీయవృత్తమున సం♦భావించె నీరీతిగన్! 17

గీ॥ "మృదులమై, సుప్రసన్నమై ♦ పొదలువిప్ప
ప్రసవమగునప్డు నీదుగ ♦ ర్భంబు విచ్చి
రేకు లెడమగుచో-నీశ♦కీర మెంత
గాసిపడునో గదా! కలి♦కామతల్లి"! 18

మ॥ అను నీవృత్తము భావ-మయ్యమృతక♦ల్యాస్ఫూర్తి వీతెంచి యొ
య్యన శ్రోత్రేంద్రియపర్వమున్ సలుపఁగా ♦ నశ్వంబునుండిగ్గి ముం
దునకున్ వీరుఁడుసాఁగె! నంతఁబోదయం♦మున్ గాంతపైదూకఁ బొం
చిన శార్దూలకిశోరరాజమును వీ♦క్షించెన్ క్షణంబందునన్! 19

క॥ మెఱపుమెఱయు నురవడిత్రోఁ
గరవాలం బొరనుబాసెఁ ♦ గనలొందిన కే
సరివోలె ద్వీపిదెసకును
బరుగిడె వీడుండు! ♦ నంత వ్యాఘ్రము గదలెన్ ? 20

మ॥ మెడ వాటమ్ముగసాచి పిల్లివలె నె♦మ్మిన్ బొంచి పాదంబు చ
ప్పుడు గాసీయక నొండురెండడుగులున్ ♦ ముందుంచి యుప్పొంగుచున్
గడుధాటిన్ బొదనుండిదూకె–నిజవ♦క్త్రం బుద్ధతిన్ విచ్చి య
య్యడవిన్ స్థావరజంగమం బఖిల మా♦హారించునో కోఁ యనన్ ! 21

“ నలినీరంజనుఁడు వ్యాఘ్రమును దునుముట ”

మ॥ అతిదుర్వారభయంకరార్భటిని న♦య్యారణ్యసత్వంబు ను
ద్ధతిఁ బైదూఁకఁగఁ జంద్రహాసము నుదా♦త్తప్రౌఢిఁగేలించి యా
యతశౌర్యాఢ్యుఁడు వీరుఁ డోటుపడ కా ♦ వ్యాఘ్రంబుపై వ్రాలుచున్
బ్రతిలేకుండఁగ సంగరంబు సలిపెన్ ♦ బ్రత్యర్థిదుర్వారుఁడై ! 22

ఉ॥ హాళిని గానమున్ సలుపు ♦ చంతయు భద్రమటంచునుండ నా
భీలమహాధ్వనిన్ వనము ♦ భేదిలఁజేసి సమీపమందె శా
ర్దూలము రేగుచున్ బయిఁకి ♦ దూకుటఁ గన్గొనినప్పు డాసతీ
లాలితచిత్తమెంతగఁ గ ♦ లంగెనొ! ‘హా’యని వ్రాలి మూర్ఛిలెన్ ! 23

క॥ ‘హా’యను నాచెలిధ్వని విని
యాయోధుఁడు తిరిగిచూచి ♦ వ్యాఘ్రగళము న
త్యాయతకృపాణధార ను
పాయమ్మునఁ దఱిగి దాని ♦ ప్రాణముఁ బాపెన్ ! 24

మ॥ ఒరలోఁదూర్చి నిశాతఖడ్గమును నా ♦ యోధుండు శీఘ్రంబె వె
న్దిరిగెన్ “ మండెడుచండ్రనిప్పులవలెన్ ♦ నేత్రమ్ములొప్పన్ భయం
కరమృత్యుప్రతిమానవక్త్రమున వ్యా ♦ ఘ్రస్వామిపైదూఁక నీ
సరసీజేక్షణ భీతివ్రాలె! నకటా! ♦ సప్రాణయై యుండునే! ” 25

“ నలినీరంజనుఁడు పుష్పావతి కుపచరించుట ”

మ॥ అనుచున్ బాణరయంబునన్ గదలి య♦య్యబ్జేక్షణన్ డాసి ని
ల్చెను! ప్రాచీదిశఁదోఁచె నప్పుడు నిశా ♦ సీమంతినీవజ్రమో
హనకోటీరము చంద్రబింబము–మహీ♦యఃకౌముదీక్షాళనం
బున ధాత్రిన్ వినువాక ముంచిన విధం♦బున్ రూఢిఁగావించుచున్ 26

గీ॥ పండువెన్నలవెలుఁగు లా ♦ వనలతపువ్వుల
యాకులోఁగలులను బరి ♦ వ్యాప్తినొంది
కలసి మునిముని-చీఁకటుల్ ♦ మొలుచుచోటఁ
బూలుపూచినయట్లు వెండి ♦ పూతపూచె! 27

క॥ జలజలఁబొరలెడి చెంగటి
సెల-సెల్లా తడిపి తెచ్చి ♦ చెలియమొగమునన్
జలము చిలుకరించుచు న
చ్చెలువకు వీవండు వలయు ♦ సేవలు సేసెన్! 28

క॥ బలహీనంబుగ హృదయము
చలియించుట యరసి వీర ♦ సత్తముఁ డపుడా
చెలిశిరమునకును దనతొడఁ
దలగడగాఁగూర్చి విసరెఁ ♦ దనచేలమునన్! 29

చ॥ కొమ నిటు వీరుఁడున్ గదిసి ♦ కొన్నిక్షణంబులు సాత్త్వికోపచా
రము లొనరించుచుండఁగ మ♦రాళమనోహరయాన దీర్ఘనే
త్రము లొకయింతవిప్పుచు సు♦ధాకరబింబముగేరు వానివ
క్త్రము తననైపువ్రాలుటను ♦ గాంచె శరీరము పుల్కలెత్తఁగన్! 30

క॥ తన మును కని యెఱుఁగని మా
తనపురుషునిజూచి సిగ్గు ♦ దళముకొనఁగ మా
నిని లేవఁబూనె! వీడం
డును'వలవదు వలవ'దని క ♦ న్నవారింపన్! 31

క॥ "అంతయు సేమమె! లజ్జా
క్రాంతవగుచు లేవఁబోకు! ♦ గంటగ మూర్ఛా
భ్రాంతవయి! తెంత బడలితో!
స్వాంతము పదిలముగనుంచు ♦ పరమశుభమగున్! 32

క॥ నీప్రాణమునకు మాఱుగ
నాప్రాణము నొసఁగువాడ! ♦ నమ్ముము! విశ్రాం
తిప్రక్రియఁ గావింపుము!
నీప్రకృతిమారాధనంబు ♦ నేనొనరింతున్! 33

క॥ మునిమాపునఁ-జెలులను విడి—
వనమున-నొంటరిగ-దిరుగఁ ♦ బనిగాదని -ని

నిన్నుఁజాల! వెన్నవలె మృదు
వని మెఱుఁగుదు నీమృదుత్వ ♦ మరవిందముఖీ!" 34

క॥ అని-చెలిమి నెజవ్వు వీరుని
గని యుల్లముపల్లవింపఁ ♦ గన్యామణి యు
ల్లన లేచికూరుచుండెను
దనదు తనూవిలసనంబు ♦ తద్దయు వెలుఁగన్! 35

ఉ॥ పండిన పాసు-దేవతల ♦ పాలిటి ప్రాణపుఁబిండివంట-యా
వెండివెలుంగు వేలుపు-ప ♦ విత్రపుఁగాంతుల నొందిరవ్వ యో
ధుండను వానిచెంగటను ♦ దొయ్యలి-యిర్వురుగూడ-సాత్వికా
ఖండ మనోజ్ఞ భావ రస ♦ గాఢ హ్లాదనుభూతి సంపదన్! 36

క॥ అమ్మోలత వదనలావ
ణ్యమ్మును గనులారఁగ్రోలి ♦ యానందపర
త్వమ్మున వీరుఁడు తనచి
త్తమ్మున నుడివోవకుండఁ ♦ దనివున్ బొందెన్! 37

సీ॥ తనదుసౌందర్యమం ♦ తయు నొక్కచోఁ జేర్చు
లాలిత మధుమాస ♦ లక్ష్మి యనఁగఁ
చాపల్యమునునూని ♦ జగతికి దిగివచ్చి
మెయిదాల్చు క్రొక్కారు ♦ మెఱుపనంగ
నలచతుర్దశలోక ♦ ములు గెల్వ విడివడ్డ
ప్రసవాస్త్రు నాఱవ ♦ బాణ మనఁగ
నంబరాంబరుని జూ ♦ టాగ్రభాగమువీడి
యిలఁజేరు చంద్రమః ♦ కళ యనంగ

గీ॥ భువనమోహన లావణ్య ♦ మూర్తి వెలయు
కలికిపూరెమ్మ కమ్మబం ♦ గారుబొమ్మ
కొమ్మ విపిన దేవతయో - వై ♦ కుంఠము విడి
ధరఁదిరుగు నాదిలక్ష్మియో ♦ తెలుఁగరాదు! 38

క॥ అరవిందముపయి నిందిం
దిరమట్టులు-చంద్రుఁడవులు ♦ నీలాంకమటుల్
మెఱసె గరితమొగమునఁ గ
స్తూరి బొట్టది కరగి-దెసలు ♦ సురభిళములుగాన్! 39

చ॥ పడితొలకయంసముల్ గదిసి ♦ శాఖగఁ బొంది రతీశు దర్పపుం
బెడఁగులు పెక్కు మిద్ది యని ♦ పించెము పైటచెఱంగు విద్దపు
న్మడతలపైన వజ్రమణి ♦ భూషవెలుంగు నెలుంగు! దానిపై
నుడుపతికాంతి ప్రాలి సుమ ♦ మోన్నతిఁ గూర్పు లతాంగి మేనికిన్! 40

మ॥ శతజన్మంబులకైన నింతటి మహా ♦ సౌందర్యసామ్రాజ్యదే
వత–రాకాశశిబింబవక్త్ర–చతురల♦ప్రత్యగ్రజాగ్రత్కళా
యుతమూర్తిన్ దిలకింప నాత్రమె! యహా ♦ హా! యానామె దివ్యాప్సర
స్తుతి దాసీతతిఁ జేసి సోలఁగల తే♦జస్స్ఫూర్తి దీపించెడిన్! 41

క॥ వనిత యసమాన సౌంద
ర్యనిధానం బగుట యెఱింగి ♦ యామెం బలుకరిం
పను మనసై తద్వదనం
బునఁ జూడ్కినిగడ్చి ప్రియము ♦ పొంపిరివోవన్! 42

మ॥ “అలినీలాలక! తండ్రికాలమున రా ♦ జ్యంబూడెఁ! బెక్కుల్ విప
త్తులు వాటిల్లెను! గొంతకాల మిచటన్ ♦ ద్రోయంగ నేవచ్చితిన్!
తలిదండ్రుల్ గతియించి! రొక్కఁడుఁడ | ను ♦ ద్వాహంబులే దింక! స
న్నలినీరంజనుఁడండ్రు! నిన్నుఁగని డెం ♦ దం బుత్సవం బందెడిన్! 43

గీ॥ అడవు లనినను–నంభోధి ♦ హోర మనిన–
నీదు టనినను–మృగయా వి ♦ నోదమనినఁ–
బ్రాణపదములు నాకు! రీ♦వాధరిత్రి
ప్రకృతిభాగ్య మనుభవింప ♦ వచ్చినాఁడ! 44

క॥ ఆమొగలిపల్లెలో సౌం
పౌ మందిర మలరు! దాని ♦ యందొక వృద్ధ
స్త్రీ మెలఁగు! నచ్చట సుధా
ధామముఖీ! నే వసింపఁ ♦ దలఁచితి నిటుపై! 45

చ॥ అమృతరసస్వరూపమగు ♦ నక్షరకూటములోని ధన్యవ
ర్ణములను నీయపూర్వమధు♦రంబగు నామముగాఁగ నోచు భా
గ్యము గనినట్టి వర్ణనివ♦హంబును దెల్పుము! నాదుకర్ణయు
గ్మము గడుఁబుణ్యమొంద వినఁ♦గావలతున్ సరసీరుహేక్షణా! 46

క॥ ఎఱుఁగనివాఁడ నటంచును
బరపురుషుఁడననుచు జంకు♦పడకుము! నిన్నున్

పరదేవతఁగాఁగొలిచెడు
పరమహితుఁడని తలంపు ♦ వనితా''! యనుచున్ 47

మ॥ సరసాలాపములాడు వీడని నిజా ♦ స్యంబెత్తి కెమ్మోవిపై
దరహాసంబునటింప నమ్రతయు మా ♦ ధుర్యంబున్ స్ఫుటంబౌ మనో
హరసంఫుల్లవిలోచనంబు లనురా ♦ గాంకూరసౌభాగ్యముల్
వఱలన్ గన్గొని, లేమ యిట్టులనియెన్ ♦ బ్రత్యుత్తరప్రక్రియన్! 48

క॥ ''పెరవారలఁ దఱియుచు నేఁ
దలచుగ మాటాడియెఱుఁగఁ! ♦ దైవమనై న
న్నరసి మహాపదఁ బాపిన
కరుణానిధితోడఁ బలుక ♦ గా దనఁదగునే! 49

ఉ॥ పావనవారి పూర్ణమదె ♦ పద్మతటాకము! దానికొలఁ జె
లై్వవిలసిల్లు చంద్రమహ ♦ లందు వసింతు! నృసింహరాయపృ
థ్వీవరమౌళి తండ్రియు! ది ♦ విన్ జనె బాల్యమునందుఁ దల్లి! పు
ష్పావతియందు రిందుఁగల ♦ వాఁడు నను న్ గరుణాపయోనిధీ!'' 50

క॥ అని వాసంతపికస్వర
మున-ప్రమోదులు చివురులెత్త- ♦ ఫుల్లాంబుజలో
చన తనపేరును దెలిపిన
విని నలినీరంజనుండు ♦ వికసిత మతియై, 51

క॥ 'ఈవనితానామము 'పు
ష్పావతి' – 'పుష్పావతి' యని ♦ పలుమాఱును జే
తోవీధిని స్మరియించుచు
భావించి యతండు రాగ ♦ పరతంత్రుండై! 52

క॥ ''ఓ నెలత! నీదుజనకుని
నేనెఱుఁగుదు! స్వామిభక్తి ♦ నిగుడంగ 'మహో
బా'నృపతులఁగొలువఁడె భూ
జానులు దనగౌరవము ప్ర ♦ శంసయొనర్పన్! 53

మ॥ నినుఁగన్నట్టి వసుంధరాంబ కడు వ ♦ ర్ణింపన్ బడన్ వింధుఁ! బా
వనసౌజన్యనిధాన! యాజనని య ♦ వ్యాజంపువాత్సల్యలా
లనమున్ గోల్పడి కాంత! నీవెటుల బా ♦ ల్యమ్మున్ గడన్ద్రోసితో!
జననిన్ బాసిన యాఁడుబిడ్డల యదృ ♦ ష్టం బెంత హీనంబొకో!'' 54

క॥ అని తనతల్లి ప్రశంసలు
వానరించిన-జనని కనుల ♦ బ్రమోలను గనుప
ట్టినయటులై పుష్పావతి
కను లశ్రుకణాళి మౌక్తి♦కములటుల రాల్చెన్! 55

మ॥ "నను మన్నింపుము! నీమదిన్ గలఁచు సం♦దర్భంబులన్ దెచ్చి మై
త్రిని నీచిత్తము గాసిచేసి యపరా ♦ ధం బేను గావించితిఁ
దునకున్ నాదగుమానసంబు వ్యథనొం ♦ దున్! నాప్రమాదంబు నో
ర్వ్యాన సైరించితివంచు నీ వనుచునోఁ ♦ బ్రాణంబు లల్లాడెడిన్!" 56

మ॥ స్తిమితంబౌ శుభదృష్టిచూచి దళల ♦ క్ష్మీదేవి నీవుందుస
ద్మము నిత్యోత్సవ-నిత్యమంగళ-జయో ♦ దర్కంబు గావించుఁగా!
కమృతారోగ్యకళావిలాసములతో ♦ సశ్రాంతసౌభాగ్యసా
ఖ్యము లీ వొందెదమగాతమంచు మది నా♦కాంక్షింతు వేభంగులన్! 57

మ॥ సకలప్రాభవవైభవప్రథితులై ♦ సామంతులున్ గేలు మ
స్తకమున్ జేర్చుచుఁగొల్చు భారతమహా ♦ సామ్రాజ్యసౌభాగ్యల
క్ష్మికి సాపత్న్యము నీకుఁగల్గిన-మృగా♦క్షీ! నేను గొండంత హ
ర్షకళన్ దేలెద! నట్టిపుణ్యసమయ♦ప్రాప్తిన్ నిరీక్షించెదన్! 58

క॥ మనకిటు దైవనియోగం
బునఁ బరిచయ భాగ్యమొదవెఁ! ♦ బోనాడక మై
త్రిని బెరుఁగఁజేయవలెనని
మనసారఁగఁగోరువాఁడ! ♦ మధురగుణాఢ్యా!" 59

క॥ అని నలినీరంజనుఁడును
దనభావముఁ దెలుపఁ దరుణి ♦ తద్దయు రక్తిన్
దన నునువాల్చూపుల నా
తనిమోమున నిలిపి వినయ♦తాత్పర్యమునన్! 60

మ॥ "పరులన్ జూచుట-నెమ్మిమైఁదరిసి సం ♦ భాషించు టేనాఁడునున్
గరమిష్టంబులుగావు నా! కయిన-నిన్ ♦ గన్గొన్న స్వాంతంబు సం
బరమున్ గొంత వహించుచున్నయది! దై ♦ వంబే నిన్నున్ నేఁడు చె
చ్చెర, నన్ జేర్చినమాట నిక్కువము! సా ♦ చ్చెం బుండునే మైత్రికిన్! 61

క॥ జనకుఁ డిపు డూరలేమిని
జనెఁ దడవుగ నిచటనిలువఁ! ♦ జనఁగావలె! నో

యయ్యన సతేయు వచ్చు! నేటికి
మనసు చెలప్పు! కోనుము నా ♦ నమస్కారంబుల్!" 62

మ॥ అని వాక్రుచ్చి సరాగకోమల కటా ♦ క్షావిక్షేపకృతిన్ జారులో
చన నమ్రాస్యమొకింత వాల్చుచుఁ గృత ♦ జ్ఞత్వంబునన్ వెల్లడిం
చెను! వీడం దెడబాయునోర్వక వగన్ ♦ కంపించి "జైవాతృకా
నన! జాగయ్యెను! నీవు గేహమునకున్ ♦ నైశంబ పోవన్ దగున్! 63

మ॥ మదధీనంబగు మానసంబున మహా ♦ మాణిక్యదీపంబుగా
సుదతీ! యెప్పుడు నీదువిగ్రహము ని ♦ ల్చున్! శీఘ్రమున్ ద్రుంచు నా
పద వాటిల్లిన-నీదుచింతన మెదన్ ♦ బాయన్! భవన్మైత్రికై
మదినెప్డుత్తల్లమందుఁ! బ్రేమ మిగులం ♦ బన్ నన్ను వీక్షింపుమీ!" 64

మ॥ అని గంభీర గళస్వనంబున మనో ♦ జ్ఞాలాపముల్ పల్కి శో
భన రాగార్ద్రవిలోకనంబులను బై ♦ పైఁజల్లు నాప్రియో
ధుని గన్గొత్తి పిసాళిచూపుగములం ♦ దన్ముంచి యత్తన్వి యి
ట్లను బ్రాహ్మీకరకంజరంజిత శుకేం ♦ ద్రానూనవాఙ్మాధురిన్! 65

క॥ "ఎఱుఁగుదు నీమృదుహృదయము!
నెఱుఁగుదును గృతజ్ఞతాప్తి! ♦ నెఱుఁగుదు ధర్మ
స్ఫురణము! నిన్ను మనంబున
మఱువఁగఁబో! నింకఁ జెక్కు ♦ మాట లవేలా! 66

క॥ మనమిటు మాటలలోఁబడి
నను,గాలము సాగిపోవు! ♦ నాజనకుఁడు వ
చ్చును! మాటవోవుఁ దడసిన!
ననుఁబోవఁగనిమ్ము మన్న ♦ నము దైవారన్! 67

క॥ నలినీరంజన! నేటికి
వెలసిన భాగ్యమునఁ బదియు ♦ వే లొసగూడెన్!
గలిగినగతి నాచరితముఁ
దెలుపఁగలను జెప్పు నీకుఁ ♦ దీటిక [illegible]! 68

"పుష్పావతీదేవి చంద్రమహాలునకు వెళ్లుట"

క॥ కలువలువిచ్చెడు శుభవే
ళల నీసోదరింటికడ మె ♦ లంగెద! నీవిం
దుల కరుదెంచిన సుఖమున
వెలయుదు" నని మెఱుఁగుఁజూడ్కి ♦ వీడఁ గని చనెన్! 69

సీ॥ పద్మపద్మాకర తరంగ ♦ పంక్తి మంద
యానముల నేగు కోదమరా ♦ యంచమాళిక-
మంద మదగజయాన సం ♦ పదల నడుగు
సుదతి దెస తెప్పవాల్చక ♦ చూచె నతఁడు! 70

మ॥ జిలుఁగుఁజీకట్ వెన్నెల నెల్లెడల్ చిలుకఁ జూ ♦ శ్రీపూర్ణిమాచంద్రముం
డలసామీప్యమునుండి యొక్కమొగి న ♦ ర్ధధ్వాంతకూపంబులోఁ
బలికిన్ ద్రోయఁగఁబడ్డ మత్స్యవతిరీ ♦ వ్యామోహితుం జేయఁగ
గ్గలమౌ వేదననొంది చిత్తము కలం ♦ గన్ వీఁడుఁ దస్వప్నుఁడై! 71

క॥ ఒకకొంతసేపటికిఁ బ్ర
క్కకుఁ గంగఁ దలఁచు మొగలిపల్లెఁ ♦ గల మందిరసీ
మకుఁజన! నారాతిరి కో
డికి సతనికిఁ దెల్లవారె! ♦ డీల్వడె ధృతియున్! 72

సీ॥ ఇంతలోనఁ బుష్పావతి ♦ యింటికేగి
భోజనమొనర్చి మృదుతల్ప ♦ మునఁ బరుండె!
విరిసి మునిమాపు సాగిన ♦ వివిధదృశ్య
ములు మదినిదోచినట్టులై ♦ కలఁతఁ జెందె! 73

ఉ॥ స్థావరజంగమాత్మక వి ♦ శాలజగంబును మ్రింగివైచు నా
నైవసీ భీకరోద్ధతిని ♦ 'గాం'డ్రని మిన్నులు వ్రీలఁ దీవ్రసం
రావమెలర్ప వ్యాఘ్రము భ ♦ రమ్మున దూకినదృశ్య మప్డు పు
ష్పావతికాంచెఁ గట్టెదుర ♦ సాఁగినభంగి మహోగ్రకేతులన్! 74

మ॥ తనచిత్తంబు కలంగుచుండ-నటక ♦ త్యంతానురాగంబుతోఁ
దనప్రాణంబున కాసచేయక కృతాం ♦ తప్రాయుఁడై బెబ్బులిన్
దునుమన్ వచ్చు దయార్ద్రచిత్తుఁడు జయుం ♦ తున్ బోని సౌందర్యమో
హనుఁ డావీరుఁడు దోఁచినన్ మదికి సౌ ♦ ఖ్యంబబ్బెఁ బద్మాక్షికిన్! 75

మ॥ దరహాసాంకురశోభియౌ ముఖముతో ♦ ధారాళసౌందర్యభా
స్వరరేఖాతతితో-నతండు మది సా ♦ క్షాత్కారమైనంతఁ గ్రొ
త్తరకంబౌ ననుభావసంపద ప్రభూ ♦ తంబౌచు నెమ్మోన ము
మ్మరమయ్యెన్ జెలికిన్ బ్రఫుల్లతర నో ♦ మాంచంబుదారంబుగన్! 76

క॥ బలిమిని గనుమూయుచుఁ బూ
వులసెజ్జను వ్రాలి చెలువ ♦ పొరలుచునుండన్

దొలుకొడికూసెఁ బలువరా
అలు గళ మొగనత్తి కొక్కొ ♦ రోకో యనుచుఁ! 77

క॥ తెల తెలవాఱెనఁ—దూర్పున
జలజహితుం డుదితుఁడగుచు ♦ స్వర్ణకిరణముల్
గాలిపెను! నృసింహరాయం
డిలుసేరఁగ వచ్చెఁ బుత్రి ♦ హృదయము విచ్చెఁ! 78

సీ॥ ఎదురెదురుగ రెండు ♦ గదులుండె! వానికి
నవ్వల నొకమహా ♦ ద్వారముండె!
ద్వారమవ్వల మేడ ♦ పైకెక్కి-పోవ సో
పానపంక్తులు రెండు ♦ పట్లఁ దనరె!
నవి దాటఁ బదియునే ♦ నంకణంబుల గొప్ప
పడసాల యుండె! న ♦ వ్వల సమస్త
వస్తుసంతానముల్ ♦ వఱలెడు గదులు సొం
పెసఁగె! నవ్వల మహా ♦ నసము వెలసె!

గీ॥ నింటిపైఁ జంద్రశాల యొం ♦ డెసఁగె—నడుమ
నొకచతుశ్శాల—దానికి ♦ నొక్కవైపు
నిలిచె రెండుగర్భాగార ♦ ములు! నొకదెస
రమ్యతరమైన యంతఃపు ♦ రంబు దనరె! 79

సీ॥ తలవాకిటికిముందుఁ ♦ దళుకునీలంపురా
యరుగులు—పైనఁ బం ♦ దిరియు నుండె!
భవనంబుచుట్టు నా ♦ వరణంబునను బెక్కు
రకముల తరువిస ♦ రములు పెరిగె!
దానిచుట్టునను ము ♦ ప్పదిమూర లెత్తుగాఁ
గలపెద్దప్రహరి సొం ♦ పులు గడించెఁ!
బ్రహరిలో సర్వతో ♦ భద్రరచన లొప్పు
ద్వారంబు వెలుగొండె! ♦ దానిపైన

గీ॥ గోపురము! దానిపైఁ బూర్ణ ♦ కుంభయుగము!
వఱలి, ప్రాచీనకాల వై ♦ భవసమృద్ధి
వేయివిధముల ఘోషించు ♦ చాయ వెలసి
మంచి విఖ్యాతిఁగనెఁ జంద్ర ♦ మహలుకోట! 80

వేశికఁ డిండికక ♦ స్పింపనిఁ గసంఁజిక్కి
చెక్కి-గట్టిన బక్క ♦ జొక్క త్రోడ!

సీ॥ గాలి వీవఁ గొంబరిచోళ్లఁ ♦ గూలి సూలి
పోవు త్రొట్టునపై వచ్చె ♦ మోహనుండు!
తేజి పట్టిదాలను-గాళ్లఁ ♦ దీర్ఘమగుటఁ
గొంకు లెగఁ బట్టి-నేల దో ♦ కుకొనకుండ! 85

సీ॥ చలువచేసిన జిల్గు ♦ జలతారు దువ్వల్వ
రంగు హొరంగువా ♦ రంగఁ గట్టి!
యపరంజి పనితనం ♦ బలరారు మొకమాలు
కలు లున్న యంగర ♦ కా ధరించి!
వలిపెంపు జలతారు ♦ పైనఁగన్పడ నుచ్చె
సవరించు నంగవ ♦ స్త్రంబుఁదాల్చి!
యల నెమ్మిపురికన్ను ♦ లడుదుగాఁగనుపట్టు
మవ్వంపుఁగావి రు ♦ మాలు చుట్టి!

గీ॥ వ్రేళ్లనిండ నుంగరములు ♦ పెక్కు-దాఁడిగి
కేల బంగరు బెత్తంబుఁ ♦ గీలుకొలిపి
సుడియు నొయ్యారమున మేను ♦ సొట్ట వోవ
మోహనుఁడు చంద్రమహాలు దా ♦ పునకు వచ్చె! 86

క॥ తనమిత్రుఁడు దుర్గంబున
కును వచ్చెనటంచు-నెదురు ♦ కొనఁగ నృసింహా
వనివిభుఁడు కోటవాఁకిటి
కిని వేగమవచ్చి యతని ♦ కిఁ గనఁబడుచున్! 87

మ॥ "మిడిమధ్యాహ్నపు టెండవేడిమికి నె ♦ మ్మెనెల్లగాసిల్లి చే
డ్పడఁగా వచ్చితి! నీదు రాకకును మ ♦ త్స్వాంతంబు రంజిల్లెఁ! జె
ప్పడి దేమున్నది! ప్రొద్దుపోయెను! కృపా ♦ ప్తిన్ వార్వమున్ డిగ్గుచున్
గుడువన్ ర"మ్మని వాని డించుకొనియెన్ ♦ గుజ్జంబు నందుండియున్! 88

క॥ వీరనరసింహరాయఁడు
గారవమునఁ దోడితేరఁ ♦ గా భవనంబున్
జేరి యచటఁ బుష్పావతి
నారసి మొగమెల్లఁగన్ను ♦ లై కూలఁబడెన్! 89

"మోహనసింహాసనుషన్యాసము"

శా॥ "ఏజన్మంబునఁ జేయు పుణ్యముననో ♦ యీ విశ్వతేజంబుఁ గాం
భోజరాగమునందు! దానివలనన్ ♦ ముఖ్యప్రశస్త్యంబు కాం
భోజం బందు లభించె! నాచెలితనం ♦ బున్ గూర్చి - నాకిప్డు శ్రీ
తేజ చిక్కెను! దీనిశక్తిని నివే ♦ దింతున్ మనస్ఫూర్తిగన్! 90

సీ॥ జవసత్వములు మీఱ ♦ దవ్వుఁగొట్టినఁ గాని—
నేఁడుసంద్రముదైన ♦ నెగురనేర్చుఁ!
దన దేహలాఘవం ♦ బును జూపఁబూనిన—
శీతాద్రి శిఖరిపైఁ ♦ జెంగలించు!
లీల నించుక కశా ♦ ళించెనయేని - య
భ్రస్థలంబది పోటు ♦ వడఁగఁజేయు!
ఖురఘట్టనమున - నీ ♦ క్షోణిని నాగలో
కముదాక నడఁగఁద్రొ ♦ క్కంగనేర్చు!

గీ॥ నలప్రపంచంబు పుట్టిన ♦ దాదిఁ బంచ
ఖండభూమండలం బిట్టి ♦ గారవంపు
హయము నెఱుఁగంగ లేదని ♦ యశముఁగాంచె!
దేవతాజంతు విట్టి దెం ♦ దేని లేదు! 91

మ॥ పతగేంద్రుండు నభస్థలమ్మున మద ♦ శ్వం బీధరిత్రీస్థలిన్
జతగాఁబర్వెడఁ బందెమున్ జఱచినన్ ♦ వహ్వా! ఖగస్వామి యా
యతపక్షంబులు విచ్చులోపలనె నా ♦ యశ్వంబు తానన్నియో
శతముల్ యోజనముల్ గమించు జవమున్ ♦ సత్వంబుఁ జూపించెడిన్! 92

క॥ ఈవాజికి మెడక్రిందను
దేవమణి యొసంగు! దాని ♦ తేజంబునఁ బు
ష్పావతి! దీనికగణ్యం
బౌ విలువ రహించుఁ దోడి ♦ హయములయందున్! 93

సీ॥ నీలమేఘచ్ఛాయ ♦ నెలకొన్న యుత్తమ
హయజాతులవి యెన్ని ♦ యైనఁగలవు!
'సర్వతోభద్ర' 'హ ♦ స్తప్రద' 'గజ్జావి
కారంబు' లివి ప్రము ♦ ఖములు గొన్ని!
'పద్మ' భ్రమప్రభా ♦ భాసుర మిది 'పూర్ణ'
'హర్ష'మున్ పేరిట ♦ నతిశయిల్లు!

దీని నెక్కినవాఁడు ♦ దేవేంద్రవిభవుఁడై
యఖిలరాజులకుఁ బూ ♦ జార్హుఁడగును!

సీ॥ పూర్వశతజన్మములఁ జేయు ♦ పుణ్యవశతఁ
గాక యిట్టివంటిహయము చి ♦ క్కంగఁబోదు!
నేను గోటిరూప్యము లిచ్చి ♦ దీనిఁగొంటి!
నిట్టిహయములు వేలు నా ♦ యింటఁగలవు!'' 94

చ॥ అని తనయశ్వరాజము మ ♦ హాగుణకోటి నుతించుచుండఁగా
విని నరసింహరాయఁడును ♦ 'వేగమలేచి భుజింపర' మ్మటం
చని తనపీటనుండి డిగి ♦ యూడటనుండెడు వంటయింటికిన్
జని రుచిరాన్నపానములఁ ♦ జయ్యన వడ్డనసేయఁ జేసినన్,! 95

గీ॥ వీరనరసింహరాయఁడు ♦ పిలుచుచుండ
మోహనుఁడు లేచి లోనికిఁ ♦ బోక-యింక
నేమియోపల్క నూర్కెనె! ♦ నింతలోనఁ
బడఁతిపుష్పావతి యతని ♦ నైపుచూచె! 96

క॥ ''నావై కేటికిఁజూచెద!
వీవలువల కతల నిప్పు ♦ డెఱుఁగవలెనే! పు
ష్పావతి! వీనివిశేషము
లే వివరించెదను నీకుఁ ♦ దృప్తియగునటుల్! 97

క॥ కలకత్తాపురిచెంగటఁ
గలదొక 'డక్కా' పురంబు! ♦ కలికిరో! దానన్
బోలుతురు బంగరునుండియు
వలిపెపునూల్దీయు నా లె ♦ వాంద్రము లతాంగీ! 98

క॥ సున్నితములయిన కదురులు
నన్నువ రాట్నములు నూలు ♦ నసద్దైయుండున్!
సన్నలు వలువలు నేయుదు!
రన్నైపుణ్యంబు నెఱుఁగ ♦ నరిది యెవరికిన్! 99

సీ॥ కాపురంబున్న య ♦ గారంబులకుఁ గ్రింద
నేలమాలియల నె ♦ న్నేనిఁ ద్రవ్వి
యచ్చట రాట్నంబు ♦ లమరించి గాలికిఁ
బోగులు తెగకుండ ♦ మొదట-నూలు

వడికి యచ్చట మన్న ♦ మిడి-యొడలెల్లఁగ
న్నులుగాఁగ వలిపెంపు ♦ వలువ నేసి-
పార్థివులకు సార్వ ♦ భౌములకే కాని
మఱిఁదక్క-వారి క ♦ వ్వంగఁబోదు!

గీ॥ నాదు తేజంబు ఘనత కొం ♦ తకును గొంత
యెఱుఁగువారలటఁ దెచ్చి నా ♦ కిచ్చుచుందు!
రితరులును తల్లక్రిందౌచు ♦ నెంతతపముఁ
జేసినను నీయ! కలిగి న ♦ న్నింపనీదు! 100

క॥ ఈనెమలిపురుల కన్నుల
మానస మలరించు నీడు ♦ మారాలుకోఱకు నెం
తే నెమకితిఁ! మదకును మఘ
రానగరిని గొంటిఁ జెప్ప ♦ రాని వెలలకున్! 101

క॥ ఇది-ప్రాగ్జ్యోతిష మేలెడు
మదననృపతి కాన్కగాఁగ ♦ మాకంపెను! ని
య్యది నాగబెత్తమని చె
ప్పుదురు! మహామహిమతోడఁ ♦ బొదలుచునుండున్! 102

మ॥ తనదున్ బో యిది శాంతివేళలను వే ♦ త్రంబౌచు! ఘోరారులున్
జనుదేరన్-గరవాలరాజమగుచున్ ♦ శాసించు! రేలన్ వినూ
తనకాంతిన్ ప్రకటించు జ్యోతియగుచున్! ♦ దానిన్ ప్రశంసింప శే
షుని వేనాల్కలు చాలవంచు వచియిం ♦ చున్ బెక్కు లుద్గ్రంథముల్!" 103

క॥ అని తనవలువల వాసిని
తనబెత్తముమహిమఁ దెలుపఁ ♦ "దడవయ్యెఁజుమీ"
యని వినుగుచుఁ బడసాలకుఁ
జనుదెంచి నృసింహరాయ ♦ జనవిభుఁ డంతన్! 104

క॥ "నీవైభవములు లోకం
బీవఱకే యెఱుఁగుఁ! బలుక ♦ నేలా మఱలన్!
రావయ్యా! జాగయ్యెను
బోవయ్యా! వేగలేచి ♦ భుజియింపంగన్!" 105

క॥ అని చనవు వెలయఁగా నా
తని హస్తము పట్టి లేపఁ ♦ దనమాటల న

ల్లన నిలిపి యారగింపఁగఁ
జనియె మహానసముదెస వి ♦ షణ్ణవదనుఁడై! 106

క॥ వలలుఁడు వడ్డించిన వ
స్తుల మొదలిడి యారగించు ♦ చోఁ దనవిభవం
బులఁగూర్చి యుపన్యాసము
సలుపఁదొడఁగు! భోజనంబు ♦ జా గొనరించున్! 107

క॥ తేరీడ్చినకై వడి నా
హారముఁ గొను పని ముగించి ♦ యాదట మధ్యా
గారమునకువచ్చెను దన
దా రూపముఁగాంచి యంద ♦ ఱబ్రము పడఁగన్! 108

"మోహను నుపన్యాసము"

క॥ "నేనారగించి వచ్చితి!
నేనిర్బంధంబులేక ♦ యిక మాటాడం
గా నగు! మీయందఱు నవ
ధానముతో వినుఁడు తెలియఁ ♦ దగు విషయములన్! 109

సీ॥ ఇందు మీరెవరేని ♦ నెఱుఁగని యొకవింత—
యమెరికాఖండ మొం ♦ డలరుచుండు!
నది మనకెన్నివే ♦ లామడలో దూర
ముననుండు! నచ్చటి ♦ మనుజులు మన
వలెనుందు! (కొడలెల్ల ♦ జలదరించును) వారి
పాదంబులును మన ♦ పాదయుగము
వైపు మోయును! గాని ♦ వారితలల్ క్రింది
కిని వాలియుండు వీ ♦ ఙింతమేని!

గీ॥ బడరు వా! రదియొక వింత ♦ పుడమి! యచట
నన్నివస్తులు చిత్రంబు ♦ లై తనర్చు!
నన్ని మాయింటదొరకు! నె ♦ వ్వైనవచ్చి
కనుగొనుఁడు మీరు కన్నుల ♦ కఱవుదీఱ! 110

సీ॥ ఆ 'పెరూ' దేశమం ♦ దరటిపం డొక్కొక్క—
డచలోపమానమై ♦ యలరుచుండు!
నల 'పెనామా' సర ♦ స్సులఁ 'దుమ్మి' పూవులు
పొట్టుజల్లుల యంత ♦ పోలుచుచుండు!

'మెక్సికో' దేశంబు ♦ మిరెపకాయలు గండ
శిలలంత పెద్దవై ♦ చెలఁగుచుండుఁ!
'జిల్లి' లోఁగల యొజ్జ ♦ చీమ నొక్కొక్కండం
బారి యేన్గంతలై ♦ పరిఢవిల్లు!

గీ॥ 'సుమగువే' బోస గొఱ్ఱె త్రోఁ ♦ కొక్కఁడొకఁడు
సుమపథము పోకసంతతికి ♦ బాడవ్రుఁగాంచు!
ధారుణీస్థలిఁగలుగు చి ♦ త్రములు చూచి
తీరవలెఁగాక చెప్పినఁ ♦ దృప్తియగునె! 111

క॥ నాలుగు జలనిధులే యని
బాలిశులు వచించుచుంద్రు ♦ వ్యర్థమ్ముగ! నా
ప్రేలుడుల కేమి! నూఱులు
వేలును లక్షలును గలవు ♦ వెళ్లి కనుగొనన్! 112

మ॥ ఒడలున్ గోరలువోవు శీతజలమెం ♦ తో గల్గు సంద్రంబునం
దుడుకున్నిళ్ల తరంగ మొక్కఁడు మహో ♦ గ్రోద్వృత్తితో గంటకున్
వెడలున్ బెక్కులుమైళ్లు! భూజనులు గల్ ♦ ప్రేమందు! రద్దానిలో
నడగొండల్ వలెనుండు నావలయినన్ ♦ ఖండంబులై పోవుడిన్! 113

గీ॥ గండశిలవంటి తలకాయ ♦ కొండవంటి
యలఘుదేహంబు గల తిమిం ♦ గిలము దనదు!
నదియు నోర్విచ్చెనేని ర ♦ త్నాకరమున
సగమునీరంబుఁద్రావు స ♦ శ్రమముగాఁగ! 114

క॥ జలనిధి నీరాడఁ దిమిం
గిలమొక్కఁడు మ్రింగెఁ! గడుపు ♦ క్రేవను బడి క
న్నులు తేలవైచి కడకెటొ
వెలికిన్ దూఁకితిని దాని ♦ వెన్నుఁదోలుచుచున్! 115

ఆ॥ రోళ్లు పగిలిపోవు ♦ 'రోహిణి'కార్తెలో
బట్టబయటఁ జట్టు ♦ బండపైనఁ-
బైని గుడ్డలేక ♦ పండి నిద్రించెద-
నెన్నిగంటలైన ♦ నెండకోర్చి. 116

గీ॥ క్ష్మా జల కృశాను మారుతా ♦ కాశములను
పంచభూతములకును జే ♦ ద్పడఁగఁజోను!

యోగముల కీలెఱింగిన ♦ యొజ్జ నగుట—
నన్ని విద్దెలు నాకుక్షి ♦ నణఁగియుండు! 117

చ॥ ఎఱుఁగదుమీరు! నేఁదెలుప ♦ నెంతయు నబ్రముదోఁచు! దక్షిణో
త్తరకురుభూము లున్నయవి! ♦ తప్పక వత్సరమందు నార్నెలల్
తరణిజనింపఁ! డాఱగు నె ♦ లల్ దిమిరంబు రహింప! దిట్టి య
బ్బురమగుసీమలెన్నొ హాదు ♦ వుర్ గొలుపుర్ ధరణీతలమ్మునర్! 118

గీ॥ అమెరికాఖండ ముత్తర ♦ మందుఁ దవిలి
'హరితఖండంబు' వొలుచు! న ♦ య్యావనియెల్ల
మొలక మొలువని పెనుమంచు ♦ బోడినేల!
గఱికయు లభింప దెన్ని ల ♦ క్షల నొసఁగిన! 119

గీ॥ క్రాలు నొక దేశ మాఫ్రికా ♦ ఖండమనఁగ!
నామహాకుండమున వెల్గు ♦ నగ్నిహోత్ర
రాశియై యొప్పుఁజుమి 'సహ ♦ రా' యెడారి!
దానివర్ణింప బ్రహ్మకుఁ ♦ దరముగాదు! 120

చ॥ పొడవది వేయిక్రోశములు ♦ పో! పరపుర్ మఱి వేయిక్రోసులుం
డెడు పెనునిప్పుఁగుప్పఁ బుర ♦ ణించెడు సైకతవార్ధి! వృక్షముల్
వొడమవు! గడ్డిపోఁచయును ♦ బుట్టదు! నీ రొకచుక్కయైనఁ గ
న్పడ! దొకప్రాణియుర్ దిరుగు ♦ వైఖరితోఁపదు పెక్కులేండ్లకుర్! 121

మ॥ తడిబియ్యంబును మూటగాఁగొనుచుఁ గ్రిం ♦ దర్ దోఁడి యందుంచుచుర్
వడిఁ పై సైకతముంచి కొంతవడికిర్ ♦ బైకెత్తఁగాఁ బక్వమౌ
నుడుకన్నం బయియుండుఁ! జిత్రమిది గా ♦ దో! యెంతెపైనున్నవాఁ
డడుగుర్ దింపక యన్నముర్ గొను నుపా ♦ యం బెందుఁ గన్గొంటిరే! 122

సీ॥ వనరాశినడుమ ద్వీ ♦ పములమాడ్కిని శత
యోజనదూరమం ♦ దొకఁడొకఁడుగ
నీదులు – వానికి ♦ నాదటఁ బాతాళ
మునుదాఁకు నొకనూయి ♦ వొలుచుచుండు!
గుడిసె యొక్కండుండుఁ! ♦ గూపంబునందు బొ
క్కెనడించి నీరమొ ♦ ష్ణునకుఁ జేదఁ
గపిలెఁగట్టుదు! రెడ్లు ♦ కదలిపోయిన మీద
బొక్కెన దరిఁజేరు ♦ పొలుపుఁదెలుపఁ

గీ॥ బరుసముగఁ గేకలిడిన వి ♦ స్పష్టముఁ జేసి
ఛేరి ప్రమోయింతు! నాధ్వని ♦ వినిన పిదప
వృషభములునిల్చుఁ జోదకుఁ! ♦ డిచట గొఱ్ఱె
నను గ్రహించుచు సీరంబు ♦ గొనుచునుండ్రు! 123

క॥ ఆనిర్జలదేశమునం
దానాకమునట్టు లుంచు ♦ నాజలసీమన్
నానావిధముల ఖర్జూ
రానోకహములు దనర్చు ♦ నతిమధురములై! 124

క॥ సారసుధాఖను లాఖ
ర్జూరము లెంతో శ్రమించి ♦ ప్రోవులుఁ బ్రోవుల్
జేరిచితిఁ! బరులకిది నెఱ
వేరెడు పనిగాదు! కోట్లు ♦ వెచ్చపఱచినన్! 125

సీ॥ బుడుగుగోత్త్రీయుల కా ♦ ల్మడినుండి — చక్కెరఁ
'గ్రీకులు' వడయ నే ♦ ర్పించియుంటి!
నాస్ట్రేలియావారి ♦ కడవిదుంపలనుండి
ధాన్యమ్ముఁదీయు వి ♦ ద్యను గఱపితి!
'షహరా' యెడారిలో ♦ జనుల కిసుము నుండి
నేయిఁదీయు విధంబు ♦ నేర్పియుంటి!
బుడుతకీచులు మేఘ ♦ ములనుండి తీయని
పిండివంటలఁబొందు ♦ విధి గఱపితి!

గీ॥ వార్ధిఁదఱువకయుండ — న ♦ పారమైన
నీటిమొత్తంబునందుండి ♦ నికరమైన
పంచభక్ష్యభోజ్యంబులు ♦ వడయు తెఱఁగు
నెలఁత! కురుభూమిజనుల కే ♦ నేర్పియుంటి! 126

చ॥ ఇది హనుమంతుతోఁకవలె ♦ నెంతగఁబెంచిన నంతసాగు! ని
ల్వదు! దినముల్ కొలంది తెలు ♦ పన్ విని మీఱెఱుఁగంగ దృష్టిద
ప్పదు! నిలపైన మీకుఁ గను ♦ పట్టెడు చిత్రము లొక్కకొన్ని! యా
పిదపఁ గనంగరాని వాక ♦ వేయియు లక్షయుఁ గోటి యుండెడున్! 127

క॥ పరితృప్తిఁగనుము నేఁటికి!
మఱువక తే పరుగుదెంచి ♦ మఱికొన్ని మహా

త్రైరచిత్రంబులగూర్చి
పరిపరి వర్ణించుఁ జెవ్వుల ♦ పండువుగాఁగన్ !" 128

చ॥ అనివచియించి మోము దరి ♦ హాసముబెంచి నృసింహభూవరున్
గని "ప్రభువర్య ! నాదుపయ ♦ నమ్మునకున్ సెలవిమ్ము ! ముఖ్యమా
పను లటనుండె ! మీరు నట ♦ వచ్చుట మంచిది ! కార్యజాలమున్
మునుకొనితీర్చి వెండియు మి ♦ మున్ గొనివచ్చి గృహమ్ముఁజేర్చెదన్ !" 129

క॥ అని లేచినిలువ నరసిం
హనృపాలుండు మోము మంద ♦ హాసము చినుకన్
గనిలేచె ! భటుఁడు హయములఁ
గొనివచ్చిన నిద్దఱెక్కి ♦ కొని చని రవలన్ ! 130

"పుష్పావతి యుద్యానమున నలినీరంజను గలిసికొనుట"

క॥ జాలముపై గడియారము
నాలుగుగంటలను దెలిపె ! ♦ నాతుక యేదో
యాలోచనతట్టిన వడి
మైలేచెను మేడపైని ♦ మందిరమునకున్ ! 131

సీ॥ తనశరీరచ్ఛాయ ♦ కనువైన చంద్రాత
పముగేరు పట్టు దు ♦ వ్వలువఁదాల్చి,
పదియాఱుకళల శ ♦ భ్రమరీచి నగు – నగు
మోమునఁ గస్తురి ♦ బొట్టువెట్టి,
మేఘంబుపైఁ గ్రాలు ♦ మెఱుపట్లు కేశపా
శమునందు మల్లెపూ ♦ సరులు ముడిచి,
శేషఫణాగ్రరో ♦ చిశ్శోభిమణిమాడ్కిఁ
గరమున ముద్దుటుంం ♦ గరముఁ దొడిగి,
గీ॥ ధరకు దిగివచ్చు క్రొక్కారు ♦ మెఱుపనంగ,
క్షోణివిహరించు వెన్నెల ♦ సోగయనఁగ,
భువనసౌందర్యదేవతా ♦ పూర్ణమూర్తి,
వనిత పుష్పావతీదేవి ♦ వనికిఁ జనియె ! 132

గీ॥ అమలవాఃపూరపూరితం ♦ బై తనరు
పద్మకాసార నీలశో ♦ భలను గేరి
మొగలిపల్లియ దెసనుండి ♦ సొగసుగులుకు
చిన్నియోడ యచ్చోటికిఁ ♦ జేరవచ్చె ! 133

మ॥ అనిలోద్ధూతమృదూర్మిమాలికల వే ♦ గాస్వేతమై వ్రాల్చె
కొని యేతెంచుచు - నల్లకల్లోలజెడం ♦ గుం జప్పరంబుల్లు - మో
హనమాహేంద్రశిలావినిర్మిత గృహం ♦ బ ట్లొప్పి పావోనియున్
దనరెన్ గన్నులపండువై కరముఁ జ ♦ త్రంబై విరాజిల్లుచున్ ! 134

చ॥ పడవయుఁ గూలమున్ దరియ ♦ వచ్చుచు నిల్చెను! దానినుండియున్
వడి రుచిరాంగుఁడొక్కఁడు చి ♦ వాలునఁ దిగి ముందైన మాఁకె యుఁ
దడలేడు వృక్షమూలమున ♦ కయ్యెకుడంబు బిగించి. చెట్టులన్
బడి చొఱఁబాఱి ముందు నడు ♦ వన్ దొరఁగెన్ గనుఁ శ్రమగామియై! 135

మేఘవిస్ఫూర్జితము ॥
శరచ్చంద్రాకాశాస్యన్ ద్విరదగమనన్ ♦ జాతరాజీవనేత్రన్
స్ఫురల్లజ్జాభారన్ మృదులహృదయన్ ♦ శుద్ధసౌశీల్య - శోభా
దరిన్ శ్రీమత్కల్యాణిని - శుభగుణన్ ♦ వారహాసోజ్జ్వలాంగిన్
మదన్నాశీతుల్యన్ గనియె నతఁడున్ ♦ మాలతీమాల్యయుక్తన్ ! 136

మేఘవిస్ఫూర్జితము ॥
కృతప్రజ్ఞున్ రాకాహిమకరముఖున్ ♦ గీర్తివర్తిష్ణుఁ బుణ్య
వ్రతున్ శుద్ధస్వాంతున్ మదనసదృశున్ ♦ భాసురాస్లానివేషున్
స్మితజ్యోత్స్నాపూర్ణున్ సుగుణగణను ♦ శ్రీవిలాసాభిరామున్
బ్రతాపశ్రీధుర్యున్ బడతి నలినీ ♦ రంజనున్ గాంచె రక్తిన్ ! 137

మ॥ కలఁతన్ జెందినభావవేగముల చీ ♦ కాకింతతగ్గింగ - నా
నలినీలోచన కల్వపూసరులు పై ♦ నన్ గప్పుచుందాన - న
త్తెలివాల్గన్నులనెత్తి దివ్యకళలన్ ♦ దీపించు క్రొమ్ముద్దుచూ
పుల నీరాజనమెత్తె వీరుని ముఖాం ♦ భోజంబు విప్పారఁగన్ ! 138

గీ॥ "చాన! నిన్నటిమాట ని ♦ జంబుసేయ
నిపుడె వచ్చితె! నీకృప ♦ కేది మేర!
నాహృదయ పుష్ప మిపుడు కా ♦ న్కగనొసఁగు
వాఁడ" నని రక్తిని శిరంబు ♦ వాల్చి, యతఁడు, 139

క॥ "తడవుగ నిలిచిన నొడలును
బడలునొ! యటువచ్చి పొదరు ♦ పరగడ రంజి
ల్లెడు నీడను గూర్చుండుము!
ముదుఁగని పూసురటి వీచి ♦ ముద మొదవింతున్ !" 140

క॥ అన - "నినుగనుటయు పదివే
లని ప్రాణములేచివచ్చె! ♦ నల్లన నిటకేఁ
జనుదెంచిన వేళకె నీ
వును వచ్చితి! వింతకన్నఁ ♦ మోదముకలదే" 141

క॥ అని వనితయు వీరుండును
గొనబగు పొదనీడఁ జేరి ♦ గూర్చుండిరి! మె
ల్లనఁ బుష్పావతిచరితము
వినఁగోరుచుఁ దలఁపుదెలిపె ♦ వీరుం డపుడున్! 142

"పుష్పావతీదేవి చరిత్రము"

మ॥ "నలినీరంజన! నాచరిత్ర కథ వం ♦ తన్ గూర్చు! సంక్షిప్తరీ
తుల వ్రాక్రుచ్చెద! రాజకీయములయం ♦ దున్ నాకుఁ బూర్ణానుభూ
తులు లే! వైనను నేర్చుచందమున నీ ♦ తోఁబల్కుదున్! నీవు త
ప్పులువాటింపక యందుఁగల్గు విషయం ♦ బున్ గొన్న హర్షించెదన్! 143

మ॥ పరమోదారమృదుస్వభావుఁడనుచున్ ♦ బ్రత్యగ్రకారుణ్యభా
స్వరచిత్తుండనుచున్ జగంబు వినుతిం ♦ పన్-భూరివీరాహితో
త్కరమున్ గెల్చుచు - రాజ్యమేలెను జనుల్ ♦ కైవారముల్ చేయ-భా
స్వరతేజస్వి ప్రతాపభూవరుఁడు - 'రీ ♦ వా' ధారుణీమండలిన్! 144

గీ॥ అమరసంస్తుత్యగుణధాముఁ ♦ డా ప్రతాప
భూమిపతి నా కనుఁగు మేన ♦ మామ యగును!
మనసు మెత్తన-నిలువెల్ల ♦ మంచితనము—
ధారుణీశు లందఱకుఁ గో ♦ టీర మతఁడు! 145

క॥ మామామ - చెలియలిని శ్రీ
రామనుబోలిన వసుంధ ♦ రాదేవిని సు
శ్రీమెఱయ నాదుతండ్రికిఁ
బ్రేమముదైవార నొసఁగి ♦ పెండిలి చేసెన్! 146

క॥ రామాపురమను నొక కు
గ్రామంబున నాదుతండ్రి ♦ కాపురముండెన్!
శ్రీమహితుఁడు మామామ కృ
పామతిమై యుపకరించెఁ ♦ బలుచందములన్! 147

గీ॥ మొదటనుండి రీవారాజ్య ♦ భూరిలక్ష్మి
యనుపమాన స్వతంత్రత ♦ నలరెఁగాని—

చ॥ ఇరువదియేడులున్ గడచె! ♦ నిప్పటి కిచ్చట నీవిధాన నుం
డిరనుచు వార్తలేదు! మహ ♦ నీయ మహోన్నతరాజ్యభోగముల్
వఱల సుఖింపఁగావలయు ♦ వారలఁ గ్రూరపుదైవ మెట్టి దు
స్తరవిపదబ్ధి ముంచెనో! వి ♦ చారముగూర్చి మనంబుఁగోయదే! 156

సీ॥ మామామగారి రీ ♦ వామహామహో-మహో
బా రాజమణిక్రిందఁ ♦ జేరియుండు!
నామహోబారాజ్య ♦ మంకితంబగుచుఁ గ
న్యాకుబ్జపతిక్రింద ♦ నణఁగియుండు!
గోణఁగుచున్నను గాన్య ♦ కుబ్జ-మింద్రప్రస్థ
సార్వభౌము నధీన ♦ సరణి నుండు!
నాచక్రవర్తి పృ ♦ థ్వీచోహణుఁడు నూట
యెనమండ్రురాజుల ♦ కేలికయయి!

గీ॥ వేయియుద్ధంబులను గెల్చి ♦ వేయి విజయ
ములు గొని 'జగత్పతి' యనియు ♦ 'భూరిభరత
ఖండ మార్తాండుఁ'డనియు వి ♦ ఖ్యాతిఁగాంచెఁ!
గలుగఁ డంతటి ఘనుఁడు త్రి ♦ కాలములను! 157

సీ॥ తుహినాద్రినుండి సే ♦ తువుదాఁకఁ దనరు స
ఖండభారతఖండ ♦ మండలంబు
సకల మేకచ్ఛత్ర ♦ సామ్రాజ్యముగ ధరి
త్రీరాజ్యమేలెఁ పృ ♦ థ్వీమహీంద్రుఁ!
డతనిసంగ్రామజ ♦ యంబులు మఱి ధర్మ
సంస్థాపనాచార్య ♦ చతురతలును
బహుళసామంత వి ♦ శ్వంభరాధీశుల
పౌరుష విక్రమ ♦ ప్రాభవములు!

గీ॥ నిరువదేండ్లప్రాయమునకే ♦ యెల్లజగము
హృదయమున మెచ్చి తద్దకీ ♦ ర్తించియుండె!
నంతటిమహానుభావుఁ గృ ♦ తాంతవీర్యు
నిల యెఱుంగ దిప్పటికి! ముం ♦ దెఱుఁగఁబోదు! 158

శా॥ రామక్ష్మాపతి నిల్వఁజాలఁడు! కురా ♦ రస్ఫారుఁడౌ రాముఁ డెం
తేమోయుండు! మహానుభావుఁడు యయా ♦ తిక్ష్మాపు శౌర్యంబు వ
ర్ష్మమంటన్ గలియున్! భగీరథునిశ్రే ♦ యం బంతమౌఁ! దేజమం
దే మాంధాతయుఁ నీఁడుగా దతని కీ ♦ యీరేడు లోకంబులన్? 159

సీ॥ తెలిసి యాత్మపితామ ♦ హుఁడగు రాజ్యలక్ష్మి యు
త్తవయస్కుఁడై యున్న ♦ తనకొసంగక-
రెండవకూతు కూ ♦ రిమిపుత్రకుండైన
పృథ్వీశునకు నిడఁ గో ♦ రించి వచ్చి
జయచంద్రుఁడును బగ ♦ సాధింప-ఢిల్లికై
బలుమాఱు లనిచేసి ♦ బల నొసఁగె!
నది మొదల్ ఢిల్లి-క ♦ న్యాకుబ్జరాజ్యంబు
లన్నితేకయ ద్వేష ♦ మగుచునుండెఁ!
గీ॥ తెలియలు దెలింప-జయచంద్ర ♦ కీర్తిపుఁ జాతె
తనయ సంయుక్త నాఁకియు ♦ త్తివికిని స్వ
యంవరము నాతె! నిప్పటి ♦ కైదునెలల
క్రింద జగమెల్ల జయవెట్టి ♦ కేక లిడఁగ! 160

మ॥ యువతీలోకము మేలుబంతియగు సం ♦ యుక్తామహాదేవి హృ
ద్భవసౌందర్యవిభాసిఁ బృథ్వివిభు సం ♦ ప్రార్థించె 'సైన్యంబుఁ దె
చ్చి వెసన్ దన్ గొనిపొ'మ్మటంచు! జగముల్ ♦ చీకాకుఁ బొందంగఁ బా
ర్థివలోకేశుఁడు వచ్చి ఢిల్లిపురిఁజే ♦ ర్చెన్ గన్యఁ గొంపోవుచున్! 161

మ॥ జననాథుల్ గుమిగూడి నవ్వఁగ-నిజా ♦ స్థానంబు మధ్యంబునన్
దననేత్రంబుల ప్రోలఁ బెంపుడనుతన్ ♦ దర్పాఢ్యుఁడై చోహణుఁ
డును గొంపోవ-విషాదమొంది జయచం ♦ ద్రుండా మహావీరు మా
ర్కొన నంపించె బలంబునిచ్చి విహిత ♦ క్షోణీశవర్గేణులన్! 162

సీ॥ జయచంద్రుసైన్యముల్ ♦ చక్రవర్తినిదాఁకె!
మూఁడుచోట్ల నడుమ ♦ పోరు నడచెఁ!
బృథ్వీశ్వరుఁడు ఢిల్లి ♦ కేగి సాయము నంపె!
క్షతగాత్రులకు సేవ ♦ సలుపుకొఱకు!
నలమహాభానేత ♦ యగు పూర్ణమల్లుండు
హతశేషులందఱు ♦ కుతుక దఱిగెఁ!
దనవార లీవార్త ♦ వినిపింప సార్వభౌ
ముఁడు వీతిహోత్రుని ♦ వడువుమండి!
గీ॥ స్వయముగా సైన్యములఁ గొని ♦ వచ్చి పూర్ణ
మల్లురాజ్యంబుఁ జెడఁద్రొక్కి ♦ కొల్లగొట్టి

యగ్నికరియించి యఖిలసై ♦ న్యము నణంచి
కీర్తిసమస్త బంధనము ♦ చేసికొనిరె! 163

సీ॥ పృథ్వీపతి మహాజాక్షితి - ♦ కేలి కయ్యో!
నిచట కివాధరిత్రి క ♦ ధీశుఁడయ్యో!
సకలభారతఖండ స ♦ ర్వాధికారి!
యతనిమాట సుగ్రీవాజ్ఞ ♦ యై రహించు! 164

శా॥ ఈనైవాహికదివ్యవాసరము లెం ♦ తేహర్షముం గొల్పుఁ బృ
థ్వీవిశ్వంభరభర్త! కట్లగుట నీ ♦ వేళావిశేషంబునన్
రీవారాజ్యము నాకు మామ కిడినన్ ♦ రేకెత్తుఁబో నాదు చే
తోవీథిన్ వివరింపరాని ఘనసం ♦ తోషం బుదాత్తంబుగన్! 165

ఉ॥ ఏమదనోపముండయినఁ ♦ బృథ్వీమహీశ్వరు సంప్రతించి రీ
వామహి నాదునూను కిడ ♦ వైనముఁగూర్చిన-నట్టివాఁడు సు
శ్రీమితి లేనివాఁడయినఁ ♦ జిత్తవిశుద్ధి వరించి జీవితం
బామెతసేయ నేఁబ్రతికిన ♦ నొందలఁదాల్చితి వీరపుంగవా! 166

కం॥ జనని మరణించుటాదిగ
నను నామేనత్త సాఁకె ♦ నర్మిలిమై! నా
ఘనురాలు గతాబ్దంబున
ననువీడి యలంకరించె ♦ నాకపురమ్మున్! 167

చ॥ ఇరువురుఁ జోనకత్తియలు ♦ నేనును నాజనకుండు భృత్యులి
ద్వరు వసియింతు మింటఁ! బిత ♦ యుండు నన్ గడుగారవంబుతో
నరయును! సుంత మాట కెదు ♦ రాడిన నోర్వఁ! డొకింత కోపవి
స్ఫురణము దోచుఁగాని మనమున్ గడుమెత్తనయై తనర్చెడిన్! 168

క॥ పదునెనిమిదేండ్లు నాకివు!
డిది నాదువిధేయచరిత! ♦ మెద దాపఱికం
బొదవంగనీక దెలిపితి!
మది నలరుదువేని-బుణ్య ♦ మాన్యత లలరన్!" 169

మ॥ అని యాత్మీయచరిత్రమున్ దెలియఁజే ♦ యన్-గన్నులార్ద్రంబులై
తనచిత్తాంబురుహంబునం దుబుకు సం ♦ తాపంబుసూచింప నం
గనమోమున్ గని 'నీచరిత్రము వినం ♦ గా నామనంబున్ గఱం
చెను! మాధుర్యరసప్రవాహకరుణా ♦ శ్రీసొంపుదీపింపగన్! 170

"నలినీరంజనుని ప్రణయ సాహసము"

మ॥ నెలఁతా! కష్టముతోడిసంఘటనముల్ ♦ నెక్కొన్న మీమామ కో
మలచారిత్రము – వారియున్నతకుటుం ♦ బం బొందుకష్టాళి వీ
నులు సోఁకంగనె ముందు నాదుతలిదం ♦ డ్రుల్ వస్త్ర యానావిప
త్తులు నాకన్నులఁగట్టినట్టు లెదురన్ ♦ దోచెన్ మనం జేర్చుచున్! 171

క॥ నీమేనమామయందును
నామహనీయుని కుటుంబ ♦ మందును గల నీ
ప్రేమాభిమానములు విన-
నీమన మతిమ్మృదుల మనుచు ♦ నేను దలంతున్! 172

సీ॥ నీవు పితృంద్రితో ♦ రీవామహారాజ్య
విభవంబుల ననుభ ♦ వించుచుండి–
"మాకురాజ్యసుఖంబు ♦ లేకున్నమానె – మా
మామ సౌఖ్యముగల్గి ♦ మనినఁ జాలు!"
నని వచించుట నీదు ♦ స్వార్థరాహిత్యంబు
పరహితవృత్తి వి ♦ స్పష్టమయ్యె!
స్వార్థపరత లేని ♦ జనులు మందున కైనఁ
గనుపింప రొక్కకీ ♦ క్ష్మాతలమున!

గీ॥ నీమహానర్ఘసౌశీల్య ♦ మెంచి–నిన్ను
విశ్వమంతము భక్తి సే ♦ వింపవలయు!
మధురమధురాతిసుగుణసం ♦ పదల–నన్ను
విలుచుకొంటివి పూల సం ♦ కెలలు వైచి! 173

శా॥ ధీరాగ్రేసరచక్రవర్తియగు పృ ♦ థ్వీరాజు దుస్సాధ దు
ర్వారప్రాభవశౌర్యశోభితుఁ! డథ ♦ ర్మంబో ర్వఁబోనట్టి స
త్కారుణ్యాంబుధి! నీదుమామకు దివా ♦ ణ్మారాజ్య మిప్పించి-స
త్కారంబున్ జరిపింపవచ్చుఁ దరుణీ ♦ దైవంబు తోడైనచో! 174

చ॥ లలితశిరీషపుష్పమృదు ♦ లంబగు నీమది నెప్పుడేనియున్
గలఁత జనింపకుండఁ గుత ♦ కం బలరారెడుఁగాతమంచు నేఁ
గలలనుగూడ దేవుని ని ♦ గారపుభక్తిని వేడుచుందు! రం
జిలుము సమస్తభాగ్య సుఖ ♦ జీవనముల్ దయివార, మానినీ! 175

క॥ మనమొకటయ్యెఁ బరిమితమై
నను – మనసులు గలిసిపోయి ♦ నవ్యోత్సాహం

బును ననురాగాంకురమును
జనియింపఁగఁజేసి మదికి ♦ సౌఖ్యముఁగూర్చెన్! 176

సీ॥ బంగారుపూఁతలు ♦ ప్రకృతికిఁబూసి రా
జీవమిత్రుఁడు ప్రకా ♦ శించుచుండె!
జలిబిలిరొదల ము ♦ ద్దులుగుల్కు యీవేళ
యే కటు చేరువఁ ♦ బాఱుచుండె!
సంఫుల్లమై సువా ♦ సనగొల్పి యీప్రసూ
నములును గలకల ♦ నవ్వుచుండె!
మధురానుభవమహి ♦ మ నుపన్యసించుచు
ఫలములు కొమ్మల ♦ పైనఁ దనరె!
గీ॥ సృష్టి యెల్లెడ శోభావి ♦ శిష్టమగుచుఁ
జెలువగపుగొల్పఁగా, మన ♦ జీవితంబు
లాశ్రయబలంబు లేక – సౌ ♦ ఖ్యంబు లేక
వాడునో యంచు మానినీ ♦ వనటగలిగె!" 177

మ॥ అని చింతాకులచిత్తవృత్తి కుచితం ♦ బై తోఁచి ప్రాతర్మనో
జ్ఞనవోత్ఫుల్ల సహస్రపత్రదళవి ♦ స్తారాక్షులన్ జెమ్మగిం
చినఁ – గన్యాతిలకంబు కన్గొని "యిటుల్ ♦ చింతింపఁగా నేల! నీ
మనమున్ దాపక విప్పిచెప్పుమని సం ♦ ప్రార్థింతు వేభంగులన్! 178

చ॥ ఇరువదినాల్గుగంటలకు ♦ నించుకతక్కువ మైత్రి – ద్వీపి జ
ర్జరితముసేయఁగల్గితివి! ♦ ప్రాణ మొసంగితి! దైవ మిట్లు నీ
స్థిరతరరూప మొంది యరు ♦ దెంచెనటంచు ముదంబుఁగంటి! నే
కొఱతయు లేదు! నీమదిని ♦ గొందల మందఁగనేల చెప్పుమీ! 179

ఉ॥ వీరనృసింహరాయఁ డరి ♦ వీరకృతాంతకుఁ! డాగుణాబ్ధికిన్
గూరుచుపుత్రి కేసిరుల ♦ కున్ గొఱలేదు! ధనంబుగాని – బం
గారముగాని – పెద్దవెల ♦ గల్గిన వల్వలుగాని – నిస్తులం
బౌ రతనాలుగాని – ముద ♦ మార నొసంగెద నీవుకోరినన్! 180

మ॥ ఇటఁ జింతింపఁగఁదగ్గ యంశము లవం ♦ బేలేదు! నేనుందు న
న్నిట నీసాయముగాఁగ! నీవలయువా ♦ నిన్ మాటయున్ నీదుచెం
గటనుండంగనె సంఘటించి ముదమున్ ♦ గల్గింతు! నాచిత్తమే
కుటిలత్వంబు నెఱుంగ! దీవు మది సం ♦ కోచింపఁగా నేటికిన్? 181

మ॥ దరహాసాంకురపూరితముల్ నెఱుపు ని ♦ ద్రంబైన నెమ్మోముతో
సరసంబైన ప్రసన్నవీక్షణముతో ♦ సౌహార్ద చిత్తంబుతో
సరసంబుఁ గల్గించు నామదికి! నీ ♦ వై చేయఁగాఁబోని దు
ష్కరకార్యం బొకఁడైన నాకు రహింపఁ ♦ జాలేదు సత్యమ్ముగన్. 182

సీ॥ అక్కరైనపుడు నీ ♦ వ్యయమునకై దాఁచి
కడఁగనుంచిన ధనా ♦ గారమనుచు!
మనసును విప్పి సం ♦ భాషించి యన్యోన్య
హర్షమిఁగలుగు స ♦ ఖ్యమ్ము యనుచు!
వలగొన్న శివమనో ♦ వ్యథఁదొలఁగించి యు
పశమన మిడెడు వ్యా ♦ ధ్యంఘ వనుచుఁ!
బరమాయురారోగ్య ♦ భాగ్యంబు లిడఁగ
సని కోరుకొను పర ♦ మాత్మ యనుచుఁ!

గీ॥ దలఁచి సమయాసమయముల ♦ వెలితి లేక-
భేదమెంచక-పనిగొని ♦ వేయుగతుల
సాయమొనరించి సేవింప ♦ సదవకాశ
మిచ్చి-యిరువుర సౌఖ్య మా ♦ హించు మిత్రు!" 183

క॥ అని - యరమర లేకుండఁగఁ
దనహృదయము విప్పి పలుకు ♦ తఱి శ్రేష్ఠుణ మో -
మును బరమాదరమునఁ గను
గొని నలిసిరంజనుండు ♦ కుతుకం బలరన్! 184

క॥ "పరమాహ్లాదకములు-నా
దరమేదురములును-నవసు ♦ ధా మధురములున్ -
నిరతజగత్ప్రియములు - సుం
దరి! నీమాటలకు నేను ♦ దనిసితి-మిత్రులన్! 185

"నివేదనము"

ఉ॥ నాయెడ నీవుచూపెడు మ♦నఃపరితోషము - మైత్రి వృత్తిధౌ
రేయత-చిత్తముఁ గఱచు ♦ ప్రీతియు - సేమముఁ గోరు భంగులన్-
వేయివిధంబులన్ దలఁచి ♦ నెమ్మది మిక్కిలి శాంతిఁ గందు! నా
వేయి నమస్సు లిచ్చెద ని♦వేదన సేతుఁ బరిగ్రహింపుమా! 186

మ॥ వసుధారాజ్యము లేకపోయెనని లో♦పం బొక్కఁడే కాని వ
స్తుసమూహంబులు వస్త్రముల్ ధనము దా♦సుల్ దాసులై యుండు! నీ

దు సుహృద్భావముతోడ - వేనికిని నెం♦దుర్ లోపముల్ లేవు! నీ
విసుమంతైనను జింత నొందవలదో ♦ యిందీవరాక్షీమణీ! 187

ఉ॥ నీనిబిడాదరంబును గ♦ణింతును నేఁబది వేలమాఱు! లెం
డైనను నీ విశాలజగ♦మందున నాకు శుభంబుఁ గోరఁగాఁ
బూనినదాన వొక్కతెవు ♦ వొల్తు వటం చను గంపెడాస య
జ్ఞానన! జీవితంబున క♦నంతసుఖోన్నతిఁ గూర్పఁజాలెదన్! 188

మ॥ త్వరమైె మార్పులు నాపరిస్థితుల రా♦వచ్చున్! మహీరాజ్యమున్
వఱలన్ వచ్చును! నన్నుఁ జేరఁగల సం♦పత్తున్ బలంబున్ భవ
త్పరమున్ జేయుచు నీమహోన్నతికి య♦త్నంబూని సత్కీర్తినిన్
బెరుఁగన్ జేసెద! నింద్రభోగము సుమీ! ♦ విన్గొల్చుటల్ మానినీ! 189

మ॥ చతురంభోధిపరీతవిస్తృతమహా ♦ క్ష్మాసీమ నీప్రాణి నా
కతిమోదంబు ఘటించు - నీమె కొఱకై ♦ ప్రాణంబుతోనుందు నన్
స్థితి లేకుండెను! నేఁడు నీకతమునన్ ♦ సిద్ధించెఁ బుణ్యంబు! జీ
విత ముత్సాహముతోడఁ దీర్తు జగముల్ ♦ ప్రీతిన్ బ్రశంసింపఁగన్. 190

ఉ॥ త్రోవయుఁ దెన్ను లేని విధి ♦ త్రోవులఁ జేడ్పడి కుందుచుంటి! నా
దేవుఁడె నన్ను నీకడకుఁ ♦ దెచ్చె! మహాగుణవార్ధివౌ జగ
త్పావని వౌదు! విర్వురకుఁ ♦ బర్విన మైత్రియు నిన్న నేఁటిదే!
భావము నొవ్వదేని యొక ♦ ప్రార్థన మున్నది! యాలకింపుమీ! 191

చ॥ త్వరపడుచుంటినో! వ్యవధి ♦ తక్కువొ! లేక పరస్పరంబునొ
మెఱుక బలంబుచాలనిదొ! ♦ యే నిసుమంత యెఱుంగ! దైవవి
స్ఫురణము ముందుద్రోసెడిని ♦ పూర్ణసుధాంశునిభాస్య! తప్పుగా
నరయవటంచు నమ్మి హృద ♦ యం బెటులో యిట విప్పిచెప్పెదన్! 192

క॥ నీవిపుడు భేద మెఱుఁగని
భావముతో మెలఁగ నటులె ♦ వర్తించుటయున్
నావిధియని కొంచెము దై
ర్యావిష్కృతిఁగంటిఁ జెలి! కృ ♦ పా ప్తిన్ గనుమీ! 193

సీ॥ అనురాగదృష్టి న ♦ న్నాదరించితివి! నీ
హృదయ మారాధింప ♦ నిచ్చినావు!
దీనికిఁదోడు నీ ♦ దివ్యకల్యాణ జా
గ్రన్మహారుచిరవి ♦ గ్రహము నాదు.

నింటఁ బ్రతిష్ఠించి ♦ యెపుడు నారాధ్యమ్మని
క్షణమైనఁ బాయక ♦ కరముభక్తి
నెదుర మోకరించి ♦ హృదయపూర్వ మొనర్చి
మామకహృదయ సా ♦ మ్రాజ్యలక్ష్మి

గీ॥ మూర్తిఁగొనినట్టి మత్పూర్వ ♦ పుణ్యఫలము
తనువుధరియించు దివ్యసౌం ♦ దర్యధనము
గా మదినిగొల్చి సంతృప్తిఁ ♦ గనఁగలిగిన
వనిత! నామహాభాగ్య మే ♦ మనఁగవచ్చు! 194

మ॥ సతి! యాత్మార్పణఁజేసి కొల్వ నవకా ♦ శంబిచ్చి గాఢాంధకా
రతతిన్ మున్గుచు నాస లూఱటలు దూ ♦ రమ్మైన మత్పూర్ణజీ
వితమున్ నూత్నమహాకళాభ్యుదయసం ♦ స్థితంబు గావింపుమీ
ప్రతికూలాచరణంబులేక యనుచున్ ♦ బ్రార్థింతు మున్మాటికిన్!'' 195

మ॥ అని - వాసంత జయంత మన్మథ మనో ♦ జ్ఞాకార రేఖావినూ
తనశృంగారముఁగొల్పు దేహముఁ బద ♦ ద్వంద్వంబు సామీప్యమం
దున వాల్చెన్! సతి ''శ్రీహరీ! యిదియు నెం ♦ దున్ గల్గునే! లెమ్ములె''
మ్మని దోర్యుగ్మముఁబట్టి లేపె! నతనిన్ ♦ హార్యత్నశౌర్యోజ్జ్వలున్! 196

క॥ వనితయు బుజ మంటుచు లే
పినను గగుర్పాటునొంది ♦ వీరుఁ డపుడు నూ
తన తేజస్థగితుండై
తనరెన్ బుష్పావతీ ని ♦ తంబిని గనుచున్! 197

మ॥ ''నినుబాధింపఁగఁ గోర్కిలేదు! కరమున్ ♦ నిర్బంధమున్ జేసి నీ
మనసున్ మార్పను! నాదు తీవ్రతకునై ♦ మన్నించి వీలౌ విడం
బనమున్ గైకొని యోజనన్ సలిపి నీ ♦ భావానుకూల్యంబు నా
కు నెఱింగింపుము! నీదువాక్యముల నా ♦ కున్ నమ్మకం బుండెడున్! 198

క॥ జీవితమంతయు నీదగు
పావనసేవనలఁ గడుప ♦ వలసిన నేనే
త్రోవ విడిచి నినుగలఁచిన
మేవడిమెయిఁ గంచె చేను ♦ మేయుట గాదే! 199

గీ॥ అంబరముపైన ప్రవాలిన ♦ నభ్రు లేదు
పొంగివచ్చిన భూదేవి ♦ క్రుంగిచనిన

నాకుఁ గొంటుప్రాణములును గం ♦ తమున నున్నఁ
బ్రియతమా! నీదు తలపూవు ♦ ప్రిదులనీను!" 200

క॥ అని వీడుఁడనఁగ నెలఁతుక
తననిడువాల్చూపు లవుడు ♦ ధరవాల్చుచు వీ
డనిహృదయమును గ్రహించుచుఁ
దనమది యోజించి యోడ్న ♦ దనర-నతనితో! 201

"నలినీరంజను విషయముఁగూర్చి పుష్పావతి యోజించుననుట"

ఉ॥ నీనుడు లాలకించితిని! ♦ నీహృదయస్థిత భావవైఖరుల్
నేనుగ్రహింపఁగల్గితిని! ♦ నీయెడ నే నిసుమంత భేదమున్
గానను! నీవు పల్కినది ♦ నైజమ యౌఁగద! దోస మున్నదే!
యైనను స్థైర్యమూని విష ♦ యంబును దేల్చుట యొప్పు డొప్పగున్! 202

మ॥ అనుఁగుందల్లిని బాసినట్టి యొకక♦న్యన్! బ్రాయమా-స్వల్పమా
టను లోకానుభవంబుచాల! దెదురా ♦ డన్ రానివాఁ డల్లనా
జనకుం! డాతని కేకపుత్రికను! నీ ♦ సందర్భముల్ మంతనం
బున యోజింపక యెట్లు లిట్టి విషయం ♦ బున్ నిర్ణయింపన్ దగున్! 203

క॥ నిరతంబు డండ్రిమఱుఁగునఁ
దిఱుగవలయుదాన నగుటఁ ♦ దెలియము! 'కన్యా
పరతంత్రా!' యనుటయు నీ
యెఱుఁగని ధర్మంబొకో!య ♦ హీనవిచారా! 204

శా॥ ఏమీ తొందర! యుంద వీ విచట! నే♦నిందుందుఁ! బల్మాఱు రా
మా! మాటాడుకొనంగఁబోము! మది ని ♦ ర్మగ్నంబులౌ కోర్కు లెం
తో మోదంబునఁ జర్చచేసికొనమా! ♦ తోషంబునున్ బొందమా!
యేమో దైవము ప్రాతికూల్యముల ని ♦ ల్లెపెంచునా యెప్పుడున్! 205

చ॥ ఇనుఁ డపరాంబురాశిఁ బడ ♦ నేగెడి! నెప్పుడు వత్తునంచు నా
జనకుఁడు వేచియుండు! నిఁక ♦ జాగొనరింపఁగరాదు నాకు! నీ
కును బస భోజనంబు లోన ♦ గూడుఁగదా యనునైనభంగి గా"
నన-నలవీరుఁ"డన్నియు సు ♦ ఖాస్పదమై సమకూరి యుండెడున్! 206

ఉ॥ ఆటలఁ బాటలన్ జలవి ♦ హారఘులన్ దమిగల్గు నాకు! న
క్షౌటఁ గలమ్మునొండు సము♦పార్జనచేసి తటాకమందు స

య్యాటల నాడుచుందు! నప్పు ♦ డప్పుడు చంద్రమహల్ మీఁదుండ జా
హాటముగాఁ జరింతు భవ ♦ దంచిత దర్శన మందు నాసతో! 207

చ॥ స్థిరముగనుండ వాపదలు! ♦ శీఘ్రము నాదు సదృష్టిలక్ష్మి సుం
దరదరహాసవీక్షణము ♦ నాపయిఁ గొల్పఁగవచ్చు! నంతకు
ద్వారము రహస్యమాగమ ని ♦ దూఖ మెలంగుడి! మేరితోడ న
న్గుతించి వచింపఁబోకు! మిఁక ♦ గోప్యతపట్టు మొకింత కాలముల్! 208

క॥ జనకుఁడు నీవే లోకం
బని మెలఁగెదు! నతనిచెంత ♦ నైనను నను గా
ర్చినమాట వుట్టకుండుట
చను! సమయము రాగ నన్ని ♦ నమకుఁడ నతివా! 209

క॥ నీమామ కుటుంబమునెడ
నీమదిఁగలభక్తిరతి గ ♦ ణించితి! నీ కి
వా మహిరాజ్యం బతనికి
శ్రీమీఱఁగ సంక్రమింపఁ ♦ జేయఁ గడంగుదుర్!" 210

మ॥ అని యజ్ఞాక్షిముఖంబుచెంగట నిజా ♦ స్యంబుంచి పల్కంగ నా
వనితారత్నము "నేను మాననియతిన్ ♦ బాటింతు! నాపైన దే
వునివాత్సల్యము గల్గినప్పుడె సుఖం ♦ బుల్ మంగళంబుల్ దన
ర్చును! లోకేశుఁడు సర్వశక్తియుతుఁడం ♦ చున్ నమ్మియుందున్ సదా! 211

క॥ నామామగారి రాజ్యం
బామహనీయునకుఁ జేరు ♦ నటుచేయఁగ నీ
వీమెయి నూనిన శపథం
బేమఱఁగాఁబోకు! నిన్ను ♦ నీశుఁడు ప్రోచున్!" 212

క॥ అని యాకసమ్మువంకకుఁ
దనచూపెగనెత్తి నిలుచు ♦ తరళేక్షణ మో
హనహస్తముఁ దనకరమునఁ
గొని వీరుఁడు కనుల నద్దు ♦ కొని వెడలిచనెన్! 213

చ॥ పడతి వనంబులోని సుమ ♦ వారముఁ గోసి యొకింత శీఘ్రపు
న్నడల వనంబుదాటి సద ♦ నమ్మునుజేరఁగఁబోయి తండ్రి వెం
బడిఁజని యోగిరంబుగొని ♦ శైశమ మేడను గమ్మపూలు సొం
పడరెడు సెజ్జ యెక్కి మధు ♦ రామృతపుం గల లావహింపఁగన్! 214

ప్రథమాశ్వాసము

శ్రీ

# పుష్పావతి

## ద్వితీయాశ్వాసము



మ॥ పలుమాఱుల్ మది నావరించెడు సుఖ ♦ స్వప్నంబులన్ నర్మభా
షల సాగించుచుఁ బ్రొద్దుపుచ్చుచు రహ ♦ స్యప్రక్రియారూఢులై
నలిసిరంజనుఁడున్-లతాంగియును నా ♦ నందంబుతోడన్ దినం
బులనున్ ద్రోయుచునుండి రీశ్వరు కృపా ♦ పూరంబుఁ గాంక్షించుచున్ ! 1

మ॥ ఒకసాయంతనవేళ నెప్పటి మనో ♦ జ్ఞోద్యానభాగంబుచెం
తకుఁ బుష్పావతి-మబ్బుఁజొచ్చెడు తటి ♦ త్సౌందర్య తేజంబుతో
నొకచోఁ జేరి మనఃప్రియాగమ సమ ♦ గ్రోత్సాహయై యుండ ను
త్సుకుఁడై వీడుడు పద్మనేత్రకడ క ♦ చ్చో వచ్చి నిల్వంబడెన్ ! 2

గీ॥ కన్నులనె మ్రొక్కి-క్షేమసం ♦ గతులనడిగి-
మగువ పుష్పావతీదేవి ♦ మందహాస
పరమశోభలు వెలయ ని ♦ వాళియెత్తె !
వీడుఁడు (మనంబుగఱఁగి) యు ♦ వ్వాలది డాసి, 3

"నలిసిరంజను సంప్రార్థనము"

మ॥ "నెలలా-రెండును మూఁడునున్ గడచనెన్ ! ♦ నేనింత కాలంబుగా
నెలఁతా! కొల్చుచునుంటిఁ బ్రీతిమెయి! సీ ♦ నిర్దిష్టమౌ భావ మీ
లలియం చించు కెఱుంగఁజాలమికినై ♦ లజ్జింతు! నాలస్యమున్
సలుపన్ బోవక యేదియేనిగతి నా ♦ జ్ఞాపించి మన్నింపుమీ! 4

మ॥ రమణీ! పల్మరు తొందరించి సుకుమా ♦ రంబైన నీదివ్యచి
త్తము నొప్పింతు నటంచు నెంచకుము! నా ♦ తాత్పర్యమెప్డున్ భవ
త్ప్రియదవ్యాప్తిని గోరు! భేద మణుమా ♦ త్రం బుండఁబో! దైనఁ గా
లమునన్ గుత్తపుఁబర్వుతోడ నెపుడున్ ♦ లంఘించుచుండున్ గదా! 5

చ॥ అనుకొనరాని యాసలకు ♦ నగ్గలమై ప్రతికూలకాలవా
హిని కెదురీఁత లీఁది యిపు ♦ డెంతయు డస్సితి! సుంతలాభముల్
గనఁబడకే వృథాశ్రమము ♦ గాఁ దుదముట్టునొ! కట్ట! కాలపుం
దనుజున కేటి జాలి! యువ ♦ తండము గుండెలు బెండుసేయఁడే! 6

చ॥ అరవిరియంపకాయఁ బ్వాద ♦ యూర్జము గాఁడె శరంబు ప్రసన్న! క
కరుణయు నాకుఁ గల్గునొకొ ♦ కల్గదొ తేలుము! నా ప్రియుత్న్నముల్
పరగునొ నీటిబుగ్గలయి! ♦ పాలను ముంచెదొ నీట ముంచెనో!
త్వరనెఱింగించి నాహృదయ ♦ తాపము వాపు కృపాపరాత్మవై! 7

ఉ॥ నీరజపత్రనేత్ర! విను ♦ నీరమణీయ మహాప్రసన్న శృం-
గారవిలాసవిగ్రహము ♦ గాటముగా మదినాటి - రేలు ని
ద్రారహితంబులై చనక ♦ తప్పదు! నీకృపఁగోరి కోరి వే
సారితి! నిప్పుడైన మది ♦ సమ్మతిఁ జూపి సమాదరింపుమా? 8

చ॥ సుమహితరూప! నినడచు ♦ క్షోణి పవిత్రమటంచు నెంచి సా
దములను మోపి నేనడువఁ ♦ దద్దయు జంకెద! నాకుపాలిదై
వమవని యెంచుచుందును! భ ♦ వన్నవమోహనవిగ్రహంబుఁ జి
త్తమునను నిల్పి భక్తివిత ♦ తంబుగఁ బూజ యొనర్చుచుంటిమా! 9

క॥ ఉత్తమకాంతలయెడఁగల
యుత్తమ గుణగణములెల్ల ♦ నొకటయి నీయం
దొత్తగిలియుంటఁ జిత్తము
నొత్తుకొనియెఁ! దొలఁగఁద్రోయ ♦ నలవియె యిపుడున్! 10

సీ॥ లలన! నీకడఁగొన్న ♦ వలపుఁబూమాలఁ దా
ల్పఁగలేను! బూని త్రెం ♦ పంగలేను!
జిత్తమ్ముహత్తు నీ ♦ శ్రీమూర్తి స్థిరముఁ గా
వింపలే! నటుత్రోసి ♦ వేయలేను!
రేల నిద్దురను దా ♦ ల్లెడు సుఖస్వప్నాల
నలఁగలే! నవల గెం ♦ టంగలేను!
నెలఁత! నీవర్పించు ♦ నీరాజనము లాద
రింపలేను! బరిహ ♦ రింపలేను!

గీ॥ నుండఁగాలేను! వెండి లే ♦ కుండలేను!
యెప్పుడెటులౌనొ యనువెత ♦ లుప్పతిల్లి
కలఁత యంతంత కెక్కుచై ♦ నిలిచిపోతిఁ
బ్రళయవాతంబు నడిమి దీ ♦ పంబు మాడ్కి! 11

"పుష్పావతి యంగీకారము"

క॥ అడుగఁగలే కడిగితి! నా
నుడుల కడల వలదు! కృపఁగ ♦ నుంగొని నీవి

ష్టాడఁబోకు దెలిపి యీయాట
నోడఁగూడ్దు" మటన్నఁ జెలువ ♦ యున్ వల్కె మునన్, 12

ఉ॥ "నిక్కము నీవు పల్కితివి! ♦ నేనిఁక కాదని చెప్పనేర్తు! నీ
పెక్కుదినంబులన్ గలఁత ♦ నెంచెడు నీవిషయంబులోని పె
న్జిక్కులనెల్ల నేఁడఁజచి ♦ చేసితి నిర్ణయ మొక్కభంగి! నీ
కొక్కశ్రమంబు గల్గదని ♦ యీఆట నొందుము! చింతఁబాయుమీ! 13

మ॥ నలినీరంజన! నీదు సౌఖ్యమునకై ♦ నాజీవితంబెల్ల ని
శ్చలవిశ్వాసముతోడ నీమృదుపదా ♦ బ్జద్వంద్వమున్ భక్తితో
గొలువన్ నిశ్చయమున్ బొనర్చితిని! నా ♦ కున్ భర్తనై యెప్డు రం
జిలఁగాఁజేయుము! దేవదేవుని శుభా ♦ శీర్వాదముల్ గల్గెడున్! 14

సీ॥ వలపుమైఁగఱఁగి ని ♦ పైన నాసలునిల్పి
నమ్మిన నాదు చం ♦ దంబుఁదలఁచి!
రెన్నాళ్లైన ధా ♦ త్రినిబుట్టుటాదిఁ బ్రే
మించినట్లు మెలంగు ♦ మేలుఁదలఁచి!
తల్లిగారాముచె ♦ ద్దయము లెఱుంగక పెర
వాడు పెంచిన కష్ట ♦ పరతఁదలఁచి!
నడి సన్నలేక ని ♦ ష్కలుషమై మిగుల శ్రే
ష్ఠంబగు నాదు శీ ♦ లంబుఁదలఁచి!

గీ॥ పరమ ధర్మవర్తనుఁడైన ♦ భర్త తనదు
ప్రాణసతి నెట్టులేలు-నా ♦ పగిది నేలు!
తృప్తినొందెదఁ! గాని కో ♦ రికలు కోరి
మనసుఁగలఁపంగ నాకభి ♦ మతముగాదు! 15

క॥ మామామకు రాఁదగు రీ
వా మహిరాజ్యంబుఁగూర్చి ♦ పట్టిన శపథం
బీమెయిఁ దరుమఁ దలఁప! నీ
పై మది నభిమాన మూని ♦ భావజమూర్తీ! 16

క॥ అది మొదలంటఁగ వదలఁగ
మది సొగయదు! పిదపనైన ♦ మంచిప్రయత్నం
బొదవ నడిపి మామామకు
ముదము ఘటించుటయు నీకు ♦ ముఖ్యవిధి యగున్! 17

స్త్రీ డెందంబును కెలిమి యూఱట
నాడగూడన్న ''మఱన్నఁ జెలువ ♦ యున్ హర్షమునన్, 12

ఉ. ''సక్కము సెప్ప పల్కితివి! ♦ నేనటు కాదని చెప్పనేర్తు! నీ
పెక్కుదినంబులున్ గలఁతి ♦ వెంచెదు నీవిషయంబులోని పె
న్జిక్కులనెల్ల నేఁడఱచి ♦ చేసితి నిర్ణయ మొక్కభంగి! నీ
కొక్కక్రమంబు గల్గదని ♦ యూఱట నొందుము! చింతఁబాయుమీ! 13

మ. నలినీరంజన! నీదు సౌఖ్యమునకై ♦ నాజీవితంబెల్ల ని
శ్చలవిశ్వాసముతోడ నిమ్ముదపదా ♦ బ్జద్వంద్వమున్ భక్తితో
గొలువన్ నిర్ణయమున్ బొనర్చితిని! నా ♦ కున్ భర్తవై యెప్డు రం
జిలఁగాఁజేయుము! దేవదేవుని శుభా ♦ శీర్వాదముల్ గల్గెడున్! 14

సీ. వలపుమైఁగఱఁగి నీ ♦ పైన నాసలునిల్పి
నమ్మిన నాదు చం ♦ దంబుఁదలఁచి!
కన్నతల్లియు కథా ♦ త్రినిబుట్టుటాదిఁ బ్రే
మించినట్లు మెలంగు ♦ మేలుఁదలఁచి!
తల్లిగారాముచే ♦ ద్దయు లెఱుంగక పెర
వారు పెంచిన కష్ట ♦ పరతఁదలఁచి!
సడి సన్నలేక ని ♦ ష్కలుషమై మిగుల శ్రే
ష్ఠంబగు నాదు శీ ♦ లంబుఁదలఁచి!

గీ. పరమ ధర్మవర్తనుఁడైన ♦ భర్త తనదు
ప్రాణసతి నెట్టులేలు-నా ♦ పగిది నేలు!
తృప్తినొందెదఁ! గాని కో ♦ రికలు కోరి
మనసుఁగలఁపంగ నాకభి ♦ మతముగాదు! 15

క. మామామకు రాఁదగు నీ
వా మహీరాజ్యంబుఁగూర్చి ♦ పట్టిన శపథం
బీమెయిఁ దడుమఁ దలఁప! నీ
పై మది నభిమాన మూని ♦ భావజమూర్తీ! 16

క. అది మొదలంటఁగ వదలఁగ
మది సాగదు! పిదపనైన ♦ మంచిప్రయత్నం
బొదవ నటించి మామామకు
ముదము ఘటించుటయు నిక ♦ ముఖ్యవిధి యగున్! 17

ఉ॥ నాదెస నీకుఁ గల్గిన ఘ ♦ నంబగు ప్రేమభరంబు - వాక్ష మ
ర్యాద - పవిత్రభావము - స ♦ మాదర వృత్తియుఁ - జిత్తశుద్ధి - యా
హ్లాదముఁ గూర్చె! నేఁబత ♦ త్రైనను గల్గదు! నీవు మాధవా
నాదగు దైవతంబవని ♦ నమ్మి చరించెదఁ జిత్తశుద్ధితో! 18

మ॥ కులకన్యోచిత శీలపోషణము నా ♦ కుఁ బ్రీతియౌఁ గావునన్
దెలుపన్ భావ్యము నాదుతండ్రి! కతఁడున్ ♦ డెందంబునన్ సమ్మతిన్
గొలుపన్ గల్గునొ! లేదొ! యూరకిపుడీ ♦ కోలాహలం బేటికిన్
సలుపంగావలె నంచు నాతనిదెసన్ ♦ మానంబుఁ బాటించితిన్! 19

ఆ॥ జనకుఁ డనుమతించినను బ్ర ♦ శస్త! మల్లు
కాక - వలదనె నేనియు ♦ గాలికేగు
తరువుఁ బైనెచుకొనుటయుఁ - ♦ దప్పి నీ చ
రిత్రఁ దెలుపుట - తప్పులు ♦ రెండు గలుగు. 20

మ॥ జలమున్ దిండిని సంతరించుచుఁ గృపా ♦ సారళ్య మేపారఁగా
శిల గోఁబుట్టిన కప్పఁ బెంచుచు జగ ♦ త్క్షేమంబు సంధింపఁగాఁ
గల సర్వేశుఁడు నిన్ను-నన్ను మఱవం ♦ గాఁబోఁడు! విశ్వాసమున్
గలదా దేవునియందు నాకుఁ! గొఱ గ ♦ ల్గన్ బోదు విశ్వాసికిన్! 21

చ॥ ఉసిరికకాయతో నుదధి ♦ యుప్పను గూర్చి సమృద్ధిగా రసం
బెసఁగఁగఁజేయు బ్రహ్మవలె ♦ నే-విని కానని వారిఁగూర్చి రా
గసరణిఁ జొక్కఁజేయుచు సు ♦ ఖమ్ము శుభమ్ము లొసంగనేర్చు నా
ప్రసవశరుండె నేఁడు మన ♦ ప్రాపయి సర్వము నిర్వహించుతన్! 22

ఉ॥ దేవునిపాదయుగ్మము మ ♦ దిన్ స్మరియింతము! శీఘ్రకాలమం
దే వెలయున్ శుభంబు! భవ ♦ దీయమహోన్నతిఁ గోరుచుండెడిన్
భావ"మటంచుఁ బల్కి సద ♦ నంబునకున్ జననెంచి యష్టపు
ష్పావతి వీరునిన్ సెలవొ ♦ సంగఁగఁ గోరిన నాతఁ డర్మిలిన్! 23

మ॥ "నవనీతమ్మునకన్నఁ గోమలము స్వాం ♦ తం! బంతకున్ గోమలం
బవు సద్వర్తన! మంతకన్న మృదులం ♦ బౌ ప్రేమరాగోదయం!
బవురా! నీవలె నుత్తమోత్తమ గుణా ♦ ఢ్యల్ గల్గుటన్ గాదె యీ
భువి రాణించు దివంబుమాడ్కిని సుఖం ♦ బున్ శాంతి సంధించుచున్. 24

మ॥ యువతీ! నీపరమోత్తమత్వము మదిన్ ♦ యోజింపఁగా-దేవదూ
తవు నాపాలికి! నెల్లవేళలను మ ♦ త్ప్రాణంబునున్ మించి ప్రే

మవిశేషంబునఁ గొల్చువాఁడ! నిది సం ♦ బద్ధంబు గాకున్నచో
లవమేనిన్ మనఁగోరఁబోవను జుమీ! ♦ లావణ్య రత్నాకరా! 25

సీ॥ ఏనోము ఫలమొకో ♦ యిన్నాళ్లనుండి వీ
క్షించి వీక్షించి కాం ♦ క్షించుచుంటి!
నో సఖీ! యెన్నాళ్లొ ♦ కో చెలువుగ నీదు
చిత్తంబు నేఁడు రం ♦ జిల్లఁగంటి!
నేపుణ్యపాకమో ♦ యీప్రొద్దు సుదినంబు!
చిరమనోరథ ఫల ♦ సిద్ధియొదవె!
నీలోకమందు నన్ ♦ బోలిన పుణ్యవం
తుఁడు గానరాఁ డెట్టి ♦ యెడ వెదకినఁ!

గీ॥ బుట్టుటాదిగఁ గష్టత ♦ మోనిమగ్న
మైన మజ్జీవితాకాశ ♦ మందుఁ గనులు
మెఱయ మిఱుమిట్లుగొను దొడ్డ ♦ మెఱుపు మెఱసెఁ!
దృష్టిఁ గనఁగంటి! సిరులు వ ♦ ర్ధిల్లఁగంటి! 26

క॥ తరలాక్షి! ప్రతాపమహీ
శ్వరురాజ్యము గడనసేయఁ ♦ బ్రాణంబులు నే
సరకుగొనక యత్నించెదఁ!
బరమేశ్వరుసాక్షి! నాదు ♦ ప్రతినను దీర్తున్!" 27

చ॥ అని - నలినంబువోలె మృదు ♦ వౌ చెలి కేల్గొని ముద్దు వెట్టె! నం
గన యనురాగమంజురస ♦ గాఢవిలోకనముల్ నిగుడ్చి యా
జ్ఞనుగొని వెళ్లసాఁగె! నల ♦ చాన పదమ్ముల చల్వనీడలన్
గనుగవ నద్ది వీడుఁడు సు ♦ ఖమ్మున నేగె గృహంబుఁజేరఁగన్! 28

ఉ॥ ఆలయమైన చంద్రమహ ♦ లందు దినోదయవేళలోఁ-జతు
శ్శాల కురంగటన్ - గది - వి ♦ శాలమనోజ్ఞ గవాక్షసీమలో-
బాల-సరత్తరంగతతి ♦ పైఁబరతెంచెడు మందశైత్యపుం
గాలికిఁ-గూరుచుండె నవ ♦ కంజములన్ వికసింపఁ-జూచుచున్! 29

క॥ కమలేక్షణ సౌధగవా
క్షమున నిలుచు రామణీయ ♦ కముఁ గన్గొన్నఁ జ
ట్టము నలమి రహించెడు చి
త్రమొకో యన నేత్రపేయ♦తన్ సంధించెన్! 30

మ॥ అలినీలోత్పలరాజిఁబోలు నునుపం ♦ బాపద్మకాసార ని
ర్మలతోయంబులఁజెల్వుఁగాంచు నపుడే ♦ రన్ జూడ్కి సారించి యా
నలినీరంజను నావయంచు ముదమం ♦ దన్ - విల్లుమోపెట్టి ప్రా
ములకుల్ గుప్పె మదనుండు బాలహృదయం ♦ బున్ జలి చిల్లుల్ వడన్! 31

మ॥ నలినీరంజను లోకమోహన శుభా ♦ నందప్రదాకార రే
ఖలు - నవ్వాని హృదేకరంజక కళా ♦ కౌశల్యముల్ - వాని స
ల్లలితాలాపనిరూఢి జ్ఞప్తియయి యు ♦ ల్లంబున్ గలంపంగ - నా
తలఁపున్ స్మృతిములో మునింగెను నితాం ♦ తధ్యాన పారీణయై! 32

చ॥ నెలఁతుక యట్టు లెంతవడి ♦ నిల్చెనొ! వీర నృసింహరాయ రా
ట్తిలకుఁడు మేడయెక్కి చను ♦ దెంచుటగాని - ప్రపంచమంతటన్
మిలమిల నెండలున్ గవియు ♦ మేవడిగాని - యెఱుంగకుండ ని
శ్చలముగ నిల్చియుండె-నొక ♦ స్వర్ణమనోహర విగ్రహంబటుల్! 33

క॥ నరసింహరాయఁ డచ్చటఁ
గొరలెడు నొకయాసనమునఁ ♦ గూర్చుండి సుతన్
దరియఁగ రమ్మని పిలిచినఁ
దరుణి తిరిగిచూచి వచ్చి ♦ తగఁ గూర్చుండెన్! 34

"నరసింహరావు పూర్వచరిత్రము"

క॥ "నానోముల ఫలమా! పు
ష్పా! నేఁడిట బ్రహ్మలోక ♦ పర్యంతము చిం
తానిరతి నుంటి! విచటికి
నేనరుదెంచుటయుఁ దెలియ ♦ వింతటిదాఁకన్! 35

శా॥ నీ కష్టాదశవర్షముల్ దరిసె! త ♦ న్వీ! యొక్కమాతేనియున్
సాకల్యమ్ముగ నేను నాస్థితిగతుల్ ♦ సంసారమున్ గూర్చియున్
నీకున్ దెల్పఁగనైతిఁ! గాల మిటులే ♦ నిర్లిప్తమై సాఁగెడిన్!
నాకేం డ్లర్వది దాఁటుచుండె! నిపుడై ♦ నన్ దెల్పు టొప్పున్ గదా! 36

ఉ॥ నీదగు మేనమామ గణ ♦ నీయుఁడు తొల్లి ప్రతాపసింహుఁడున్
నాదగు తల్లిపార్శ్వమున ♦ నర్మిలిచుట్టము! బాల్యమందె త
త్సోదరి నీదుతల్లిని 'వ ♦ సుంధర' నాకిడి పెండ్లిచేసి యా
హ్లాదముతోడ సాయమయి ♦ యారయుచుండె సహస్రరీతులన్! 37

శా॥ కాలాగ్నిప్రతిమాన తేజుఁడని లో ♦ కంబెల్ల గీర్తించు - నా
'అలా' సైన్యవిభుండు చంద్రమహా ల ♦ త్యంత ప్రతాపాంచితుం

ఉ॥ వేసవికైన నొక్కజల ♦ బిందువు కన్పడకుండ నెల్ల కా
సారము లింకిపోయినవి! ♦ క్షామము లోకము నావరించె! నా
హారము నీరులేక జగ ♦ మంతయుఁ బీనుఁగుఁబెంటయయ్యెఁ! గో
పారుణ మృత్యుదేవత వి ♦ హారమొనర్చెను దేశ మంతటన్! 46

మ॥ అమితప్రీతిఁ బ్రతాపరాయుఁడు పవి ♦ త్రాత్ముండు లోలోన సా
యముఁ గావించుచునున్నఁ గూడ - వఱపుల్ ♦ వ్యాధుల్ వ్యయంబుల్ మఱం
తములై రేఁగుటఁ జేసి జీవికనిమి ♦ త్తం బప్పులన్ జేసి రొ
క్కములన్ దెచ్చితి వేలు లక్షలను! న ♦ క్కాణించఁగా నేటికిన్! 47

మ॥ పడసింతేనియు లేని యప్పుడు మహా ♦ భానేత్రయా పూర్ణమ
ప్పుఁడు నన్నున్ బిలిపించి ప్రీతిమెయి నా ♦ లోకించి "ఈవాక్షితీ
శుఁడవై రాజ్యము నేలుమీ!" యనుచు ని ♦ ర్చ్చే నన్ నియోగించె! న
వ్యోడఁ గావించిన యుత్సవమ్ములకు నె ♦ న్నే వేల పక్కెన్ జుమీ! 48

గీ॥ మంత్రులును - సైన్యనాథులు ♦ మాటబలికి
యలరు నుద్యోగు లరుదెంచి ♦ నపుడు తగిన
గౌరవము చేయకున్న - జ ♦ గంబు పరిహ
సించునని విత్తము వ్యయంబు ♦ చేయవలసె! 49

క॥ పిలిచిన 'నో' యనియెడు వా
రల యందఱనొద్ద నప్పు ♦ గ్రహియించితి నేఁ!
గొలఁదికి మీఱుచుఁ బెఱిగెను!
బలుకరె జనకోటి 'ఋణము ♦ పరుగిడె' ననుచున్! 50

శా॥ పౌరుల్ గూడి 'నృసింహరాయుఁడె మహా ♦ జా భూవిభున్ జేసి తా
నీ రీవాక్షితి నాక్రమించునటు డం ♦ డెత్తించినాఁ' డంచుఁ దా
మారాటంబులు వ్రెళ్లఁగ్రక్కి! రది స ♦ త్యంబా! నహాభావయున్
వేఱున్ - నేనును వేఱె! నాకు నెపుడున్ ♦ స్వేచ్ఛలు వాటిల్లునే! - 51

క॥ నాపాలి కల్పతరువై
ప్రాపైన ప్రతాపరాయ ♦ వసుధాపతి నే
శ్రీపరమేశ్వరసమునిగ
నేపొద్దు దలంతు ననుచు ♦ నెఱుఁగదె జగమున్! 52

ఉ॥ లోకులు కాకులన్న నుడు ♦ లున్ వినమే! మదిఁ దోచినట్టులన్
వాగొనుచుండ్రు! కాని యది ♦ పథ్య మపథ్యమటంచు యోజనం

బేకడనైనఁ జేయఁగల ♦ రే! యిఁక లోకము నోరునూయఁగా
మాఁకును లేపటంచు బుధ ♦ పుంగవు లెప్డు వచింతురే కదా! 53

గీ॥ వార లేరీతి నాపసో ♦ పాలు పడిన
నోర్చితిని! గొంతవడి కవి ♦ యుడిగెఁ! గాని,
యప్పుమాత్రము పెరిగి కొం ♦ డంత యయ్యె!
దీర్పని ఋణంబు పెరుగదే ♦ దినదినోక! 54

మ॥ పలుసంసారపు వెచ్చముల్ మఱిమహా ♦ బాహ్యాపు నుద్యోగికో
టుల సత్కారముగూర్చి చెల్లువడుచుం ♦ డున్! గాని యేదుర్వ్యయం
బుల వీసం బరవీసమేని ధనమున్ ♦ బోకార్పఁగాలేదు! నా
తలవ్రా లప్పులపోఁతు గావలెననన్ ♦ దప్పింప నే నెవ్వఁడన్! 55

గీ॥ నొవ్వనాడెడు నుత్తమ ♦ ర్ణులకు నొగ్గి
తెలుపుకొనలేక-ఋణములు ♦ దీర్ప లేక-
కడకుఁ జచ్చినచావు గా ♦ కయు-బ్రదికిన
బ్రదుకు గాకయుఁ-బ్రాణముల్ ♦ పట్టియుంటి! 56

తే॥ గీ॥ కడుపునకును గూడుఁ ♦ గంటికిఁ గునుకును-
హృదయమునకు శాంతి ♦ యొదవఁబోక,
పవలు రేయుఁ గడుప ♦ వలసె! నప్పులవారి
బాధకన్న యముని ♦ బాధ లెస్స! 57

గీ॥ ఉత్తమర్ణులు మూఁగి దు ♦ ర్వృత్తములను
బలుక బదులాడు ధృతిలేక ♦ తలనువాల్చి
సిగ్గు దిగమ్రింగి చివికి శో ♦ షిల్లిపోతి!
శ్రీహరీ! యప్పుకోఁత వై ♦ రికిని వలదు! 58

గీ॥ 'ద్రవ్యమిక్కట్టు నరసింహ ♦ రాయని' కని
గుసగుసలు పుట్టి జగము గ ♦ గ్గోలువడియె!
బుద్ధిసెడి యుత్తమర్ణులు ♦ ప్రోవుగట్టి
ముట్టడించుచు-నాచుట్టు ♦ మూఁగుకొనిరి! 59

గీ॥ అమరపురవాసి ధనికజ ♦ నాగ్రగణ్యుఁ
డైన మదమోహనుని తండ్రి ♦ 'యుభయసింహుఁ'
డప్డు పడివచ్చి నాయప్పు ♦ లన్నిదీర్ప
నధికధనమిచ్చి నాకుఁ జే ♦ యూదుకొనియె! 60

గీ॥ నాఁ డతఁడు సాయపడకున్న ♦ నాదు పడవ
నిలిచియుండదు! నేనును ♦ నిలిచియుండఁ!
గాను కమ్ముకుపోయిన ♦ గారవంబు
కనకగిరి యిచ్చినను వెండి ♦ గలుగఁగలదె! 61

కం॥ కడచని నావత్సర మే
వడువుననో! యువలి గోడు ♦ వచ్చినపుడు దే
వుఁడు కనుదెఱచెను! వర్షము
పడియెను! బుష్కలముగాఁగఁ ♦ బైరులు పండెన్! 62

ఆ॥ వెట్టిపంట పండి ♦ వెలితి లేకుండఁ గా
తరలు మూఁడైె ధాన్య ♦ తతులతోడ!
మూల్యములును దగ్గి ♦ పోకకుఁ బుట్టమ్మె!
నప్పు దీర్పలేక ♦ యడలువడితి! 63

ఉ॥ ఆయభయుండు నాకిడిన ♦ యప్పది వేలను దాఁటి లక్షలై
పోయె! నతండొకప్పు భయ ♦ మున్ బ్రకటించెను నన్నుడాయుచున్!
న్యాయ మెఱింగి యాత్రని భ ♦ యంబుఁ దొలంగఁగఁ జేయనెంచి, నే
నాయక మున్చితిన్ బొలము ♦ నంతెయుఁ జంద్రమహల్ యుతంబుగన్! 64

గీ॥ అభయసింహుఁ డున్నన్నినా ♦ హ్లాదరమున
నప్పు మాఱు తొత్తకుండె! ని ♦ ష్ఠతఁడు లేఁడు!
మోహనుఁడు తండ్రికిని దీసి ♦ పోక నాదు
హృదయము నెఱింగి వర్తించె ♦ నింతవఱకు! 65

శా॥ ఏకాండంబుగ భూరియత్నముల నె ♦ న్నేఁ జేసి కష్టించినన్
బైకం బక్కట! టోలిదైన మిగిలిం ♦ పన్ లేక శోషిల్లితిన్!
దాకట్టున్ విడిపించి యాస్తి యణువం ♦ తన్ జెందలేకుంటి! నా
వైకుంఠేశుఁడె దిక్కటంచుఁ గడకున్ ♦ భావించి కూర్చుండితిన్! 66

శా॥ రేలం దించుక కన్నుగూర్కిన సహా ♦ ద్రీతిన్ 'ఋణాంబోధి నీ
వోలాడన్ బడ కీ'మ్మటం చభయసిం ♦ హుం డెట్టె కన్పించు! నా
కాలాభీల విశాలవిగ్రహము నా ♦ కంటన్ బడన్ - జిత్తమున్
వ్రీలున్! గన్నులు మూఁతయింతపడ కా ♦ రే తెల్లవాఱున్ జుమీ! 67

మ॥ కుడువన్ బూనినఁ బోవ దొక్క మెతుకున్! ♦ కూర్కన్ గనన్ లేను! నా
యెడఁదన్ శాంతి యొసంగ దించుకయు! నె ♦ న్నో దుష్టసంకల్పముల్
పొడమున్! లేచినఁ గూరుచుండిన బలం ♦ బున్ దక్కువై - తద్దయున్
దడ యెత్తున్! మఱి ప్రాణ మే నిముసమో ♦ నన్ బాయు నట్లుండెడిన్! 68

చ॥ అఱువదియేండ్లు దాటెను! సక ♦ లాంగములుఙ్ వడఁకంగఁజొచ్చె! నే
డెఱుఁగను జావు లేదు! తనుఁ ♦ బద్దియుఁ బ్రాణముపోలెఁ జూచుచున్
ముదిసెడి నిన్ను వీడి చన! ♦ మూఁడుజగంబుల రాజ్యమబ్బినన్
గరమునఁ బోక! నీదు చర ♦ ణంబులు గొల్చి తరింతు నాయనా! 84

చ॥ హరిహరి! స్వార్థబుద్ధి యణు ♦ మంతయు లేదు! భవత్కృపారస
స్ఫురణముఁ దొల్తనుండియును ♦ బుద్ధి నెఱుంగుదు! నిట్టి నిన్ను నొం
టరిగను వీడిపోవఁ జర ♦ ణంబులు వచ్చునె! కన్నతండ్రి స
త్స్ఫురణము గొల్వనట్టి సుత ♦ చచ్చిన నేమగు-నున్న నేమగున్!" 85

మ॥ అని చిత్తమ్మున జాలియెల్ల విశదం ♦ బై పల్కు సత్పుత్రికన్
గని యావీరనృసింహరాయవిభుఁడున్ ♦ గష్టంబుతోఁ "గూర్మినం
దన! నీపల్కులు భక్తిసంయుతము! లు ♦ ద్వాహంబునన్ సమ్మతిం
పని-చో నాకపకీర్తియౌ! ననుమతిం ♦ పన్ జూడు నావాక్యముల్! 86

చ॥ "శివశివ! ప్రాయముం బడువు ♦ చెందిన పుత్రిక యింటనుండఁగా
లవమును బెండ్లిమాటను ద ♦ లంపఁ డితం"డని లోకులాడఁగా
సవసవగా వినంబడి భృ ♦ శంబగు చింత వహింతు! నింక మా
న విధివహించి ధాత్రిని మ ♦ నన్ వశమే తలయెత్తి నల్వురన్! 87

ఉ॥ నీమనఁబుచ్చి నాదుమది ♦ కిన్ వెతఁగూర్పక నేవచించు నీ
మాటను దాటిసేయు! మిదె ♦ సాక్ష్యము మానకు! నీకు భద్రముల్
కోటి వహించు! నాకు శోక ♦ కూడనిమాటయు రాదు! నీవిఁకన్
గోటుఁగోట్లు చెప్పినను ♦ గొబ్బునఁ బెండిలి సేయఁగావలెన్! 88

చ॥ సదయుఁడు చాపవిగ్రహుఁడు ♦ సజ్జనుఁ డన్నము గుడ్డకోర్చు సం
పదగలవాఁడు నోర్పుగల ♦ వాఁడు సమీపగుఁ డబ్బెనేని మే
ల్గద! త్వరతోడ నీకుఁ దగు ♦ కాపురమున్ గడతేఱునేని - నా
కొదవలు తీఱు! నంత కను ♦ గూర్కెద రేయిని జిత్తశాంతితో! 89

ఉ॥ కావునఁ బెండ్లి కిష్టపడఁ ♦ గావలెఁ! గాదట నన్ను నాత్మహ
త్యావిధి పాలుసేయకుము! ♦ తండ్రిఁ గృపన్ గనఁబోలు"నన్నఁ బు
ష్పావతి నేత్రపద్మముల ♦ బాష్పము లొల్కఁగఁ "దండ్రి! చింతిలం
గావల! దేను నీనుడుల ♦ గారవ ముంచి మనస్కరించెదన్! 90

మ॥ నను సత్తింటికి సాగనంపినను జిం ♦ తన్ దాళలేవంచు-నే
జన, నీవొంటిగ నుండఁజాలవని-యూ ♦ శ్వాసింపగా నేరుతే

రని, నాకుఁ దపించట్టి యంటి! నిది తి ♦ సైన్యసేఁ గృపఁ జూచి నీ
తనయుఁ డన్నన సేయుమీ! మృదుపద ♦ ద్వంద్వంబు సేవించెదన్!” 91

మ॥ అని యత్యాదరవృత్తిఁ బల్కి వనితం ♦ జాహ్లాదముం బొందించి “నం
దన! నీయందు శోకతప్తు గల్గునె! యునా ♦ త్రింబైన నీవృత్తి నూ
తనమే! మంజు శిరీష కోమలము గా ♦ దా! నీకు సౌఖ్యంబుఁ గూ
ర్చిన నేధన్యుఁడనౌదునంచు మది నా ♦ శింతుం ద్రికాలమ్ములన్! 92

చ॥ అనుటకు నంటి! నీపరిణ ♦ యంబు ముగించి శ్వదేశు మందిరం
బునకును నిన్నుఁ బంపుచును ♦ బూర్వము నీవు వసించు నీగృహం
బున నిముసంబు నిల్వఁగల ♦ వోడిమి యుండునె! యెట్టులేనియున్
నిను నొకయింటిదానిగను ♦ నింపుల నాయిక! కానఁ దెల్పితిన్! 93

“ వరనిర్ణయము ”

ఉ॥ నాబుణ మెట్లుతీఱు వరు ♦ నం బడి కల్గదు! చూడ నెంతయున్
భారమునై తనర్చెడి! ది ♦ నంబులెకాని యికెంత కాలమో
యోడుపువట్టి మోహనుఁడు ♦ నుండమి నిక్కము! భోగభాగ్య వి
స్తారుఁడు! మంజువర్తనుఁడు! ♦ సత్కులజాతుఁడు వాఁడు పుత్రికా! 94

మ॥ పలుమాఱాతఁడు ప్రీతి యుట్టిపడ నీ ♦ పైఁ జిత్తముం మోపి పెం
డిలియాడన్ దలపోయు! నప్పనకుఁ బీ ♦ డింపండు! తాకట్టు పి
చ్చులుగాఁ బత్రములెల్ల వెన్కకిడు! భూ ♦ షాదానులన్ వస్త్రకో
టులఁ బెట్టంగలఁ! డిట్లు పెండ్లియగు! న ♦ ట్లున్ దీఱు నప్పంతయున్! 95

చ॥ తెలిసినవాఁడు! నిన్ననుమ ♦ తించినవాఁడు! పదానఁ జూపినన్
దలఁగొని చేయువాఁడు! ధన ♦ ధాన్యతతుల్ గలవాఁడు! చెప్పినన్
వలసిన గౌరవం బొనరు ♦ పన్ గలవాఁడు! మదీయమానసం
బలరను నీవు వాని హృద ♦ యాధిపుఁగాఁ గొన సమ్మతించినన్! 96

ఉ॥ ఆతనిమాట యెత్తిన ము ♦ ఖాబ్జము చిట్లుకొనంగఁ బోకు మ
మ్మా! తగినట్టివాఁడు! హృద ♦ యంబున దాపటికంబులే కెదో
రీతిని బల్కుచుండు! విప ♦ రీతవిధం బెఱుఁగండు! వానిచా
చేత మెఱుంగుదున్! మనము ♦ చేయఁగఁ బోలిన క్రియ్య యున్నిఁటన్! 97

మ॥ అడుగం డప్పని యెంతు! నాస్తిఁగొన నా ♦ శావిష్టుఁడై యుండఁబో
వఁడు! నేఁ బుత్రినొసంగఁబోవ ననుచున్ ♦ వాక్రుచ్చినన్-వానిలో
యెడఁదన్ గల్గిన రంగు బైటపడు! నీ ♦ విద్దాని యోజింపుమీ
తడవున్ జేసిన నాదుకొంప మునుఁగున్ ♦ దక్ష్యంబు నాతల్లిరో! 98

ఉ. మోహమునం జొక్కి చెందదమునం ♦ బోరెడు వాఁ! డయినన్ బదేంద్ర వ్యా
మోహముతోడ నుండు - లవ♦మున్ గృపలేక మహోగ్రదీక్ష శే
షాహినలెన్ బయిన్ దుముకు ♦ నాఁటని త్రోఁచెడి! రాజశాసన
వ్యాప్తి వానిపక్షము ♦ వర్తిలు! నా కిఁక దిక్కు గల్గునే! 114

ఉ. ఎన్ని సుఖాబ్దముల్ గడచె ♦ నేనును - నీవు వసింపఁబట్టి! నా
దన్నతలంపుతోడ మ్మన ♦ కారము లన్నియుఁ దీర్చుచుంటి! నా
కన్నులబ్రోల మగ్గమును ♦ క్రాంతల మన్యుల పాలుగాఁగ - నే
ను న్నిముసంబు ప్రాణముల♦నున్ మొయిఁదాల్చి మనంగ నేర్తునే! 115

మ. జనకుండన్! ముక్తి నూఁడు కాళ్లముదుకన్! ♦ సంసారదుర్వార వే
దనలన్ గ్రుక్కినవాఁడ! మర్త్యుఁడ! నా♦దైన్యస్థితిన్ జూచి నీ
మనసున్ మోహము జెచ్చి నేఁడితని స♦న్మానింపఁగాఁ జూడు! మో
హనయా! గడ్డము పట్టి వేఁడుకొనెదన్! ♦ దాక్షిణ్యమున్ బెంపుమా! 116

శా. "ఈ సాయంతన మేఁగెదెంచెదను! నే♦ఁ బెండ్లి మా కొత్తి మా
రా సౌభాగ్యవతిన్ సమాయతము సే♦యన్ జూడుఁడీ" యంచు వి
శ్వాసప్రక్రియ విన్నవించెను! భవ♦త్స్వాంతం బదెట్లున్న సం
తోసమ్మున్ నటియింపుమీ సముఖమం♦దున్ వాఁడు మాటాడినన్! 117

క. వరసుత! నీసాహాయ్యము
తిరమె యొగడ! సాయమనుచుఁ ♦ దలఁపను! నన్ను
ద్ధరణ మొనర్చెడి యుత్తమ
వరమని హర్షింతు! జిక్కి♦వాసి రహింతున్! 118

మ. తను బెండ్లాడఁగ రాజరాజులును శ్ర♦ద్ధాభక్తులన్ వేచియు
న్నను బుష్పావతి తండ్రి సేమమును డెం♦దంబందుఁ గాంక్షించి మో
హను బెండ్లాడుచు శాశ్వతంబుగ స్వ-సౌ♦ఖ్యత్యాగమున్ జేసెఁబొ
మ్మని యిన్ మెత్తురు! కీర్తికన్నను నపే♦క్ష్యం బుండునే తల్లిరో!" 119

మ. అని ప్రత్యక్షము గడ్డమంటి పలుమా♦ఱర్థించి ప్రార్థించు నా
జనకున్ దూరముచేసికొంచు వెత ముం♦చన్ లేక "నా పెండ్లి చే
జనకా! నీవెతలన్ దొలంగిన - నవ♦శ్యం బట్టులే సేతుఁ బొ"
మ్మని వాక్రుచ్చె లతాంగి, మానసము ప్ర♦య్యల్ వ్రయ్యలై పోయినన్! 120

మ. తన సత్పుత్రిక యిష్టమున్ గనక చిం♦తన్ గుందినన్ - తీర్పలే
నను తాకట్టుఁ దొలంపఁగాఁగల యుపా♦యంబున్ - వెతల్ దీఁజితా.

ననయంబుల్ సుఖమొందఁగాఁగల యుపా♦యంబుల్ గనుంగొంటి నే
నని యవ్వీరనృసింహరాయఁడు మదిన్ ♦ హర్షించి శాంతిన్ గనెన్! 121

మ॥ తన ప్రాణమ్మునకన్న మిన్నయని వా♦త్సల్యము వాటించి పెం
చిన యా తండ్రికి గట్టిగట్టి యిడుముల్ ♦ చిక్కుల్ దొలంగించుటల్
తన ధర్మంబని పుత్రి దుష్కరతర♦త్యాగంబు భావించెఁ! గా
దనినన్ బూవఁగనున్న ప్రేమలతఁ గో♦యన్ బ్రహ్మకున్ సాధ్యమే! 122

“మోహనుఁడు చంద్రమహలు కోటకు వచ్చుట”

సీ॥ వందలు వేలును ♦ వ్యయమొనర్చిన చీని
చీనాంబరములు నె♦మ్మేనఁ దాల్చి!
మొకనూలు పట్టు సొం♦పులుగుల్కు జలతారు
పింజెలు వ్రేలు టో♦పీ ధరించి
యా టోపిపైన బా♦హాటంబు-వాటమై
రాణించు కలికి తు ♦ రాయి నుంచి!
కరపద్మమందు బం♦గారును రతనముల్
దనరారు నాగబె♦త్తంబుఁ బట్టి!

గీ॥ బెడఁగు బొండుమల్లెల దండ ♦ మెడను వ్రేల
మోహనుఁడు ముఖచూర్ణ వి♦స్ఫురణ మలర
నాత్మకాంభోజహయముపై ♦ సధివసించి
వెడలెఁ దిరునాళ్ల యుత్సవ ♦ విగ్రహ మనఁ! 123

క॥ మది నలరి నృసింహాధిపు
డెమరేగుచుఁ దోడితెచ్చి ♦ గృహమునఁ జేర్చెన్!
దుద కేటులో మోహనుఁడే
మదనోపముఁ డనుచు నతని ♦ మదికిన్ దోఁచెన్! 124

గీ॥ “ నిన్న-వంగదేశంబు క్షో♦ణీవిభుండు
మహిత రాజకీయములు వి♦మర్శచేయ
వచ్చి-నిముస మూపిరివోని♦పనులు వెంచి
యిపుడు విడిచె! గుఱ్ఱము నెక్కి♦యిటు వెడలితి! 125

క॥ అది యెంతదైనఁ గలదిఁక
నదివర్ణనసేయఁ బూన ♦ నంతము గలదే!
మొదలు తుద నేనె యెఱుఁగను!
మదిఁబూనిన కార్యమిపుడు ♦ మాకై పోవున్! 126

క॥ నరసింహరాయ! నీకూ
తురు మది కనుఁగొంచు! స్వేచ్ఛ♦తో నిప్పుడు నే
దరియుదునె! ఎంతమగల దా
నవవన్నె! చూచి మిట్టి ♦ పడఁబోదు గదా!" 127

క॥ అను–మోహనుఁ జేసన్నలఁ
దనుఁ జేరఁగఁ దీసి "నాదు♦తండ్రీ! పనిమా
లిన వెఱ్ఱిమాట లాడకు!
మనువుగ మాటాడు! లాభ♦మగు" నన–నతఁడున్! 128

క॥ "ఒక్కఁడు రెండక్షరముల
కెక్కువ మాటాడఁ జూడు! ♦ మింతగ నీవున్
నొక్కవలెనె! నే నంతటి
మొక్కలినే! ముందు చూపు ♦ పుష్పావతినిన్! 129

చ॥ అనఁ–'బయిమేడనున్న'దని ♦ యాయన దెల్పెను! మేడయెక్కి మో
హనుఁడును దద్విలాస సుభ♦గాకృతి ప్రస్ఫుటమై కనంబడన్
జని నరసింహరాట్తనయ♦సన్నిధి సొట్టఁగ నిల్చి "కాంత! ని
న్గనుఁగొన వచ్చినాఁడఁ! వినఁ♦గాఁదగు నాదగు దివ్య వాక్యముల్! 130

"మోహనసింహుని ప్రధానోపన్యాసము"

క॥ ఎంత యవసరముగలదో
యంతకు నెక్కుడుగ మాట ♦ లాడెదనని భా
వింతురు కొందఱు! నీకడ
నెంతయు సంక్షిప్తరీతి ♦ నిపుడు పలికెదన్! 131

క॥ కలవాణీ! బ్రహ్మాండము
తలక్రిందై పోవు ననుచుఁ ♦ దలఁపకు! నామా
టల నాలకించి విని నీ
తలఁ పనుకూలముగఁ దెలిపి ♦ దయఁగను మమ్మా! 132

మ॥ కమలాక్షీ! తొలుదొల్త నీకిపు డుపో♦ద్ఘాతంబుగా–నాదు వే
శ్మమునన్ గూర్చి–ధనంబుఁగూర్చియుఁ బ్రకా♦శప్రాభ వైశ్వర్య భో
గములన్ గూర్చి వచింపఁ జుల్కగ నెఱుం♦గన్ నేర్తు! కాదేని స్ప
ష్టముగాఁగన్ గ్రహియింపఁజాల! వటులౌ♦టన్! నీకు వాక్రుచ్చెదన్! 133

చ॥ స్థిరగుణరాశి యాయభయ ♦ సింహుఁడు నాజనకుండు! పూర్వమున్
దరుణవయస్కుఁడైనపుడు ♦ తత్సతి నాజనయిత్రి మాత్సమం

నా మేనల్లుండక సర్వభోగముల నం ♦ దంగఁ గంటి! నాగర్భ సు
శ్రీసంతానము స్వేచ్ఛమైఁ జెరిగి వా ♦ సిఁ బన్నియుఁ గాంచితిన్! 140

క: 'నడచినను మెట్టినాఁడని
నడుగుల' కని క్రింద దింప ♦ కెత్తి శిరముపై
నిడి పెంచెఁగాని - చదువుకు
బడి కేఁగుమటంచుఁ దండ్రి ♦ బాధించె నెనన్! 141

గీ. అట్టె మునిచెట్టి-పెడమోము ♦ పెట్టి-పలక
తాముడమ్ము వ్రాతు! నా ఖత్తమ్ము ♦ లన్ని చించి
చిరకలుచేసి బయలఁ దూ ♦ ర్పార విసుతు!
నయ్యవారిని జూసి భ్ర ♦ మ్యంగఁబడుదు! 142

సీ। బడిచదువువ్రాఁత లెక్కలు ♦ పలుకనేల!
యెన్నిబుద్ధులు చెప్పిన-♦ నేమనినను-
బూని నలువుర చేతుల ♦ పైనఁ గాని
నాతనువు సాఁగలేదో కా ♦ నాఁడుగూడ! 143

ఉ: ఎచ్చటికేగసీక మన ♦ యింటనె పంతుల నిల్పఁజేసి నా
కచ్చను విద్దెనేర్పు మని ♦ యాజ్ఞ యొసర్చెను దండ్రి! తప్పుకో
నెచ్చట జోటులేక యయి ♦ దేడులు నేర్చితి! నెంతనేర్వ-నే
నచ్చటికేని, నేఁటికిని ♦ హల్లోకఁ పైన నెఱుంగ నంగనా! 144

మ: మొదలన్ముక్కఁడి పైనచైత్య మను చో ♦ ప్పన్ దోప-విస్తార సం
పద చేకూర్చెను! దండ్రి పోవుటను నేఁ ♦ బారంబులన్ నేర్వమిన్
జపముల్ సంధ్యలు చట్టుబండ పడిరెన్! ♦ శాస్త్రమ్ము వమ్మయ్యె! నె
య్యది మెళ్లున్నను దిండికోసరము కా ♦ వా! వేదముల్ శాస్త్రముల్! 145

గీ. బిక్కపక్షి గోయంగఁ జె ♦ ట్టెక్కియుంటిఁ!
గములు బ్రమ్ములు గ్రమ్మె! వా ♦ క్కాంత వచ్చి
సకలవిద్యోపదేశం బొ ♦ సంగె! నిపుడు
సర్వవిద్యాధిదేవత్వ ♦ సంజ్ఞఁ గందు! 146

సీ. శతవృకాఁడయి కాళి ♦ దాసుండు నాపంచఁ
బడి కొల్చె రామశ ♦ బ్దంబు నేర్చె!
భవభూతికవి గణ ♦ ప్రస్తార సంగ్రహం
బెవ్వానికడఁ బరి ♦ యించె నందు!

వ-ఇ-ఉ ల్మొదలుగ భా ♦ ష్యాంతరంబులాంధ్ర నా
వ్యాసమహర్షి కై ♦ వ్యాఖ్యఁ జేసె!
మిగులఁ గష్టించి వా ♦ ల్మీకి కో-నా-వరాలు,
వ్రాయించినట్టి స ♦ ద్విజ్ఞుఁ డెవఁడు!
గీ॥ విజ్ఞజనశిరోమణి త్రికా ♦ లజ్ఞమూర్తి
చంద్రభట్టారకాచార్య ♦ సత్తమునకుఁ
బలుకఁ గొనియిచ్చిన భువన ♦ ప్రాజ్ఞుఁ డెవ్వఁ!
డేను లేకున్నఁ గవిత కిం ♦ కేది దిక్కు? 147

సీ॥ "బ్రహ్మాండభాండ వి ♦ ద్యచ్ఛండ పిండాండ"
బిరుద మర్పించెఁ గాం ♦ పిల్యనగరి!
"ప్రళయమార్తాండ భై ♦ రవ కృతాంతసమర్థ"
చిహ్నంబొసంగెఁ గా ♦ శీపురంబు!
"నవకోటిదర్ప కం ♦ దర్పమోహనమూర్తి"
బిరుదంబునొసఁగె ఢాం ♦ గఢపురంబు!
"విశ్వప్రపూత గో ♦ విందప్రభామూర్తి"
సంజ్ఞయొసంగె వా ♦ సంతపురము!
గీ॥ నవ్యసౌజన్య ధన్య మం ♦ దార బిరుద
మును సమర్పించెఁ బాటలీ ♦ పుత్రవరము!
లలన! ననుఁబోలు కీర్తికై ♦ లాసశిఖరి
వసుధఁ గలుగునె కోటి క ♦ ల్పములకైన! 148

సీ॥ నేపాలనృపతి కా ♦ నికపంచు బంగారు
గంగాళములు మూల ♦ గాజువాఱు!
లాటేశ్వరుఁడు ప్రేమ ♦ లక్షణంబుగఁ బంచు
గజకోటి వాఁకిటఁ ♦ గాంచియుండు!
హూణరాజేశ్వరుం ♦ డుపద వంచిన హేమ
డోలికల్ కప్పుల ♦ వ్రేలుచుండు!
నిందూరిపతి బహూ ♦ కృతిసేయు ముక్తాత
పత్రముల్ కడుబూజు ♦ పట్టియుండు!
గీ॥ సాళ్వభూజాని పంపు వ ♦ జ్రాలబంగ్ల
నింటిచూరునఁ బడి సొట్ట ♦ లెత్తియుండుఁ!
బలుక సాధ్యంబె నాభాగ్య ♦ వైభవములు
ఫణిపతికి! వాక్పతికి! నుమా ♦ పతికినైన! 149

సీ॥ సకలసంపదల క ♦ శ్రాంత భాండారంబు!
సర్వసౌఖ్యముల కా ♦ స్థానవాటి!
భోగసంతతులు కా ♦ పురముండు సదనంబు!
భాగ్యలక్ష్మీదేవి ♦ ప్రసవసీమ!
వైభవంబు వసించు ♦ వైజయంత గృహంబు!
కామధేనువు గట్టు ♦ గాడిపట్టు!
శృంగారలక్ష్మికి ♦ సింహేంద్రపీఠంబు!
నాగరకతకు జ ♦ న్మస్థలంబు!
గీ॥ భవనమాత్రంబె నాయిల్లు! ♦ స్వర్ణగిరియె
కాని యాకృతిఁగొని ధాత్రిఁ ♦ దనరెఁగాక!
చెలువరో! యెంతపుణ్యము ♦ చేసినావొ!
కోరి నాయింటికిని నీవు ♦ కోడలైన! 150

సీ॥ అల మహోబానేత ♦ యగు పూర్ణమల్లుండు
చెలిమిఁగోరుచుఁ బెద్ద ♦ చీటి వ్రాసెఁ!
గేరళేశుఁడు నమ ♦ స్కృతిచేసి 'యిందాక
వచ్చిపొ'మ్మని వేయి ♦ వార్తలంపె!
లాటేశ్వరుఁడు కాన్క ♦ లను బంపి ముఖదర్శ
నముఁ బ్రసాదింప వి ♦ జ్ఞప్తినంపెఁ!
బాంజాలపతి పదా ♦ బ్జములకుఁ బ్రణమిల్లి
యొకచూపు చూడుమం ♦ చు పదఁబంపె!
గీ॥ బాహ్లికుఁడు మైత్రికై మంత్రి ♦ వరులఁ బనిచె!
హైహయుఁడు మ్రొక్కిమ్రొక్కి 'దా ♦ సోహ' మనియెఁ!
సాళ్వపతి మోడ్పుఁగేలఁ బం ♦ చలను గాచె!
భోజుఁ డేవేళఁ బాదముల్ ♦ పూజ చేసె! 151

సీ॥ భారతాఖండ దు ♦ ర్వార మార్తాండాది
విఖ్యాత బిరుదముల్ ♦ వెలయుమేటి!
వేయియుద్ధములందు ♦ విమతుల విదలించి
యభినవార్జునకీర్తి ♦ నందు వీరుఁ!
డష్టోత్తర శతసం ♦ ఖ్యాక సామంతవ
ర్గ మునేలు వైభవా ♦ క్రాంతమూర్తి!
తుహినాద్రినుండి సే ♦ తువుదాఁక విశ్వభూ
చక్ర మేలెడు మహా ♦ సార్వభౌముఁ!

గీ॥ డిట్టి చోహణన్నృపతి-పృ ♦ థ్వీశ్వరుండు!
విజ్ఞజనమౌళిమణి త్రికా ♦ లజ్ఞమూర్తి
చంద్రభట్టారకుని బంపి ♦ శంకవెల్లఁ
దీర్చుకొనుచుండు నను సంప్ర ♦ తించి దినము! 152

సీ॥ పెటగోనియా మహీ ♦ విభుకోర్కె నరిగి వా
జిసమూహములఁ బరీ ♦ క్షించి వత్తు!
నాస్ట్రేలియా ధరా ♦ ధ్యక్షుండుపిలువ న్యూ
జీలాండు కలిమి వీ ♦ క్షించివత్తు!
ట్రాన్స్వాలు సీమ'స్వ ♦ ర్ణమును' - గింబర్లే - 'మ
హావజ్రముల'ను నే ♦ నరసి వత్తు!
నల మలాకాదీవు ♦ లందున విహరింతు!
నండమాన్ దీవు ల ♦ ష్టప్పుగాంచు!

గీ॥ లీల రేండీర్లఁ బూన్చిన ♦ స్లెడ్జిబండ్లఁ
గూర్చుకొని యుత్తరధ్రువ ♦ క్షోణిఁగలుగు
చిత్రములు పలుమాఱు వీ ♦ క్షించివత్తు!
నేను జూడని నేల యెం ♦ దేని లేదు! 153

సీ॥ సహారా యెడారిలో ♦ సంచరించెడు వింత
యాస్ట్రిచ్చుకోళ్ల నీ ♦ వరయవచ్చు!
నాఫ్రికాఖండమం ♦ దతిజవోపేతముల్
జీబ్రాలఁ గాంచి హ ♦ ర్షింపవచ్చు!
నాస్ట్రేలియా నిబి ♦ డారణ్యములను గం
గారు - డింగోలను ♦ గాంచవచ్చు!
గంధిఁబడినవారి ♦ గాచు న్యూఫౌండ్లాండు
శునకకోటుల నీవు ♦ చూడవచ్చుఁ!

గీ॥ తెల్లని యెలుంగుబంట్లను ♦ తెల్లయేన్గు
గములఁ దెల్లనికాకులఁ ♦ గనఁగవచ్చు!
క్షోణిఁగలిగిన చిత్రముల్! ♦ చూడకున్న
వసుధపైఁ బుట్టువొందియు ♦ ఫలము గలదె! 154

ఉ॥ ఇమ్మహనీయరాజ్యమున ♦ నీదిన మిత్రుటిఁదాఁక బాంధవా
రమ్ముల ముట్టి వారి ధన ♦ రాసులఁ గొల్లలుగొట్టు చోరసం
ఘమ్ముల 'కుక్కుము' ల్లని ని ♦ కామయశంబు గడించియుంటి! యు
ద్ధమ్మున సైన్య మన్న వని ♦ తా! యొక లెక్కయలేదు! నాకెటన్! 155

సీ॥ అఖిలశౌర్యస్ఫ హో ♦ శ్లాఘము గుండియల్
రాలఁగొట్టిరి సౌ ♦ రాష్ట్రమందు!
జయచంద్రుఁ గాన్యకు ♦ బ్జముప్రోలఁ బెడకట్లు!
బిగియించి గోతిలో ♦ వేసియుంటి!
ఢిల్లి పృథ్వీసింహ ♦ వల్లభుఁ డనిని లో
బడినప్డు దయయుంచి ♦ విడిచియుంటి!
జగదేకవీరుఁడౌ ♦ సమరసింహ విభుండు
చెఱనుంచె నాదు మం ♦ దిరమునందు!

గీ॥ నాఁడి భారత-రామాయ ♦ ణాహవమ్ము
లుద్ధతిని సాఁగినప్డు నే ♦ నుండియున్నఁ
బట్టి పాండవ కౌరవ ♦ ప్లవగ దైత్య
కోటులను బిండిపిండిగాఁ ♦ గొట్టియుందు! 156

క॥ పెక్కులు వక్కణ లేటికి
జక్కుల నాసకమునందు ♦ సొంపులు గులుకన్!
ఎక్కన దెవ రనుకొంటివి?
నిక్కముగా నేనుగాక ♦ నీరజనయనా! 157

చ॥ జలజదళాక్షి! కేలు సుమ ♦ శయ్యఁబఱుండి తపింతుఁగాని క
న్నుల కరనిద్దురేనియును ♦ నూల్కొనఁబోదు! పవల్ రవంత యా
కలి యుదయింప! దెప్పుడు జ ♦ గన్నుతమౌ భవదీయమూర్తి నా
తలపున నిల్చి కోరికలు ♦ తద్దయు రేఁపును వెట్టిమొట్టిగన్! 158

గీ॥ వినుతు నొక్క రహస్యమో ♦ వెలఁది! పవలు
కన్నుసన్నలఁ జరణయు ♦ గమ్ముఁ గొలుతు!
రేలు మఱచి తప్పి కలువ ♦ రింతువేని___
చావ! 'యే' మని లేచి హ ♦ స్తములు మోత్తు! 159

గీ॥ ఎందుఁ దిరిగిన నెటులున్న ♦ నేమిఁ గొనిన
నేమి మాటాడినను దప్పు ♦ లెన్నఁబోను!
నా సరసనున్నఁ జాలును! ♦ నన్ను నమ్ము!
నమ్మకున్న-(నిశ్చయము) ప్రా ♦ ణములు విడుతు! 160

క॥ ఒడలొత్తె-నలుగు లిడఁగా-
నుడుకుడుకగు నీరవోయ- ♦ నుదుపులు దొడుగన్-

జడవేయఁ-బూలు ముడువఁగఁ-
బడఁతీ! నేనేర్తు! నన్ని ♦ పనులను దీర్తున్! 161

సీ॥ తిమిరపుం గొండెప్రాయంపుఁ ♦ దీవ్రవతి మెయిఁ
బూరుషుల పైవగలు చూచి ♦ మోసపోకు!
మిలఁ దృణావృతకూపంబు ♦ లెన్నొ యుండు!
గోముఖవ్యాఘ్రములు పెక్కు ♦ కోటులుండు! 162

ఉ॥ నీవిటఁ గొంతసమ్మతి గ ♦ ణించిన నాకుఁ గొఱంతలేదు! నీ
పావనపాదపద్మములు ♦ పట్టి శిరంబునఁ బెట్టుకొందుఁ! బు
ష్పావతి! దుర్బలాత్ము ననుఁ ♦ జంపఁగఁజూడకు! కాన్కఁజూపు! నా
సేవకుఁజేసెదన్ జెఱకు ♦ సింగిణిమోయు బికారి మన్మథున్! 163

ఉ॥ ఇక్షుధను స్తురుష్కుఁ డల ♦ యించి కలంచెడి! దిక్కులేని యీ
పక్షిని నీవిధేయుని గృ ♦ పన్ గని పెండిలి కియ్యకొంచు సం
రక్ష యొనర్పు! మేఁడను శ ♦ రణ్యులు లేరు! కృతజ్ఞతా ప్రతిన్
లక్షలు కోటులున్ ధనము ♦ లంచము లుంచెద నీపదద్వయిన్! 164

గీ॥ పెండ్లి వేయేండ్ల పైరగు! ♦ వేయికనులు
గలిగి జాగరూకతతోడ ♦ మెలఁగవలయు!
నధిపుఁ గోరు త్రోవలఁ దప్పు ♦ టడుగువడినఁ
గూడు కోకయుఁ గుఱచయై ♦ గోడు వడెదు! 165

గీ॥ తొమ్మిదేఁడులక్రింద నేఁ ♦ దొలుత వచ్చి
వెలఁది! నినుడాయ-వెఱగంది ♦ వెక్కివెక్కి
యేడ్వఁదొడఁగితి! వపుడె ని ♦ న్నేలుకోనఁగ
మనసునను గంపెడాస ♦ క ♦ ల్గినది! నాకు 166

క॥ ఈతొమ్మిదేండ్లనుండియు
నాతలఁపున నీవు నిల్చి ♦ నటియింతువు! నే
నీతో డన్మృతము లాడను
శీతాద్రిసుతాభిరామ ♦ శీల విశేషా! 167

ఉ॥ వాలికమాట లేల! నర ♦ పాలక కన్యక లైన-దేవతా
పాలక కన్య లైన - విను ♦ భామిని! నీదగు కాలిగోటికిన్
జాలరు! నీ విలాస రస ♦ సంభృతరూపముఁ గాంచినన్ జగ
జ్జాలములెల్ల మేల్పడి వ ♦ శంబయి వర్తిలు నీకు మానినీ! 168

చ: అలుగకుమీ! రహస్యములయందు రహస్యము సుమ్ము! విత్తముల్
గలిగినవాఁడె ప్రాణములు గల్గినవాఁ! డది లేని జన్మ ని
ష్ఫలము! సమస్తలోకముల సారము విత్త! మెఱుంగఁ జెప్పితిన్
'కలిమి కులాలమిండఁ' డనఁగా వినవే! యలినీలకుంతలా! 169

క. ధనహీనుఁ గుంటి తొలఁగును!
దనువున రక్తంబు-మాంస♦తతులును దొలఁగున్!
ధనహీనుఁ డగుటకన్నను
వనిఁ జక్రాయుగుచుఁ బుట్టు ♦ వడయుట లగ్గా! 170

క: తను గలిగి మెలఁగువానికి
ధనము వలసినంతకన్నఁ ♦ దద్దయుఁ గలుగున్!
వినియుండవె-నావాలికిఁ
గనకంబనఁ జిల్లిగవ్వ♦కైవడి గనఁగన్! 171

చ: ధనమును ముందుముందుగనె♦తజ్ఞులు శ్రద్ధవహించి సంగ్రహిం
చొనరిచి యక్కఱైన-నుప♦యోగ మొనర్తురు! పుట్టుటాదిగా
మనసిడి కూర్చుకున్న విష♦మస్థితి నయ్యది గల్గుచెట్లు! ద
ప్పిని గాని బావిఁద్రవ్వెడు వి♦వేకులు కొందఱు వాల్తు రిద్ధరన్! 172

క: జననంబునుండి కడపటి
దనుకన్ గూర్చుండి తినినఁ ♦ దఱుగదు లవమై
నను మనయింటిని మూల్గెడు
ధన మది! మన పిల్ల-పిల్ల ♦ తరముల్ గడచున్! 173

క: లలనా! చెలువల పదహా
సుల లక్ష్మి వసించునంద్రు ♦ పూరిజనంబుల్!
జెలువుగల చెలులు మెలఁగని
నిలయము-సిరి-వైభవంబు- ♦ నిష్ఫలము గదా! 174

సీ: రమణిరో! నైమిశా ♦ రణ్యమం దొక్కనాఁ
డడుగిడ - నాదినా♦రాయణుండు
పెద్దయాపద నుండె! ♦ వెళ్లి నే నుపకరిం
చితి! విష్ణుమూర్తి రం ♦ జిల్లి "కొమర!
నీకు నూఱేడులు ♦ నిండినంతనె నాదు
తెలిదీవి కేతెమ్ము! ♦ దివ్యమైన
గారుడహార స్య్రభా ♦ గములిత్తు! మఱి నీకు
నోడలితో నాదు సా ♦ యుజ్యమిత్తు!"

గీ॥ నని ప్రమాణము చేసి నా ♦ హస్తమందు
హస్తమును మోపె! నన్నుఁ బెం ♦ డ్లాడదేని
తరుణి! యిహముమా టటులుండఁ ♦ బరమునందు
శుద్ధకైవల్యసంసిద్ధిఁ ♦ జూరఁగానదు! 175

గీ॥ సుదతిరో! కాళ్లముందటి ♦ చూపుచూచు
కొనకు! మీాయవకాశంబుఁ ♦ గోలుపోకు!
సిరియురాఁగ మోంకాలొడ్డి ♦ చెఱుచుకొనకు!
'మోహనునిభార్య' యన జగం ♦ బులు నుతించు! 176

ఉ॥ నామదిఁ బ్రేమపెంపును - ధ ♦ నంబు సుసంపత్త్వము-దానితోడ పే
క్షేమనిరూఢి-నిన్ని పరి ♦ కించెదు దొడ్డ ప్రబుద్ధురాల! నె
ట్లే మదిపొందఁజేసి నను ♦ నేలుకొనంగ మనస్కరింపు! శ్రీ
రామునితోడు! నాస్మర వి ♦ రామునితోడు నినుర్ భజించెదర్! 177

చ॥ పొరవడి యెప్పు డే నిముస ♦ మో మది యొంచెడుపోఁకి యుండితన్
మఱలఁగఁజేసి నిన్ను మది ♦ నమ్మిన న న్ననురాగవృష్టితో
నరసి సుకమ్ముఁగూర్పు! మబ ♦ లా! యిటులే డటు లేక పూడుపాం
తరములదాఁక నాదు పితృ ♦ దైవతకోటిఁ దరింపఁజేసెదర్!" 178

మ॥ అను నామోహనువాక్యముల్ విన నస ♦ హ్యంబైనఁ బుష్పావతీ
వనితారత్నము "నప్పుసప్పులిడి కా ♦ పట్యం బెఱుఁగంగఁబో
వని నాతండ్రిని మోసగించి బెదిరిం ♦ పఁగల్గి నావంటి క
న్యను వేధించుట పాపకారణము గా ♦ దా! ధర్మ విధ్వంసకా! 179

క॥ నీకుఁగల సిరులు పలుమఱు
వాకొన్నవిగావె! మఱలఁ ♦ బలుకఁగనేలా!
నీకడుపంతయుఁ బెనుకత
లేకద! చాలింపు! వినఁగ ♦ లేను మహాత్మా!" 180

క॥ అన - "నావలెఁ బితృభక్తుని
ననుఁబోలిన ధర్మపరుని ♦ ననుఁబోలిన శో
భనవర్తను - నీజగమే
కని విని యుండదు నిజంబు ♦ కమలదళాక్షీ! 181

సీ॥ మును బురాణముల వి ♦ భూతిమహిమఁ బెక్కు
రీతుల మునులు వ ♦ ర్ణింప వింటెఁ!

పాపనాశి కొక్కునా ♦ డడుగుచో మార్గమ
ధ్యమునందుఁ బ్రళయవా ♦ తంబు లేచె!
దండ-క్ష్మాశ్రమం ♦ దలి బూది సుడిలేచె!
మూన్నాళ్లు బూదిలోఁ ♦ బూడిపోతిఁ!
కెజవదుల్ వచ్చి లే ♦ పిరి! బూదిరాసిలో
నున్న నాకెటు పాప ♦ ముండనేర్చు!

గీ॥ లవగించంత యఘము న ♦ న్నంటియున్న
బూదిసోఁకిన యప్పుడే ♦ పోలిసియుండు!
నళినసేత్ర! సాక్షాద్విశ్వ ♦ నాథుఁడ నని
ప్రజలు స్తుతియింత్రు నన్ను మా ♦ పల్లెలందు! 182

సీ॥ భావఁ - దొలసిచెట్టు ♦ పడి మొల్చె వొడ్డిలో!
వటవృక్షమంతయై ♦ వజలె నవల!
భూధర గుహవోలెఁ ♦ బుట్టె నం దొకతొఱ్ఱ!
తొలసి మహత్త్వంబుఁ ♦ దెలిసియుండి
పదియేండ్లు తొఱ్ఱలోఁ ♦ బడియుంటి! నాకింక
నిసుమంత పాతకం ♦ బెటులసోఁకు!
బిల్వమాహాత్మ్యంబు ♦ విని పదునాఱేండ్లు
మాఱేడు తోఁటలో ♦ మ్రగ్గియుంటి!

గీ॥ బాల్యమందె రుద్రాక్షపా ♦ వనత యెఱిఁగి
ముదురు రుదురాకప్రోవుల ♦ మోసినాఁడ!
నాకు నిసుమంత పాప మం ♦ టంగఁగలదె!
చీఁకటులు సూర్యబింబంబు ♦ సోఁకఁగలవె! 183

సీ॥ తిరుపతి వెంకటే ♦ శ్వరు పెరుమాళ్లకు
గరటాలవానిఁ గా ♦ న్కగ నొసఁగితి!
నల యహోబలసీమఁ ♦ గల కంబమయ్యకు
జిబ్బ్రాయిని గటా ♦ క్షించియుంటిఁ!
గాశికాపురిఁ బెద్ద ♦ కాత్రేని కుదురైన
రెంటెమొక్కుఁడు సమ ♦ ర్పించియుంటి!
విద్దెలపురి మొద్దు ♦ పిళ్లారి కొకకోడి
పిల్ల నైవేద్యంబుఁ ♦ బెట్టియుంటిఁ!

గీ॥ బయనఁ బాతాళగంగాభ ♦ వాని మెడను
బసఁగఁ బొయ్యాలదండలు ♦ వైచియుంటి!

నవని నష్టోత్తరసహస్ర ♦ యాత్ర లరిగి
నట్టి నన్నెట్టు పాపముల్ ♦ ముట్టఁగలవు! 184

గీ॥ ధనము వెచ్చింపకుండ నెం ♦ తయును బుణ్య
మార్జనముసేయు త్రోవ లే ♦ నరయుచుందుఁ!
జిల్లిగవ్వయునేని వె ♦ చ్చించు బనిన
లేమ! నాప్రాణములు పైకి ♦ లేచిపోవు! 185

క॥ ననుఁ గని సహస్రకుల పా
వనుఁడని జగమందు జనులు ♦ ప్రణుతింతురు! భా
మిని! నను మగనిగఁ గొనఁ గ
ల్గిన జగమున్నంతదాకఁ ♦ గీర్తి నిలిచెఁగా! 186

క॥ అఱువదినాలుగు దేశము
లరసితి! నందలి చెలువల ♦ నరసితి! నం దొ
క్కరితెయు నందము చందము
తెలుఁగదు! ముదికోతు లట్టు ♦ లిగిలింత్రు సుమీ! 187

సీ॥ జల్లెడ మొగములు ♦ పల్లమొగంబులు-
తిరుగలి మొగములు ♦ తిక్క మొగము-
లేనిక మొగములు ♦ నిగిలింత మొగములు-
కోల మొగంబులు ♦ కుండ మొగము-
లంగలార్పు మొగంబు ♦ లడవ మొగంబులు-
గొడ్డలి మొగములు ♦ కుఱుచ మొగము-
లింగలాయి మొగంబు ♦ లేతాము మొగములు
కొడవలి మొగములు ♦ కురువ మొగము-

గీ॥ తెగుడు దిగుడు మొగంబులు ♦ నెడ మొగములు
పంగ మొగములు వాఁడి అం ♦ పపు మొగములు-
ధరణిఁ దిరుగాడు సామాన్య ♦ తరుణులందు
నిన్నిగతుల మొగాలని ♦ యెవ్వఁ డెఱుఁగు! 188

సీ॥ కంకరగుండు తూ ♦ కంబుండు రకము - కం
డె కదరుమాడ్కి రా ♦ ణించు రకము-
పసరికపాముట్లు ♦ నసిగల రకము - చూ
పులఁ దూలిపోవు దు ♦ ర్బలపు రకము-

కెంపుపిల్ల రకంబు – ♦ కీరాకుల రకంబు–
కొండెరవు రకంబు ♦ సుజ్జ రకము–
పంచ్రగొబ్బ రకంబు – ♦ మగసిరి రకమును
నంక్లిష్ట రకము పె♦ద్దమ్మ రకము–

సీ: మంటమారి రకంబును ♦ మంగ రకము–
సంజవాలిన రకము – ముం ♦ డిగపు రకము–
వసుధఁ బుట్టెడు సామాన్య ♦ వనితలందు
ఇన్నిరకముల వారని ♦ యెవ్వఁ డెఱుఁగు! 189

గీ: ఛందమును గానమును కళా ♦ శాస్త్ర మెఱిఁగి
సరసు లెల్లెడ 'రసికశే ♦ ఖరుఁ' డటంచు
బిరుదు లొసఁగంగఁ గొండంత ♦ పేరు మోసి
పసికిసాలిన వెలఁదుల ♦ వలవఁగలనె! 190

మ: వెలఁతా! పూర్వపుజన్మమందున భవా ♦ నీదేవి పాదాంబుజం
బుల నీవెంతటి భక్తిదార్ఢ్యమలరన్ ♦ బూజించితో కాని, యిం
పలరన్ మేల్పడివచ్చి నేనిటు వివా ♦ హంబాడఁ బ్రార్థించితిన్!
గలవే తక్కినకన్యకామణుల కీ ♦ కల్యాణ పుణ్యోన్నతుల్! 191

ఉ: ఓ యలినీలవేణి! విను ♦ నొక్కటి వచించెద! నప్పు లిచ్చి మీ
నాయన నేర్చి నిన్నును గొ ♦ నన్ దలపోయఁగలేదు! పెక్కు ల
ధ్యాయములేల! నీవు కృపఁ ♦ దప్పిన నేను మనంగఁజాల! మా
నాయనతోడు! సత్యకథ ♦ నం బిది! దబ్బఱ కాదు నాల్కకున్! 192

మ: కలికీ! ధారుణీరాజ్యమంతయుఁ గొనం ♦ గాఁగల్గు భాగ్యంబు, నా
యలకాపట్టణమున్ గొనన్‌గలుగు దీ ♦ వ్యద్భూషలున్ దాసులున్
గులమున్ గోత్రము లొప్పఁజెప్పి భవదం ♦ ఘ్రుల్ గొల్చెదన్! దప్పినన్
బిలువన్ బోకుము 'మోహనుం' డనుచు, నన్ ♦ బేరెత్తి నారీమణీ! 193

మ. అన – 'ఇందాకను నాదుతండ్రి నను సం ♦ ప్రార్థించి నాసమ్మతిన్
గనె! సామాన్యుఁడు పుట్టి యుండినను– వా ♦ గ్దానంబు భగ్నంబు సే
యను! నీకొక్క భయంబు లేదు! నిరపా ♦ యంబౌ నుపాయంబు గ
న్గొనఁగా నేర్చితి! తీర్తుఁబో జనకువా ♦ క్కున్ సాధ్యమైనంతగన్!" 194

మ. అన – సంతోషముఁ బట్టఁజాలక "వెలం ♦ తా! ప్రేమపుంబూల ని
చ్చిన నెక్కంగలనేని – జీవితముఁ గ ♦ చ్చెల్ లేక సాగించి యెం

దను బౌరందరవైభవంబుఁ గన నే ♦ ర్తుగా! దర్పకుగా-గర్వకుగా
దనుమగా నేర్తు! ధరిత్రి దున్నఁగను నే ♦ ర్తుగా [illegible]! 195

మ॥ కలికీ! నీవిఁట నేఁడు నాకొసఁగు వా ♦ గ్దానంబు నాకంబుగాఁ
దళుకుమ్ముద్దుల చెక్కుటద్దముల ని ♦ ద్దంబైన ముద్దొక్కటిం ద
ర్శిలి నాకి"మ్మని మోహనుండు కడునె ♦ మ్మిగా ముందుకుగా ద్రాతె! న
క్కలకంఠీమణి వెన్క మాఱునకు ద్రొ ♦ క్కెగా మాలి-మూర్తాక్షిత్రైఁ! 196

"పుష్పావతి కోపించుట"

మ॥ తన కన్యాగుణగౌరవస్ఫురణ ము ♦ త్పాటించు నవ్వాని న
ర్తనముగా సైపఁగలేక - వీరరసముగా ♦ రామాక్రమించె నిల్చినో
యనఁ బుష్పావతి నిల్చె! మోహనుఁడు కం ♦ పాయత్తుఁడై చిన్నవో
యెను మోమెల్లను! రాతిబొమ్మవలె న ♦ ట్లే నిల్చె! నాత్మీయుగా, 197

మ॥ "జనకుగా మెత్తబడంగఁజేసి నను నో ♦ డగా జేకొనగా మాటఁగో
న్నను నీనాలుగునాళ్లె నాకొరుల యా ♦ జ్ఞల్ లేవు! స్వాతంత్ర్యశ
క్తిని నేనెవ్వరికైన లోఁబడ ప్రస ♦ క్తిగాఁగాక! నానాఁడె నీ
పని చక్కంబడఁజేతు! నిప్పటికిఁ బో ♦ వచ్చుగా ననుగావీడుచుగా! 198

ఉ॥ కాదని నాశరీరము నొ ♦ కానొక యుంచుక నాఁకతాము! మ
ర్యాదగ దూరముండినఁ గ ♦ రమ్ము శుభమ్మగు! జాయఁ దేని న
త్పాదిలుఁ గష్టముల్! తెలిసి ♦ వర్తిలు! మూఁడుక పొంగవచ్చు నా
హ్లాదముగా! దొకప్పుడు త ♦ లల్ తెగునంతకుఁ బోవ్వఁ గార్యముల్"! 199

మ॥ అని గంభీరముగా వచింప సతిఁ జూ ♦ "యద్దేవుఁడా! ఖడ్గము
న్నను రక్తమ్మన నామదిగా భయము కొం ♦ డల్కొండలై పుట్టుచుం
డును! నీపున్నెము నాయదృష్టమగు! పం ♦ తుల్ చేయఁగాఁబోను! మొ
త్తని నీపాదము లొత్తువాఁడఁ! గృప సం ♦ ధానించి నన్నేలుమీ! 200

గీ॥ నాల్గునాళ్ల ముహూర్తము ♦ నడచుఁ! గొంప
మునుఁగఁగాఁబోదు! నే నోర ♦ మూసికొందు!
నువిదరో! నాఁడె కనికర ♦ ముంతుగాక
సెల వొసఁగు మిప్పు"డని లేచి ♦ నిలిచె సతఁడు! 201

మ॥ ప్రమదారత్నము లేచెఁ! దద్దయు భయో ♦ త్పాతంబుతో-నామె వీ
ర మహావేషముఁ జూచి మోహనుఁడు ధై ♦ ర్యం బేది వెల్వెల్లబో

యి మొగంబెత్తఁగలేక సిగ్గుచెడి తా ♦ నేగెఁ దక్షణంబందు సా
ధ్రమునందుండి! లతాంగి డిగ్గిచనెఁ ♦ గ్రిందన్ గల్లు మోసాలకున్ ! 202

చ॥ 'తగునగలెఁ బల్కి పెంచుము ము♦దం'బని మున్న నృసింహరాయఁడున్
వగచిన-మోహనాఖ్యుఁ డల♦పాటును దాటఁగలేక వెఱ్ఱిమొ
ఱ్ఱిగ వికటోక్తు లాడి బెద♦రించుచు-మంటను గల్పెఁ గార్యమున్ !
బగిలినగంట-శ్రోత్రయుగ ♦ పర్వముగా-రవళింపఁజాలునే! 203

ఉ॥ వీరనృసింహరాయఁడును ♦ బేర్మిని మోహను డాసి "యిప్పు డిం
పారఁగ భోజనంబుఁగొని ♦ యాదట వెళ్లఁగవచ్చు"నంచు వే
మాఱు వచింప నవ్విభుని ♦ మాట కొడంబడి సందెజామునన్
గోరి నిజాలయంబు దెస♦కున్ దరలెన్ నరసింహ నేతతో! 204

ద్వితీయాశ్వాసము



శ్రీ

# పుష్పవతి

## తృతీయాశ్వాసము



మ॥ తనవ్రేలన్ గల ముద్దుటుంగరము త♦ద్దన్ ధాళధళ్యంబులన్
జినుకన్-ముద్దుమొగంబు నైరవహిత ♦ శ్రీఁగుల్కి లోకైక మో
హన మాధ్యాత్మవిలాసముల్ నెఱపఁగా ♦ నబ్జాస్య పుష్పావతీ
వనితారత్నము నెప్పటట్లు వెడలెన్ ♦ వాహ్యాళికై తోఁటకున్! 1

మ॥ చనవున్ బెంచు ప్రసన్నమానసముతో ♦ సంపూర్ణ సౌందర్యమో
హనుఁడై వీరుఁడు వచ్చె! సంతపఱు క♦త్యంతంబు వేధించు యో
జన లొక్కుమ్మడి రేఁగి నేత్రముల బా♦ష్పశ్రేణు లుప్పొంగఁగ యం
గన వీరున్ దరిఁజేరి వానిపదయు♦గ్మంబందు వ్రాలెన్ వడిన్! 2

మ॥ మెలపుం గాంటుకకంటి నీరు దొరఁగన్ ♦ మేనెల్లఁ గంపించు నా
నెలఁతన్ లేవఁగఁదీసి చేలమునఁ గ♦న్నీ రొత్తుచున్ ముంగురుల్
వలకేలన్ సవరించి ప్రేమ నిరసిం♦పన్ నేర్చు తద్వక్త్రమున్
నలినీరంజనుఁడున్ గనుంగొని తమిన్ ♦ భాషించె నీభంగిగన్! 3

సీ॥ "గండుతుమ్మెదల పొం♦కము మెచ్చఁగాఁబోని
చికురసంతతి స్రుక్కి♦చిక్కువడెనె!
గనకంపు లతిక చొ♦క్కపుఁ గాంతులను గేరు
వలిపెంపుమైఁ దీనె ♦ వాడువాఱె!
సంపూర్ణ పూర్ణిమా ♦ చంద్ర బింబము గేరు
వదనమండలము శో♦భలను వాసెఁ!
దెలితామరల నేలు ♦ కలికి వాల్గన్నులు
బుడిబుడి కన్నీటి ♦ జడి మునింగె!

గీ॥ సతివ! నినుఁ జూడ నాగుండె ♦ లవిసిపోయె!
నింత కెత్తినదెవఁడో నా♦కెఱుఁగఁజెప్పుమ!
మతఁడు నుదుటను గనుగల్గు ♦ హరుఁడె యైన-
హరి యయిన-క్షణంబునఁ దును♦మాడనేర్తు! 4

మ. నిలయంబైతివా! హా మృత్యుమహిష గళ♦స్థితోగ్రఘంటారవం
బుల నాలించవొ! మృత్యుదేవత హితం♦బుల్ గోరవో! లేనిచో
నలినీరంజను ప్రాణసంతతికిఁ బ్రా♦ణంబైన పుష్పావతీ
లలనన్ గాసిలఁజేసి-మేన నసువుల్ ♦ దాల్పంగ-నాశించునే! 5

సీ. మూర్తిగైకొనిన మ♦త్పూర్వ పుణ్యఫలంబ!
మామకహృదయ సా♦మ్రాజ్యలక్ష్మి!
పావిత్ర్యమందిరో♦పరి పూర్ణకలశంబ!
తనువు ధరించు సౌం♦దర్యధనమ!
నన్నుద్ధరించు నా♦నంద సాత్త్విక నౌక!
ప్రియతమంబైన మ♦త్ప్రేమరాశి!
జగదేక కల్యాణ ♦ సౌభాగ్యదేవత!
కృపసేలు నిబిడదా♦క్షిణ్యజలధి!

గీ. నిఖిలలోక ప్రమోదంబు ♦ నీదుమూర్తి!
నినుఁగొలిచి జీవితము సుఖం♦బున గడిపెద
ననుకొనుచునుంటి! నీవిట్లు ♦ వసటఁ బడిన
నతివ! నేనెడ! జీవించు ♦ నాస యేడ! 6

మ. అకటా! మిన్నులు ప్రీలి పైఁబడిన సుం♦తైనన్ మదిన్ దైన్యమొం
దక మందస్మితరోచు లింపెనయ ను♦త్సాహమ్ముతో వచ్చి మా
మకచేతంబును దన్పు దేవతవు! రా♦మా! నీవు గాసిల్ల నిం
చుక చేనోర్తునె! నాదుమానసము చి♦చ్చున్ బెట్టి నట్లుండదే! 7

చ. గరిక దళంబుగా మొలిచి ♦ క్ష్మాతల మంతయుఁ గ్రొత్తకంబళుల్-
బరచినయట్లు లుండె! నిటు ♦ వచ్చి సుఖాసన'' మందు మంచు న
త్తరుణిఁ గవుంగిటన్ గొని యు♦దాత్తతఁ దెచ్చిన, నందుఁగూరుచుం
డిరె! నిజవాక్ఛ్రయంబు తరు♦ణీవ్యథఁ బాపునటంచు వీరుఁడున్, 8

గీ. ''కలిగిన దొసంగులను దెల్పి ♦ కలఁత దేఱు!
మవల దైవంబుగలదు సా♦యం బొనర్పఁ!
బలుక కట్లుందువేని నా ♦ ప్రాణమాన
మనుట కష్టంబు నాకుఁ బ♦ద్మదళనేత్ర!'' 9

చ. అని తరళాక్షి నాత్మహృద ♦ యంబున కానిచి తట్టి ధైర్యమున్
బెనఁచిన సుంత తేఱి యలి ♦ వేణియు వీడని మోముఁదమ్మిపైఁ
దన నిడువాలు చూపులను ♦ దార్కొనఁ జేయుచు ''నింత కెత్తివ
చ్చినది విపత్తు! నీమదిని ♦ జీదఱఁ గూర్పక యెట్లు తీఱెదున్? 10

"తండ్రి యభిప్రాయముఁ బుష్పవతి చలిసేనునకుఁ దెలియఁజేయుట"

సీ॥ వ్యాఘ్రంబువలని యా ♦ పదఁ బాసి కాపాడి
టది కారణంబుగా ♦ నంకురించి!
ప్రథమదర్శన సము ♦ త్పన్నానురాగ వ
ల్లభ్యంబు నాలవా ♦ లంబుచేసి!
వివిధ రహస్యమా ♦ వేశ వర్షవ్యాప్తిఁ
బెరిగి ప్రోది వహించి ♦ పెద్దదగుచు!
రమ్యభావోద్రేక ♦ రచిత ప్రమాణదో
హదములఁ బూలుకా ♦ యలును గాచి!

గీ॥ యతితరానంద ఫలమిచ్చు ♦ నాస గలుగు
సమయమునఁ దండ్రియను ప్రభం ♦ జనము సోఁకి
ప్రేళ్లతోఁ బెల్లగిలి మన ♦ ప్రేమవృక్ష
మిల నొరఁగనుండె! నా దుర ♦ దృష్టమేమొ! 11

సీ॥ మనసార వలచి చె ♦ ల్మినిబెంచి యుత్తమా
దర్శంబుగా నిల్చు ♦ దంపతులము
గా – రేఁబవలు కోరి ♦ కలు రేఁగి మనసులో-
గాలిమేడలు కోట్లు ♦ గట్టుకొంటి!
మన్మనోరచిత సై ♦ మప్రాజ్య హర్మ్యంబు
నేలమట్టముగాఁగ ♦ గూలనుండె!
నాక్రింది నేల యం ♦ తయుఁ గ్రుంగి పాతాళ
సీమకుఁ గొనిపోవు ♦ స్థితి జనించె!

గీ॥ వేయి పిడుగులు పడినను ♦ భీతిఁ గనని
నాకుఁ గంపంబు పుట్టి చీ ♦ కాకు గలిగె!
దైవకృప యెట్టులున్నదో! ♦ నీవు నేను
ధైర్యమున నీ విపత్తెట్లు ♦ దాటఁగలమొ! 12

శా॥ ఈమధ్యాహ్నము మేడపైనిలిచి నే ♦ నీవైపు చూడంగ, ను
ద్దామ శ్రీఁగల సిందునావ జల మ ♦ ధ్యంబందుఁ గన్పట్టె! నే
వేవో భావము లంకురించి యటులే ♦ నిరీక్షించుచుండంగ – నా
లో మేడన్ జనుదెంచి నాజనకుఁ డా ♦ లోకించె నావైఖరిన్! 13

ఉ॥ కూడదు కాదటంచుఁ దన ♦ కున్ గల బాధలఁగూర్చి, పెండ్లియున్
దోడనె చేయకుండిన జ ♦ నుల్ నడివెట్టుదు రంచు – గట్టిగా

సాహసు! పింఛి క్రీంగి హృద ♦ యంబున నొచ్చుటఁ గాంచలేక గ్రొ
వ్వాఁడిమి గ్రుచ్చి నేను తల ♦ వంచితి! నించితిఁ గొంత సమ్మతిన్! 14

క॥ తనపైఁ గొండెలు వ్రాలిన
యనువున బడనొచ్చుఁబడిన ♦ యప్పుల కత తె
ల్లను దెలిపి-వరాన్వేషణ
మును జేసితి ననుచు భావ♦మును వెలిపుచ్చెన్! 15

మ॥ ధనవంతుండు-గుణోత్తముండును-కృపా♦ధారేయుఁడున్-మంజువ
ర్తనుఁడున్-సత్కులజాతుఁడున్-ఋణము దీ♦ర్పన్ జాలు వాఁడంచు మో
హనుఁ డన్వానిని పెండ్లియాడుమని నా♦కాజ్ఞప్తిఁ గావించె! నే
మని యేమాయా వివరంబు లే నెఱుఁగఁ జే♦యన్ నేర్తు నీచెంగటన్!" 16

క॥ అని దుఃఖమెల్ల నొకరూ
పును గనినటు లమితదైన్య ♦ మున నిల్చి మనం
బున నొచ్చుచు నవ్వల నడి
చిన కథఁ దెలుపంగలేక ♦ శిరమును వాల్చెన్! 17

"నలినీరంజనుని విచారము"

చ॥ బెడిదపు టార్భటిన్ నభము ♦ వ్రీలఁగ రేఁగుచు గుంపుగట్టుచున్
పిడుగులు పైన వ్రాలినటు- ♦ వేఁడిమి వాఁడిమి గ్రక్కుచుండు కొ
జ్జడచినయట్లు-చంద్రముఖి ♦ యాడినమాట లెడందఁగాఁడి డీ
ల్పడగను జేయ-పీడుఁడు బ ♦ లంబటి మూర్ఛిల నుండి-తేఱుచున్! 18

సీ॥ "విషలిప్త బాణముల్ ♦ వెడలఁబొడిచినట్లు-
కోటికత్తులు మేనఁ ♦ గ్రుచ్చినట్లు-
గరళభీషణ వృశ్చి ♦ కములు గుట్టినయట్లు-
గొడ్డంట శిరముఁ బ♦గులుచునట్లు-
మండు తైలమునఁ బ ♦ డండఁజేసినయటు-
ల్మేను నిప్పులఁ బొర ♦ లించినట్లు-
గిరిశృంగమునుండి ♦ క్రిందఁ ద్రోసినయట్లు-
పెను పిరంగి రగిల్చి ♦ ప్రేల్చినట్లు-

గీ॥ లాసలెల్లఁ బటాపంచ ♦ లై సమసెను!
నీదుజనకుని వాక్యముల్ ♦ నాదు మనసు
ధైర్యమును బాపి చీల్చి ప్ర ♦ ద్దలుగఁజేసె!
వనట జనియించె! హృదయంబు ♦ వ్రక్కలయ్యె! 19

ఉ॥ బోటి! వచింపలేక యిటు ♦ మోమును వాల్చుచు నీవచించు నీ
మాట శరప్రయోగమటు ♦ మానసముం గలఁగించి తిద్దిచే
డ్పాటును గూర్చె! నిప్పుడిక ♦ టా! యెటు మోహనుఁ డబ్బె మాకు! హా
టోటుల వేసగాఁడగు శ ♦ ఠుఁ జనకుం డెటు సమ్మతించెనో! 20

మ॥ అన – "నాపున్నెము పండి యాభువనలో ♦ కాతాఘ్నుఁడే దాపురిం
చెను – నాతండ్రిని జూచి యించుకయు నా ♦ క్షేపింపఁగాలేక యు
ల్లనఁ గూర్చుండితి! బాష్పసంతతులు కా ♦ ల్వాల్ కాల్వలై పాఱె! నె
త్తని నాచిత్తము తత్తఱంబడుచు బా ♦ ధఁ గ్రుంగె నత్యంతముం! 21

మ॥ అతఁ డైదారగునేండ్లనుండియును మా ♦ యయ్యం గవిపించి మా
యతమైత్రిం జరియించుచుండు! నిది లో ♦ కాచారమౌనంచు నా
మతి భావించితి! నప్పుడప్పుడును సం ♦ భాషించు! నెంతో యను
హ్యాత చిత్తంబునఁ దోఁచుచుండెడిని నా ♦ కవ్వాని వీక్షించినన్! 22

గీ॥ సృష్టివికసన సిద్ధాంత ♦ మెంచిచూడ
జడప్రకృతినుండి మానవ ♦ జన్మమునకు
నిపు డిపుడె వచ్చెననుచు నూ ♦ హించుకొందు!
మోహనుని చూచినపుడు నా ♦ బుద్ధియందు! 23

క॥ ఏకరణినైన మోహను
జేకొనఁగా వలయుననుచుఁ ♦ జెప్పి చుబుకముం
సోఁకి బ్రతిమాలఁదొడఁగెను!
బాకునఁ గ్రుమ్మినటు నాదు ♦ స్వాంతము నొచ్చెన్! 24

క॥ చాలంగాలమునుండియు
లోలో నినుఁగూర్చి మనసు ♦ లోడపెట్టిన యా
యాలోచనములు – నాసలు
గాలికిఁ గంపించు దీప ♦ కలికలె యయ్యెన్! 25

మ॥ తనయప్పుల్ తుదముట్టఁదీఱి మది శాం♦తం బబ్బునంచెంచి "మో
హనుఁ బెండ్లాడకయున్న – రాజ్యమును హ ♦ స్త్యశ్వం బన్నియుఁ బోవు! వృ
ద్ధునిఁ దండ్రిం గృపఁజూడఁబోని సుత యెం♦దుం యోగ్యయే యంచుఁ దాఁ
గనులం నీళులునించె! దానికిఁ గఱం♦గం బాఱె నాచిత్తముం!" 26

మ॥ అని కాంతామణి వల్కె – వీరుఁడు "నెలం ♦ తా! న్యాయదార్ఢ్యంబునన్
గనఁగా నేరనివారు ప్రార్థనలతోఁ ♦ గన్నీటితో – గట్టమై

నను గాక్షినను బట్టుకొంద్రు! వలవం ♦ తన్ గ్రుంగుచున్ బుట్టిముం
పనులేదేకద! యున్న మన్నను వచిం ♦ పన్ బోలు నాకియ్యెడన్ !” 27

మ॥ అనఁ బద్మేక్షణ మోము డిల్లపడి చిం ♦ తాక్రాంతయై “యేమనం
దును! నాతండ్రి యొనర్చు వేదనలు రం♦తుల్ గంతులన్ బ్రార్థనల్
విని చిత్తంబది వేయివ్రక్కలగుచున్ ♦ బ్రీలెన్! నిమేషంబునన్
“దనయా! సమ్మతిఁజూపుమం చతఁడు ను ♦ త్సాతంబుఁ గావించినన్ ! 28

చ॥ మొదలిటినుండియున్ హృదయ ♦ మున్ నులివెట్టెడు భావకోటితో
మదిమదిలేక కొంతవడి ♦ మౌనముఁ దాల్చితి! నేత్రపద్మముల్
ప్రిదులఁగ నేర్చితిన్! గనిక ♦ రింపఁడు తండ్రి! మఱింత తొందరన్
వదరఁగసాఁగె! సుంత చెవి ♦ వాల్చితిఁ! జూడఁగలేక నోప్రియా! 29

చ॥ అది కనుగొంచు నాజనకుఁ ♦ డంతకు నంతకుఁ బ్రార్థనంబులన్
బొదలఁగఁజేసి యట్టులో న♦నన్ గికురించెను! తండ్రియాస కా
స్పదమగు మాట నావలన ♦ జాఱెను! నా దురదృష్ట మెట్టిదో
కద! పయి నేమిసెప్పుదు స♦ఖా! వృథయయ్యె మదీయయత్నముల్! 30

క॥ పొంగెను వగ! యశ్రువులు
పొంగె! ధృతియు సడలె! గదికిఁ ♦ బోయి మృదుల శ
య్యంగూని వ్రాలితి! నీదగు
చెంగటి కేమొగముతోడఁ ♦ జేరఁగవత్తున్ ! 31

ఉ॥ సీతలఁపొక్క ప్రక్క వగ ♦ నింపఁగఁ దండ్రి దురంతబాధ ని
ర్ఘాతముమాడ్కిఁ బైఁబడుచుఁ ♦ గష్టముఁబెంచుచునుండ–సీతలున్
బోతలునైన చిక్క తల ♦ పోఁతల వ్రేఁగున కోర్వలేక – నే
భీతిలి వ్రాలిపోయితిఁ బ♦విన్ దెగఁజెక్కిన కొండకైవడిన్ !” 32

మ॥ అని కాంతామణి వేదనన్ బడుచు న ♦ వ్యాంభోజ సంకాశమౌ
కనులన్ నీరము నింప – వీఁడు కలం ♦ కన్ జెంది “పూఁబోడి! యే
మనఁగా నేర్తును! నాయదృష్ట మది యి ♦ ట్లై యిర్వురన్ సోఁకి వే
దనఁగల్పించెను! నీమదిన్ వగవు నొం♦దన్ బోకుమీ దీనికై ! 33

మ॥ సఖ! నీవెప్పుడు నాదుసొమ్మవని యు ♦ త్సాహంబు మిన్నంద నా
యఖిలాశానివహంబు నీపయిననే ♦ నాధారమున్ జేయుచున్
సుఖసోపానములన్ రచించుకొని యా ♦ సుత్రాము లెక్కింపఁబో
క ఖగోళంబున గాలిమేడల నసం ♦ ఖ్యాకమ్ముగాఁ గట్టితిన్ ! 34

మ॥ కలిగెన్ నాకును దేవతాగుణములన్ ♦ గైకొన్న సీమంతినీ
తిలకం బంచని యుంటి! నా సలీల వ్య ♦ క్తీభూతమై-యయ్యెఁబో
కలలోఁ ద్రావిన పాలు! పాత్రమది బం ♦ గారైన-నిత్తైనన్
గలదే భేదము! దైవయోగముఁ దొలం ♦ గన్ జేయఁగా సాధ్యమే! 35

క॥ వనజముఖి! దాపక నీ
జనకుం డేమేమి చెప్పె! ♦ సకలంబును నా
కును వినిపింపుము నీవిపు!"
డనఁ బుష్పావతియు "దాప ♦ నఘనే! వినుతన్! 36

గీ॥ అకట! పత్రంబులకుఁ జాల ♦ వ్యవధి లేదు!
నాల్గునాళ్లను దీఱు! నీ ♦ సఖుమనే వి
వాహమైనను మే"లని ♦ పలికెఁ దండ్రి!
యాడి మది మార్చుకొనువాఁడు ♦ గాఁ డతండు! 37

ఉ॥ చెప్పినయంత సేయఁగల ♦ సిద్ధమనస్కుఁడు తండ్రి! నీకు నేఁ
జెప్పినమాట చెప్పినదె! ♦ చేసెద నొక్కప్రతిజ్ఞ! నీకు నేఁ
దప్పుచు వేఱెయొక్కఁడని ♦ తన్విగ నుండఁగఁజాల! గన్నులన్
గప్పి చరింతు నిన్ను! నిది ♦ కల్గిన సత్యము! విప్పి చెప్పితిన్! 38

చ॥ జనకునిభావ మిట్టిదను ♦ చందముఁ దెల్పితి నేను! నీవునున్
మనమున గాసి నొందకుము! ♦ మత్ప్రియ! యగ్గియటంచుఁ బల్కినం
తనె మన నాల్క గాల! దొక ♦ దైవము లేదొకొ మంచిచెడ్డలన్
గొనకొని నిర్ణయింపఁగ! మ ♦ నుష్యుల శక్తి కొలందిదే కదా! 39

మ॥ నను నీవున్—నిను నేనునున్—విడిచియుం ♦ డన్ సాధ్యమే కాదు! కా
న నిరాశాహతిఁదూలి సోలి యెడఁదన్ ♦ ధైర్యంబుఁ బోనాడినన్
బనియెల్లన్ జెడు! నేరెఱుంగుదురు దై ♦ వం బంత క్రూరంబొకో!
మనపైనన్ బగవట్టి యగ్నిగురియిం ♦ పన్ బోవునే చూచెదన్! 40

ఉ॥ వీడని ప్రేమ నాహృదయ ♦ వీధిని నిండి వెలుంగు నిన్నుఁ బెం
డ్లాడెద! వేఱొకొండు దివి ♦ జాధిపుఁడైనను మెచ్చి శీలమున్
వీడఁగఁజాల! వేయి విని ♦ పింపుము! నాదగు ప్రేమపుష్పముల్
వాడవు! ప్రీలిపోవు! మఱి ♦ వత్తలుగావు విచారమేటికిన్!" 41

గీ॥ అనుచు నుత్సాహ మొసఁగి ధై ♦ ర్యమునఁ బలుక
వీరుఁ—"ప్రాణప్రియ! నీమాట ♦ వినఁగనొప్పుఁ!

గాని మూన్నెళ్లుగా బల్కు ♦ గనిన యట్టి
వలపుఁ బూసరమును ద్రెంప ♦ వశమె నాకు! 42

మ. నినుఁ బ్రాణేశ్వరిఁ గాఁగఁ జేకొనెడు పు ♦ ణ్యంబింత లేకున్న - నిం
క నొకం డెవ్వరి నైనఁ బెండ్లి చేసికొనినన్ ♦ గన్నార వీక్షించి వే
డనలన్ బ్రుక్కెడు మందభాగ్యమును నా ♦ దైవంబు తప్పింపఁ జే
సినఁ బెండ్లాడినయంత సంతసముతో ♦ జీవింతుఁ గాంతామణీ!" 43

క. అని యేమో యాలోచన
తనమదిఁ జేసిన-నతండు ♦ తెలుపకున నయ్యం
గనఁ గౌఁగిటఁ జేర్చుచుఁ గను
మొన చెక్కులు నిమిరి "చంద్ర ♦ ముఖి! పొరపడితిన్! 44

సీ. 'నను మాని యొరుని జే ♦ కొన' నంచుఁ బలుకుట-
హాస్యంపుఁ గారణం ♦ బగును! గాని,
"నే వగనొందెద ♦ నేమో యనుచు నీవు
సాహసంబు వహించి ♦ సలుపరాని
యే యకార్యంబైనఁ ♦ జేయనెంతువో యేమొ!"
యని నాదుహృదయ మి ♦ ప్డడలఁ దొడఁగె!
నీతలపూ వాడ ♦ నేనోర్వఁ బ్రాణాల
తో! దీని మఱువకు ♦ తోయజాక్షి!

గీ. వెఱ్ఱియాలోచనము చేసి ♦ ప్రియముకాని
తెరువులకుఁ బోకు! నన్ను వే ♦ ధింపఁబోకు!
నీవు సుఖముననున్న నే ♦ నిఖిలజగముఁ
గొల్లలాడిచ్చి నిన్నుఁ జే ♦ కొనఁగ నేర్తు! 45

క. మీతండ్రిఁ జేరి మొఱలిడి
యో తన్వీ! యూతమనుచు ♦ యోజించినఁ జ
ద్రొతికి గిలిగింతల నిడు
భాతియగా కిచ్చుకైన ♦ ఫల ముండెడినే! 46

ఉ. నీవు మహాగుణోదధివి! వ ♦ నింద్యచరిత్రవు! నీమనంబు సం
భావనయోగ్య! యిట్టి నిను ♦ భామిని! వీడి మనంగఁజాల! నా
దేవతలున్ మహామునులు ♦ దిక్కులు కాలము చంద్రసూర్యులున్
భావనమూర్తి! నీకిఁక శు ♦ భంబులు గూర్తురుగాత యెప్పుడున్!" 47

మ॥ అని వీరుండనఁ గాంత బాష్పముల నే ♦ త్రాబ్జమ్ముల న్నించి “ఓ రా
జని నిట్లయ్యెను! ముందు రాఁగలుగు నా ♦ జన్మంబునం దైన దే
వుని కూర్మిన్ నిను భర్తగాఁ బడసి నా ♦ పుణ్యంబులన్ బండఁ గా
కని ముప్రొద్దు తపం బొనర్తు నవివా ♦ హ్యంబైన కీర్త్యాప్తికిన్! 48

మ॥ వలపున్ నాపయి నిల్పి జీవితమునన్ ♦ వ్యర్థంబు గానీక పె
తలఁపున్ మార్చుచు నీదుచిత్త మిరవొం ♦ దన్ వర్తిలన్ నేర్చు నే
వెలఁదిన్ గాని మనోనురాగ మలరన్ ♦ ప్రేమించి వేగంబ పెం
డిలియై రాజ్యవిభూతిఁ గాంచి మనుమా ♦ నే” నన్ను సర్వేశుఁడున్. 49

క॥ “వనితా! నీమదిఁగల వగ
పును మ్రింగు టుండె-నాకుఁ ♦ బ్రోత్సాహముఁ గూ
ర్పనె యత్నించెదు! నీపా
వనవర్తన మెంత లోక ♦ వంద్యంబో కదా! 50

మ॥ నినుఁ బోనాడుచు-నన్యకామినులఁ బెం ♦ డ్లిన్ జేసికోఁగల్గి నో
బ్బున ముల్లోకము లేలఁగా వలెనె! హో ♦ హో! యేటి కీమాట! నె
మ్మన మాసించిన ప్రేయసీహృదయ సా ♦ మ్రాజ్యాధికారంబుతో
నెనయా నున్నతభాగ్య మొండుఁ గలదే! ♦ ఏణాక్షి! యీధాత్రిలో! 51

చ॥ కనుటయు-మెచ్చుటల్-మనసు ♦ గల్గుట-కొంచెము ప్రేమనూను-టా
త్మను బరమానురాగముఁ గ ♦ మమ్మ్మలరన్ జవి చూడనుంట-యం
తనె-యెడబాటు-లీవిధము ♦ నన్ నరజీవిత మెప్పు డంతమున్
గను! నిల నిత్యసౌఖ్యములు ♦ గల్గుటసాధ్యము మర్త్యకోటికిన్!” 52

క॥ అనఁగాఁ బుష్పావతి యా
తనితో “నీచిత్తశుద్ధి ♦ తద్దయు శ్లాఘ్యం
బును! వంద్యము! వగనొందఁగ
ననువగునే! దేవుఁడే స ♦ మాధృతి నెఱపున్! 53

ఉ॥ మేరువు తల్లక్రిం దయిన- ♦ మిన్నులు పైఁబడినన్ వగన్ గనన్
నేరను! ప్రేమ నిశ్చలము- నిర్మల మైనను-భగ్నమౌనె! ని
ష్కారణభీతిగాక యొక ♦ కష్టముగల్గదు! స్వచ్ఛమైన బం
గారము వహ్నికిన్-భయము ♦ గాంచునె కోటి పుటంబు లుంచినన్! 54

గీ॥ ప్రాణమటు తద్దవెలగల్గి ♦ పరమ మధుర
మైన వస్తువు గలుగ దీ ♦ యవనియందు!

సులభముగఁ బ్రాణమర్పింపఁ ♦ గలుగు నదియె
త్యాగధనులను - ధర్మాత్మ ♦ తత్పరులు నిజము! 55

ఉ॥ ఈ వలవంత ముప్పులలో స ♦ హించెద! నీవును సౌఖ్యవేళఁ బు
ష్పావతి యంచు నొక్కపరి ♦ స్మృతివహించినఁ జాలు నాకు! నీ
పావనమూర్తి నాహృదయ ♦ పద్మముఁ బాయక నిల్చియుండు! నేఁ
బోవ వసుంధరమ్ము! పద ♦ ముల్ గొని నీకు నమస్కరించెదన్!" 56

మ॥ అని చంద్రాస్య నమస్కృతిన్ సలుప, రా ♦ గాయత్తుఁడై లేవఁదీ
సి నిజోరస్థలిఁ జేర్చి ప్రేమఁ దిపు డా ♦ శ్లేషించెఁ! దద్బాహుబం
ధనమందుండియు నల్లఁ దప్పుకొని యా ♦ తన్వంగియున్ సెల్వఁ గై
కొని యారామము వీడి మందిరము ది ♦ క్కున్ సాఁగెఁ జింతారతిన్! 57

"నలినీరంజను విషాదము"

చ॥ అలికులవేణి తన్వెడలి ♦ యాదట నేగిన వీరుఁ డాత్మలో
నలజడి నొందుచున్ బ్రకృతి ♦ యంతట నాశయశూన్య దృష్టులన్
గొలుపుచు "దూరమైతివె! న ♦ నున్ మనసారఁగ నుద్ధరించు క
ల్పలతిక! దేవదూత! యెటు ♦ లన్ నినుఁ బాసి మనంగ నేర్తునో! 58

సీ॥ నావంశ కథనముల్ ♦ నాతల్లిదండ్రుల
చరితముల్ నామముల్ ♦ మఱుగుపఱచి,
పరదేశినంచు నీ ♦ ప్రణయసంశుద్ధతా
సిద్ధిసాంద్రతఁ బరీ ♦ క్షించియుంటి!
నక్కటా! నీహృద♦యంబు పవిత్రంబు!
నీప్రేమ శుద్ధంబు! ♦ నిరుపమాన!
మతివ! నీవంటి మ ♦ హాభాగ్యదేవత-
హీనభాగ్యుండ నా ♦ కెట్లు దక్కు!

గీ॥ తెరతొలఁగఁద్రోసి నాసత్య ♦ చరితఁ దెలిపి
దివ్యపదముల వ్రాలి ప్రా♦ర్థించియున్న-
మరు నిరాశాహతులఁ జిక్కి ♦ యుండనేమొ!
బుద్ధిమాంద్యంబు నాకొంప ♦ ముంచె నేఁడు! 59

గీ॥ ననుఁ దెలుపుకొన్న సిగ్గునఁ ♦ గనులు మూసి
తొలఁగిపోయెదవని భీతిఁ ♦ దెలుపనైతి!
మూన్నెలలు దాఁచి దాఁచి యీ ♦ ముప్పువడితి!
మానిని! స్వయంకృతమునకు ♦ మాఱు గలదె! 60

క॥ కన-నీదుతప్పు వేయిం
ట నొకండును లేదు! నన్ని ♦ నాతప్పు లె! నే
మనుజుఁడ! నీవో-దేవత''
వని కుందుచు మొగలిపల్లె ♦ కదుఁగఁగ వెడలెన్! 61

"రివారణ్యమున గంభీరసింహునిపైఁ జోరులువచ్చుట"

శా॥ "త్రోవన్ బోయెడివారిపైఁ బడెదరే ♦ దుర్మార్గులారా! మిమున్
గావన్ గల్గిన ధీరుఁ డెవ్వఁడొ యిటుం ♦ గన్బోఁడు'' నం చొక్క సం
రావం బయ్యెడ దూరమందున వినన్ ♦ రాఁ గన్పడ యాలించి తో
ర్తో వీరుండును "సద్దదేమొ - కనుగొం ♦ మన్నా'' కటంచున్ జనెన్! 62

"నలినీరంజనుఁడు సేనాపతికి సాయమగుట"

సీ॥ అనుచరుఁడు పిఱుంద ♦ నడ దేర నొకయోధుఁ
డశ్వంబుపై నెక్కి ♦ యరుగు దేరఁ!
దొంగలు మువ్వురు యో ♦ ధుని జుట్టినన్ మూఁగి!
రనుచరుపై నిద్వ ♦ రరిగి-దుష్టు
చే బాదఁగా వాఁడు ♦ క్షితిఁ వ్రాలె! నాయిద్వ
రరిగిరి తొంటి ము ♦ వ్వరను జేరఁ!
దతమండలాగ్ర హ ♦ స్తం బెత్తి యోధుండు
నడుకఁ జోరుఁడొకండు ♦ ధరణిఁ గూలె!

గీ॥ నిట్టి సందిగ్ధసమయమం ♦ దెదిగి-స్థితిగ
తులు గనుంగొని వీరుండు ♦ "తొలఁగి చనక
నిలువుఁడీ! నాదు కరవాల ♦ నిశితధార
క్షితిఁబడఁగఁ జేతు''నని చోర ♦ వితతిఁ దాఁకె! 63

మ॥ ఒక చోరుండును దద్దయున్ గనలుచున్ ♦ యోధున్ సమీపించి యు
గ్రకృపాణంబున మస్తమున్ గుఱిగొనం ♦ గా-నీరుఁడున్ మండలా
గ్ర కరం బెత్తుచు వానిబాహువుఁ దెగం ♦ గా వ్రేసె! నిల్వంగ నో
పక యవ్వాఁడు నికృత్తబాహుఁడగుచున్ ♦ వ్రాలెన్ ధరిత్రీస్థలిన్! 64

మ॥ "పదసీ! యెంతటి సల్లుమానిసివా! యీ ♦ బాలున్ ధరన్ గూల్పలే-
కదరుంగుండియఁ జూపి సోలితివి! సాయంకాల మందెందు నీ
వదనంబున్ గన దోస''మంచు హితుఁద ♦ ప్పన్ దాల్చి వేఱొక్కఁడున్
గదనున్ బోలిన దుష్టు వీరుఁడొరుగం ♦ గా నెత్తిపై వైచినన్! 65

మ॥ ఒఱఁగన్ జాఱుచు వానిఁ దప్పుకొని శౌ ♦ ర్యోగ్రుండునై వీరుఁడున్
గరవాలంబును వానిపైని బరపం ♦ గా! వాఁడునున్ బాఱె! న
క్తాక్తి శౌర్యోగ్రుఁడు యోధమాళి తన గం ♦ ధర్వంబు నాచోరుపై
బరపెన్! వాఁడును దానితాఁకుననటన్ ♦ వ్రాలెన్ మహీధ్రంబటుల్ ! 66

ఉ॥ తక్కినచోరు లిద్దఱు క్రో ♦ ధాపరిధూమితులౌచు దిక్కులున్
పిక్కటిలంగఁ గత్తి జళి ♦ పించుచు యోధుని వారువంబుపై
నొక్కట వ్రాల-వాజియసి- ♦ యొక్కపదంబునఁదాఁకి వాజియున్
మ్రొక్కుచు వ్రాలె! యోధుఁడును ♦ ముందునకున్ వడిఁదూలి వ్రాలినన్ ! 67

మ॥ మెఱుఁగున్ సోఁకినయట్టు లందొకఁడు క్ర ♦ మ్మెన్ యోధుపై! వీరుఁ డ
త్తఱిఁ జాటిల్లిన యాపదన్ గని మనం ♦ తస్ఫూర్తిమైఁ జోరునిన్
దరిసెన్! దక్కినచోరుఁ డాతని పిఱుం ♦ దన్ ఖడ్గమున్ దోర్యగో
పరి వ్రేయంగ నతండు సొమ్మసిలియెన్! ♦ వాఁడంతటన్ బైకొనెన్! 68

ఉ॥ అంతట లేచి యోధుఁడు ఖ ♦ రాసిని దస్కరు మోదె! వాఁడు దు
ర్దాంతజవంబుతో నతనిఁ ♦ దాఁకెఁ గృపాణమునెత్తి! వీరుఁ డ
భ్యంతరమందు లేచి తన ♦ పైఁబడు చోరుని నేలవాల్చి క
ల్పాంతకుఁడో యనంగఁ దెగ ♦ గూర్చెను వాని క్షణంబులోపలన్! 69

క॥ ఏకకరుఁడైన చోరుం
డాఁకలిగొను పులి విధాన ♦ నవ్వీరునిపై
దూఁకి తనహేతుఁడు తెలుపఁగ
బాకునఁ బొడువంగఁ జేయి ♦ పై కెగనెత్తెన్ ! 70

చ॥ ఇరువుర కిద్దఱై నిలిచి ♦ యెక్కటిపో రొనరించునప్పు డె
వ్వఁడు పయిచేయిఁ గాంతు రను ♦ ప్రశ్నము పుట్టదు! యోధుఁ డెన్న సం
గరములఁ గాక దేలిన య ♦ ఖండ పరాక్రమరాశి! వీఁడు దు
ర్ధరబలశాలి! తస్కరుల ♦ దుందుడుకుల్ ఫలమొంద నేర్చునే! 71

మ॥ నలినీరంజన యోధులిద్దఱు కృపా ♦ ణంబుల్ ప్రయోగించి యా
జ్వలనస్పర్శనులట్లు తస్కరుల నొం ♦ పన్ వారిలో నొక్కరుం
డలుగుల్ నేలను వైచి పాఱె! నితరుం ♦ డవ్వాని నిందించుచున్
దలఁగన్ జాఱక పోరికిన్ దుమికె దు ♦ ర్దాంతక్రుధావేశుఁడై ! 72

ఉ॥ వీరుఁడు-దీప్తికాయుఁడును ♦ బ్రేఁగును దార్ఢ్యముగల్గు చోరునిన్
జేరుచుఁ బట్టి యెత్తి ధర ♦ ణిన్ బడఁగొట్టెను! వాఁడు కోర్కె యా

జేరమిక్కిలి బరాభవప ♦ టిష్ఠతతోడయి సోలుచున్ "నన
స్కారము! తప్పు గాచి ననుఁ ♦ జంపక జాలివహించి వీడుఁడీ! 73

క॥ కలకాలము మీసాయము
దలఁతును! దుర్వృత్తి విడుతు! ♦ దాసుని తప్పుల్
దలఁపకుఁ"డన వీరుఁడు "మీ
స్థలమెయ్యది! వీరి నేల ♦ దాఁకితి రిటులన్? 74

చ॥ తెలుపు" మనంగ దొంగయును ♦ "దేవ 'మహాగిరి' భూరిగహ్వరం
బుల వసియించుచుండుదుము! ♦ పూర్వదినంబున వీర లీ వనం
బులఁబడి వత్తురంచు 'ధన♦ముల్ గొనివత్తురటంచుఁబెక్కువా
ర్తలు విని పొంచియుండి యిటు ♦ దాఁకితి మిమ్యెడ సందెజామునన్! 75

ఉ॥ మా కొకనాయకుండు- 'పర ♦ మర్దనుఁ'డన్ బలశాలి యుండు! నా
ప్రాకటశౌర్యునాజ్ఞలు శిరం ♦ బునఁ దాల్తుము! కొల్లగొట్టి యా
లోకులనుండి విత్తతతు ♦ లున్ గొని యాతని కిత్తు! మాతఁడున్
సాఁకుచునుండు భూపుఁ డని ♦ శమ్ము మమున్‌గని యొంపకుండఁగన్! 76

చ॥ ధనమటులుండ మాకిచటఁ ♦ దన్నులు తప్పకపోయె! దుష్టవ
ర్తనమును మాని లోకులను ♦ రాయిడిముంపక కూలినాలికిన్
జనుచును గాయకష్టమును ♦ సల్పుచు జీవికఁదీర్చువాఁడ! మీ
కును బదివేలుఁ మ్రొక్కులిడి ♦ కొల్చెడువాఁడ" నటంచుఁ బల్కుచున్! 77

క॥ చోరుఁడు సాష్టాంగ నమ
స్కారము లొనరించి లేచి ♦ సాంద్రాటవులన్
దూఱి యదృశ్యుండయ్యెను!
వీరుని యోధుండు డాసి ♦ ప్రీతియెసంగన్! 78

"గంభీరసింహుని కృతజ్ఞతా ప్రకటనము"

ఉ॥ "చిన్నివయస్య!-చోరతతి ♦ చేతులఁ జిక్కి భ టుండు వ్రాల-నా
పన్నతనొంది చుట్టును వి♦పత్తిమిరంబులు ముట్టినప్పు డా
పున్నమచందమామవలె ♦ మోసలఁదోచి విపత్తు పంచుకొం
చన్నిట సాయమాచు విజ ♦ యంబును గూర్చితి! వెట్టి ప్రోడవో! 79

క॥ ఓయనుఁగుమిత్ర! నీపే
రేయది! నీ వుండు నగర ♦ మేయది! నీపూ
ర్వాయత దివ్యచరిత్రం
బేయది! యెఱింగింపు నాకుఁ ♦ దృప్తి యొదవఁగన్! 80

శా॥ ప్రాతఃకాల కుమారభాస్కరుని తే ♦ వన్ విశ్వవిద్యోతిత
జ్యోతిస్స్ఫూర్తి వెలింగి-వ్యాప్తవలిత ♦ క్షోణీమహాచక్రమున్
జేతన్ దాల్చిన యామహేంద్రవిభవ ♦ శ్రీధుర్య త్రైలోక్యవి
ఖ్యాతున్ బృథ్వీమహేంద్రుఁ గొల్తు జగముల్ ♦ గంభీరసింహుం డనన్! 81

గీ॥ ఆమహాసార్వభౌమున ♦ కగ్గలముగు
ప్రీతి నాయందు! నే ఢిల్లి ♦ వెళ్లినపుడు
నీరచించు నేఁటి మహోప ♦ కారమునకు
రాజలాంఛన మిప్పించి ♦ ప్రభునిఁ జేతు! 82

ఉ. కత్తికపైనఁ గత్తి వడి ♦ కోసెడు నప్పు హతాత్తుగాఁ గను
ద్వృత్తరథాటిఁ దస్కరుని ♦ డాఁకి తదీయభుజంబు ద్రుంచి నా
నెత్తినిబద్ధ యాపదను ♦ నీఁగి మహోపకృతిన్ బొనర్చు నీ
మెత్తనిచిత్త మిట్టిదని ♦ మెచ్చి నినున్ వినుతింప నేర్తునే!'' 83

చ॥ అనివచియింప-వీరుఁడు ''ద ♦ యానిధి! నీహృదయం బుదారమౌ
టను నను మెచ్చుచుంటి! విచ ♦ టన్ మతి నేనొనరించుసేవ యే
యనువున నెట్టివారియెడ ♦ నైనను జేయఁగఁదగ్గ ధర్మమై
పొనరదె! నీవు నన్ బొగడఁ ♦ బూనుట శ్రేయమె యిన్నిభంగులన్! 84

శా! శ్రీరమ్యంబగు నీమహాభరతధా ♦ త్రిన్ వీరసంఘంబు దు
ర్వారానీకములందుఁ దోర్దోలుత నీ ♦ ప్రత్యేకనామంబు శం
కారాహిత్యముతో స్మరించునుగదా! ♦ గంభీరసింహుండనం
గా రత్నాద్రియుఁ బాదుత్రోడ మివులన్ ♦ గంపించి ఘూర్ణిల్లదే! 85

ఉ॥ వీఁడు సుసాత్త్వవర్తనుఁడు ♦ పృథ్వీనృపాలశిరోవతంస! మీ
భారతఖండ మొక్కఁడన ♦ భావ్యమె! సర్వజగంబులున్ నమ
స్కారమొనర్చి కొల్వఁదగు ♦ సద్గుణమూర్తి! తదీయకీర్తివి
స్తారత క్షీరవార్ధికి సు ♦ ధానిధికిన్ జెలువార నేర్చునే! 86

క॥ సేనాపతి! నీవు – మహీ
జానియు నుత్తములు-మిమ్ము ♦ సన్నుతిసేయం
గా నేరవు త్రిభువనములు!
నేనెంతటివాఁడ నిపుడు ♦ నేర్చి నుతింపన్! 87

గీ॥ ప్రకృతిసౌందర్యలక్ష్మి రీ ♦ వాధరిత్రి
దర్శనీయమనన్ విని ♦ దానిఁజూచి

పోవ వచ్చి చెంతనుగల ♦ మొగలిపల్లె
నిల్తు-ముసలామె యింట మూ ♦ న్నెలలనుండి! 88

క॥ తలిదండ్రులు పోయిరి! బం
ధులు నాప్తులు లేరు! తండ్రి ♦ తొలుదొల్తనె-భూ
తలరాజ్యముఁ గోల్పోయెను!
నలినీరంజనుఁడ నెదరు ♦ నను మోఘమణీ! 89

ఉ॥ చోరచయంబులన్ దగులు ♦ చున్ వడి మీరదలించునప్డు మ
ర్వారజవంబుతో నిటకు ♦ వచ్చితి! నప్పుడు వెల్లువేఁగి యా
చోరుఁడు గొట్ట సొమ్మసిలు ♦ చున్ బడు మీ భటుఁ డెట్టులుండెనో!
యారసివత్తు నీక్షణమ! ♦ యంతటిదాఁకను నిల్వఁ డిచ్చటన్! 90

మ॥ అని యాభృత్యుని జేరి "నీకెచట గా ♦ యంబుల్ మొయిన్ సోఁకెఁ! జె
ల్చనవాక్రువ్వ'' మటన్న నాతఁడును "మ ♦ త్స్వామిన్ గనుంగొంటె! యా
యన సేమంబున నుండెనే యొక యపా ♦ యంబైన లేకుండ! నా
కును విన్పింపుము జాగులేక! భవదం ♦ ఘ్రుల్ గొల్తు భక్తిస్థితిన్! 91

గీ॥ సంగరక్షోణి రిపుల మ ♦ స్త్రములు తఱిగి
రాను లిడునప్డు నుదుట నే ♦ త్రంబులేని
లోపమేగాని సాక్షాత్త్రి ♦ లోచనుండు-
విలయ కాలాంతకుండు - గం ♦ భీర విభుఁడు! 92

మ॥ తలపైఁ జోదనిదండముల్ దవిలి చి ♦ త్తమ్మొల్ల దిమ్మెక్కి క
న్నులు మూఁతల్ వడెఁ! గాని గాయమది యెం ♦ దున్ లేదు! జాగ్రత్స్థితుల్
కలిగెన్! స్వస్థతయబ్బె! నాదువిభునిన్ ♦ గంభీరసింహాంఘ్రుఁ గ
న్నులఁ జూడన్ వలె'' నంచు లేచె మనమం♦దున్ హర్ష ముప్పొంగఁగన్! 93

ఉ॥ వీరుఁడు ముందు-భృత్యుఁడును ♦ వెన్కను సాఁగి క్షణంబులోన గం
భీరవరూథినీవరు స♦మీపమునందున నిల్చి! రాతఁడున్
వారిని 'గూరుచుండుఁ' డని ♦ పల్కె భటున్ గని "నీవు నేను నీ
వీరకిశోరు సాయము ల ♦ భించుటఁ దక్కితి'' మన్న-వీరుఁడున్! 94

క॥ ఒకమనవి! యల్లసెలయే
టికిఁ జని నీరమ్ముఁ గొని తృ♦టిన్ వచ్చెద! నీ
డకు "నని చనె! భటుఁ గని నా
యకు'' డితఁడే మనము వెదుకు ♦ నతఁ'' డన-భటుఁడున్, 95

ఉ॥ "ఈమిడిమొండచేఁడిమి సహించుచు నిన్నిదినాలనుండి నూ
ఱ్ఱాపడ వచ్చి యిందు శ్రమ ♦ మాఱఁ గనుంగొనఁగోరినట్టి యా
గోముల పిన్నవాఁ డితఁడొ ♦ కో" యనె వేగమె-యోధమౌళి "స
ద్దేమియుఁ జేయఁగూడ! దతఁ ♦ డిద్ది యెఱుంగఁగఁగూడ దియ్యెడన్! 96

సీ॥ దైవమిటుగూర్చె మనల నా ♦ తనిని! వేయి
మేళ్లు సమకూరెఁ! దిరిగి యా ♦ మేటి వచ్చె!
నిపుడు నిలుపుడ! యితని సు ♦ ద్దెల్ల నీకు
సావకాశంబుగాఁ జెలి ♦ యంగఁజేతు! 97

క॥ ఓరిమి వహింపు" మనునెడ-
వీరుం డరుదెంచి "లోక ♦ వీర! రణతలిఁ
బారసి పరిశుభ్రంబుగఁ
దీరిచి మిముఁజేరనరుగు ♦ దెంచితి" ననఁగన్! 98

ఉ॥ వీరునిఁజూచి యోధుఁ "డిటఁ ♦ జెక్కుపనుల్ సమకూర్చి-మత్పతిన్
జేరి సవిస్తరమ్ముగ వ ♦ చింపవలెన్! బయనమ్మునర్చి యా
వీరనృసింహరాయ పృథి ♦ వీపతిఁ జూడవలెన్! జగంబు దు
ర్వారతమోవృతంబగుట, ♦ రాతిరి పో! నుదయంబు వెళ్లెదన్!" 99

"గంభీరసింహ-నలినీరంజనులు మొగలిపల్లెకు వెళ్లుట"

క॥ అని మొగమెల్లను ముడుతలు
గొన యోచన చేసి చివర ♦ కున్ నిర్ణయమున్
బొనరించుకొనుచు వీరుని
గని "యొక్కఁడుతోఁచు! నదియ ♦ కర్తవ్య మగున్! 100

ఉ॥ ఈఁతలుపోఁతలా తలఁపు ♦ లేటికి! నీహితవృత్తి సమ్ముదా
పాతమొనర్చె! నీమొగలి ♦ పల్లియ కందఱి మిప్డు పోయి యీ
రాతిరి నీనిశాంతమున ♦ శ్రాంతి వహించుచు నందు నిల్చి ప్రా
భాతికవేళ లేచి నడు♦వన్ గడు లగ్గనితోఁచె నామదిన్!" 101

క॥ అన-నలినీరంజనుఁడును
విని "నేనొనరింపవలయు ♦ విన్నప మిది-మీ
మనమున నెఱిఁగి వచించితి!
రనఘా! మిమ్మెంతగఁ గొని ♦ యాడఁగవలెనో! 102

ఉ॥ భారతఖండమంతటిని ♦ బాహులమధ్యమునం దిమిడ్చి కం
గారొనరించి మ్రింగి వెలిఁ ♦ గ్రాయఁగనోపు మహాభుజుండు గం

భీరవిభుండు వత్తునన ♦ వేయి శుభమ్ములు" ఉంచు రమ్మనన్
నేరుచుఁగాని వల్వదన ♦ నేర్చునె వాఁడు మహేంద్రుఁడేనియున్!" 103

క॥ అని విన్నవింప-యోధుం
డను "సంతోషంబు! తప్ప ♦ కదలెంచెద నే"
నని లేచెను! వీడుఁడు లే
చెను! తోడనె భటుఁడును నిలి♦చెన్ వెంటఁజనన్! 104

గీ॥ ఆయుధంబులు-రాజకీ ♦ యములు-కథలు-
వింతలు-విశేషములు-సంఘ ♦ విధులు-పట్ట
ణములు-లోకాభిరామాయ ♦ ణములఁ-గూర్చి
పలుకుకొనుచుఁ బ్రయాణమ్ము ♦ సలిపి రపుడు! 105

సీ॥ "పరిసరారణ్య భూ ♦ భాగంబు నానావి
ధావనీజములచే ♦ నలరుచుండుఁ!
బద్మకాసారశం ♦ బరము స్వాదుత్వ సు
గంధిత్వ శైత్యసం ♦ కలితమగును!
ద్రివిధశీతోష్ణప్ర ♦ దేశంబులందలి
పంట లిచ్చటఁ బ్రోది ♦ వడయుచుండుఁ!
జుట్టుపట్టుల వన ♦ క్షోణి మృగాకీర్ణ
మై బోయగుంపుల ♦ కాకరమగుఁ!

గీ॥ జంద్రమహాలుకోట ♦ సౌభాగ్య మహిమంబు
ఘనత యెట్టి దుర్గ ♦ మునకు లేదు!
శ్రీవిశాలమైన ♦ రీవామహీస్థలి
పుణ్యభూమి యందుఁ ♦ బుణ్యభూమి! 106

ఉ॥ రాతిరిజాముగానఁ గన ♦ రాదని లోపమ కాని-లేనిచో
నీతరు-లీవనంబు-మృగ ♦ బృంద విహారముతో-శకుంత సం
ఘాత కలస్వనంబుల వి♦కాసముతో సుపవిత్రమంత్ర సం
స్ఫీత వివాహవేదివలెఁ ♦ జేతము రంజిలఁజేయు చుండెడిన్! 107

ఉ॥ మూతులు ముందుసాఁచి తృణ♦మున్ గ్రసియించుచు-నల్కిపైన న
త్యాతతనేత్రముల్ మొగము ♦ లంతయు నిండఁగ మోర లెత్తుచున్
భీతిని జూచుచున్ నిలుచు ♦ వేడ్కలవెల్లువ లీకురంగపుం
బోతములన్ గనుంగొనుట ♦ పూర్వపుఁబుణ్యము లెల్లఁ బండుటల్! 108

ఉ. వేళయుఁగానివేళఁ గని ♦ పించుట కష్టముకాని-యిప్పు డే
లాలత లిందుఁ బెక్కులు చె ♦ లంగును! జెంగటిచెట్లపై లతా
జాలము లల్లుకొన్నయవి! ♦ సాయమువేళలఁ గొమ్మ లుయ్యెలల్
మేలుగ నూఁగుచుండ్రు మది ♦ మెచ్చక యచ్చెర మచ్చెకంటులన్!” 109

మ: నళినీరంజను వర్ణనంబు లతిమా ♦ న్యంబై రసస్ఫూర్తి పే
శలభావోన్నతి-యాచితీరతి-మనో ♦ జ్ఞత్వప్రభాపూరముల్
గలవౌటన్ బరమావధానుఁడగుచున్ ♦ గభీరసింహుండు ని
శ్చలచిత్తం బిగురెత్తఁగా వినుచు మె♦చ్చన్ సాఁగె వేభంగులన్! 110

మ॥ అతిదూరంబుననుండి వచ్చుటను-సా ♦ యంకాల మాతస్కర
ప్రతతిన్ దాకుట-నెంచియున్ నడచుటన్- ♦ వ్యాపించు ఘర్మోదకా
యతిఁబాపెన్ వికచారవిందగణ దీ ♦ వ్యత్పద్మకాసార తుం
గతరంగాంతర శీకరోపరి మరు ♦ త్కల్యాణ సంచారముల్! 111

“నళినీరంజను నివాసము”

గీ॥ పద్మకాసారమునకు న ♦ వ్వలి వయిపునఁ
జంద్రమహలున కెదురుగాఁ ♦ జక్కనైన
మిద్దెయును దానిపైఁ బెద్ద ♦ మేడ యున్న
తెరువునకు వెళ్లి రపుడు ము♦వ్వురను గూడి! 112

చ॥ పరువడి నింటిసేవకుఁడు ♦ వారలఁ గన్గొని కేలు మోడ్చి త
త్తురగము నొక్కలాయమునఁ ♦ దోలి తృణంబిడి కట్టివైచె! మం
దిర యజమానురాలగు ‘సు ♦ ధీమతి’ వీరుని మాటపైన నం
దఱకును వంటకంబుల నొ ♦ నర్చె విశేష రసోచితంబుగన్! 113

మ॥ పడసాలన్ దగుపీటలన్ బఱచి రం ♦ భాపత్రముల్ వైచి మే
లుడుకుం గూరలు రుచ్య భక్ష్యనిచయం ♦ బోరెంబు వడ్డింప-వీ
రుఁడు-గంభీరవిభుండు నొక్కయెడఁ గూ♦ర్చుండంగ-భృత్యుండు నొ
క్కెడఁగూర్చుండుచు నారగించి రతిసం♦తృప్తిన్ మదుల్ పొంగఁగన్! 114

సీ॥ ఇంతలో సేవకుం ♦ డేగి సౌధోపరి
క్షోణియంతయుఁ బరి ♦ శుభ్రపఱచి!
యల శరద్గత వలా ♦ హక ఖండములువోలె
నెగడు శయ్యలను రెం ♦ డిటిని బఱచె!
ముందున్న బల్లపై ♦ మొకమాలు పఱచి పై
నను వ్రాయఁదగిన సా ♦ ధనము లుంచెఁ!

బరపైన యపరంజి ♦ పళ్లెరంబందుఁ గ
ర్పూర తాంబూలముల్ ♦ పొందుపఱచె!

గీ॥ నీటయిన పాత్రముల స్వాదు ♦ నీర ముంచె!
బల్లపైఁ గాంతి గులుకు దీ ♦ పంబు నునిచెఁ!
బిలిచి నంత 'హసా' దని ♦ పలికి కొలువ
వేయికనుల ద్వారముఁ గను ♦ పెట్టి నిలిచె! 115

"గంభీరసింహ – నలినీరంజనుల సంభాషణము"

మ॥ నలినీరంజనుఁడుం జమూపతియు నా ♦ నందంబుతో భోజనం
బులు గావించుచు మేడపై కరిగి తాం ♦ బూలమ్ములం గొంచు ని
చ్చలు గూర్చుండిరి! సైన్యనాథుఁడు "వయ ♦ స్యా! సంగతుల్కొన్ని నేఁ
దెలియంగావలె! నీవు దెల్పినను సం ♦ ధింతుం ముదం" బం చనన్! 116

గీ॥ "నేనిచటఁ జేరి రెండుమూ ♦ న్నెలలె! రాజ
కీయము లెఱుంగ ననుచు శం♦కింతుఁ గాని,
దేవర సమక్షమందు నా ♦ తెలిసినంత
పలుకనేర్తు! భక్తి యెసంగఁ ♦ గొలువనేర్తు! 117

మ॥ గుములై మూఁగు విపక్షభూపతుల ను♦గ్గుల్ నూచముల్ జేసి యు
ద్ధములం దుగ్రనృసింహమూర్తి వనఁగా ♦ దైవారి-సారళ్యభా
గ్య మహత్త్వంబున మూడుమూర్తులకు సా ♦ టౌ త్పుండరీకాక్ష భా
వము దీపించుచు లోకవందితుఁడవై ♦ భాసిల్లితో సత్ప్రభూ! 118

గీ॥ పరుసవేది పవిత్ర సం ♦ స్పర్శఁ జేసి
యినుము బంగార మగురీతి ♦ నేను మీపా
దములు సేవించి మీఁది జ♦న్మమునసైన
వీరుఁ డనిపించుకొని కొంత ♦ పేరుఁ గాంతు!" 119

మ॥ అని వీరుండు విధేయుఁడై పలుక "సా ♦ ఖ్యం బయ్యె! రీవాధరి
త్రిని వీక్షించుచు-రాజకీయము-లసం ♦ దిగ్ధంబుగా నేను గ
న్గొన నేతెంచితి! లోకులెల్ల గుణయు ♦ క్తుల్ సౌఖ్య సంయుక్తులై
మనువారే! నరసింహరాయఁడు కృపన్ ♦ మన్నించునే భూప్రజన్! 120

ఉ॥ వీరనృసింహరావుఁ గని ♦ పెక్కు శరత్తులు దాఁటిపోయె! సం
సారమునందు నాతనికి ♦ సౌఖ్యమె! యెందఱు బిడ్డ! లర్థముల్
గోరిన యట్లు చేపడునొ ♦ కో! చిననాఁటి హితుండు నాకు! న
వ్వీరునిగూర్చి సుంత విని ♦ పింపుము! విందు" నటన్న వీరుఁడున్!, 121

ఉ॥ "పావనమూర్తి సద్గుణ వి ♦ భాపరిశోభి ప్రతాపరావు రీ
వా వసుధాతలంబుఁ బరి ♦ పాలన సేయుచు-దుష్టశాత్రవ
ప్రావృతుఁడై-పరాజయ ఖ ♦ రానలతప్తుఁడునై చనన్-మహో
బా విభుఁ డీనృసింహపతిఁ ♦ బ్రార్థనఁ జేయుట తెల్లమే కదా! 122

సీ॥ అమలసౌజన్య ధ♦న్య వసుంధరాదేవి-
నరసింహరావు కాం ♦ తామతల్లి!
చంద్రమఃకళవంటి ♦ సత్పుత్రిఁ బుష్పావ
తిని గని కొన్నాళ్లఁ ♦ దనువు విడిచె!
నరసింహవిభుఁడు సో♦దరి సాయమున నింత
వఱకు సంసారము ♦ జరపుకొనియె!
నామెగూడ గతించె! ♦ నాత్మజయును దాను
నిరువు రుందురు నేఁడు ♦ గృహమునందు!

గీ॥ వీరనరసింహరావు సం ♦ సారగతులఁ
గూర్చి యింతటికన్న నె ♦ క్కువ యెఱుంగ!
మఱి యతని యార్థికస్థితి ♦ పరిపరి విధ
ములుగ వాకొనుచుందురు ♦ భూమిజనులు! 123

చ॥ అమరపురీ నివాసి యగు ♦ నాతఁడు 'మోహనుఁ' డచ్చుకుప్పయై
యమరును! వానియొద్ద నెపు ♦ డప్పులు వట్టుచు నుండు! లక్షలా
చు మిఱియు మీఱె! మోహనుఁడు ♦ చోదకుఁడై నడిపించు నెల్లఁగా
ర్యముల నృసింహరాయవిభు! ♦ నాతఁడెపో యధికారి యింటికిన్!" 124

"పుష్పావతీ ప్రశంస"

క॥ అని వీరుఁడు వచియించిన
విని సైన్యేశుఁడు నృసింహ ♦ పృథ్వీశు తనూ
జను గూఱిచి తెలియఁగఁ గాం
క్షను దెలుపఁగ వీరుఁడును మొ ♦ గం బింతగుచున్! 125

ఉ॥ "దేవరయాజ్ఞ సర్వమును ♦ దెల్పెద! వీరనృసింహరాయ పృ
థ్వీవరుపుత్రి నిస్తుల ప ♦ విత్రగుణాఢ్య! మనోజు నిద్దపుం
బూవు లకోరి! యాలలనఁ ♦ బోలు లతాంగి జగం బెఱుంగఁగా
బోవదు నేఁటిదాఁక! మఱి ♦ ముం దెఱుఁగన్ గలదంట కల్లయే! 126

ఉ॥ ఆసతి యందచందముల ♦ నాడఁగ నే నెవఁడన్! మనోభవుం
డే సృజియించెఁబో తన య ♦ హీన చమత్కృతి తేటవాఱఁగా!

నీసునఁ గ్రుంగునట్టి నడ ♦ లేటికి! నాసతి మాటలాడ-నో
హో! సుర లాలకించి విను ♦ చుందురు కర్ణము లోరగించుచున్! 127

క॥ అమలగుణవంద్య యాకాం
త మెలంగెడు చోటు పావ ♦ నంబని తమ పా
దము లుంచి నడువనోడుదు
రమరులు! మానవుల మాట ♦ యనుకొన నేలా! 128

మ॥ కనునంతన్ మిఱుమిట్లు గొల్పఁగల సిం ♦ గారంబుమాత్రంబు గా
దనవచ్చున్! చాలిమూడ్కికిన్ మదికి సిం ♦ పై చూడఁజూడంగ నె
మ్మనముల్ బూర్ణముగా హరించెడు నసా ♦ మాన్యప్రభావాక్షి! యా
వనితామోహచరిత్ర భారతమగున్ ♦ వర్ణించి రూపింపఁగన్! 129

శా॥ ఏరాజేశ్వరుఁడైన నామెఁగొనఁగా ♦ నెంతేని వాంఛించు శృం
గారశ్రీపరమావతార! త్రిజగ ♦ త్కల్యాణ ధామంబు! భా
మారత్నంబు సమస్తలోకమునకున్ ♦ మాణిక్యదీపంబుగా
మీఱున్! దత్సతిఁ బోల రించుకయు ల ♦ క్ష్మీ-పార్వతీ-భారతుల్! 130

శా॥ ఆలీలావతి లోకమోహనశుభా ♦ స్యంబున్ విలోకించి హే
లాలావణ్యము నేత్రపర్వముగఁ గ్రోలన్ బోవ-వర్ణింపనే
లా! లక్ష్మీసతి చెంగటన్ నిలుచు లీలన్ భక్తి యుద్బుద్ధమై
కాలున్! జుట్టు ప్రదక్షిణించుచును మ్రొక్కన్ జిత్తము వ్వాంగెడిన్! 131

మ॥ లలనాలోకవతంస మా తరుణి చె ♦ ల్వంబైన క్రొమ్మించుఁ జూ
పులఁ బూవానలు నించునప్పు డమృతం ♦ పున్ సోన లుప్పొంగి న
ట్టులు నీలోత్పలమాలికల్ నెఱిపి న ♦ ట్టుల్ దోఁచి తోస్తోడఁ గ్రొం
బులకల్ రేఁగుచు దేవతాత్వవిభవం ♦ బున్ గూర్చు మర్త్యాళికిన్! 132

క॥ ఇల వరవర్ణినులకు నా
కలికి ననుకరింప నెంత ♦ కష్టమొ-ధాత్రిన్
గల పురుషుల కంతకు ల
క్షులయంతలు సతిని దరియఁ ♦ గష్టము-దేవా! 133

చ॥ కలిత నృపాలసౌధముల ♦ కాంతల కుండెడు నిగ్గు నీటులున్
వలపు బిసాళిచెయ్వులు న ♦ వప్రియభావ మెఱుంగ దామె! భా
మల కసమానభూషయగు ♦ మాఘ్యము తద్ద రహించు! రాజరా
జులు తలఁదాల్పఁ గోరఁదగు ♦ సుందరి! కోటులు మాట లేటికిన్! 134

క॥ అతిమధురమూర్తి-పుష్పా
వతిఁబోలిన బాల యీప్ర ♦ పంచంబున లే!
దతివ సమానాధిక వ
ర్జిత యగు-లక్షలును గొల్లు ♦ చెప్పఁగ నేలా!" 135

క॥ అని తరళేక్షణ గుణములు
వినుచుఁ గంభీరవిభుఁడు ♦ వీడని మది సం
గన దెసఁ గల రాగాంకుర
మును సూక్ష్మముగా గ్రహించి ♦ మోదముఁ గనుచున్. 136

ఉ॥ "నాదగు బాల్యమిత్రుఁడ సద ♦ నంబును గూర్చి తనూజఁ గూర్చి స
మ్మోదముమీరఁ దెల్పి తను ♦ వున్ గలిగించితి! వింక నిద్రకున్
బోదము! వేఁగినన్-బయన ♦ మున్ బొనరించెద! నీదు మిత్రతా
పాదసరూఢికిన్-మొగలి ♦ పల్లకు-నాదు కృతప్రణామముల్!" 137

మ॥ అని యయ్యిద్దఱు చెంతఁ జెంతఁగల ప ♦ ర్యంకంబులన్ వ్రాలి ని
ద్రను బ్రాపించిరి! కొంత సేపటికి భృ ♦ త్యశ్రేష్ఠుఁడున్ వారి ప
జ్జను నేలన్ బవళించె! శ్రాంతి రహాయిం ♦ చన్. నిద్దురన్ బొంది యా
వనజాతంబులు విచ్చు వేళకును లే ♦ వన్ గల్గి యుత్సాహులై! 138

"సైన్యపతి చంద్రమహలున కేగుట"

ఉ॥ ద్వారముచెంగటన్ భటుఁడు ♦ వార్త్వము నిల్పెను! దాని నెక్కి గం
భీరవిభుండు! భక్తి గను ♦ పింపఁగ నాతని సాగనంపె న
వ్వీరుఁడుః! ఢిల్లి-సైన్యపతి- ♦ భృత్యుఁడు ముందరఁగంగఁ-బద్మకా
సారమునొడ్డునన్ నడిచి ♦ చంద్రమహల్ దరియంగ నేగినన్, 139

సీ॥ ఆజాను దీర్ఘబా ♦ హార్గళయుగళం బు
దాత్త వీరోత్తమ ♦ త్వంబుఁ దెలుప,
సదమలాకర్ణ వి♦శాల నేత్రద్వయి
పరమ దుర్లభభాగ్య ♦ పరతఁ దెలుప,
సముదార దీర్ఘ వ♦క్షము మహావీరయో
ధ ప్రాజ్య పట్టభ ♦ ద్రత వెలార్ప,
భూరిలక్షణ దివ్య♦మూర్తి గాంభీర్యంబు
విశ్వ వశీకృతి ♦ వెలయఁజేయఁ,

గీ॥ బాల చెంగావి పట్టు దు♦మాలుపైన
రమ్యతరమైన మగజా తు ♦ రాయి గులుక,

వీరలోక రాహుత్తు - గం ♦ భీరసింహ
విభుఁ డెదురఁగోఁచె నరసింహ ♦ విభున కపుడు! 140

ఉ॥ వాకిట నిల్చియున్న ప్రభు ♦ వర్యుఁడు వీరనృసింహరాయఁ డా
లోక మొనర్చి యబ్బురము ♦ లోఁగొని కేలు మొగిడ్చి డాసి "యీ
లోకమునందుఁ గల్గు నృపు♦లున్ బ్రతినాపతు లెప్పుగొల్చు నీ
కీ కడ స్వాగతం బొసఁగ ♦ నెంతటి పుణ్యముఁ జేసియుంటినో!" 141

మ॥ అని కైదండ యొసంగి డించుకొని గే♦హంబందునన్ జేర్చి - "వీ
రనృసింహాధిప! నిన్నుఁ జూచుట కజ ♦ స్రంబున్ బ్రయత్నించఁగా
నొనగూడెన్ జుమి నేఁటి! కీవు సుఖివై ♦ యున్నాఁడవే! యప్పుడ
ప్పును నీనెయ్యము జ్ఞప్తికిన్ దవులుచుం♦డున్ మాకు ఢిల్లీపురిన్!" 142

ఉ॥ పావనశీల నీ యనుఁగు ♦ భార్య సుతన్ గని యావసుంధరా
దేవి గతించెనంచు విని ♦ "తీరనికష్టము నీకుఁ గల్గె నం
చే వెత నొందితిన్! రమణి ♦ యేగినఁ బుత్రిక నెట్లు సాఁకితో!
యీ వొకకష్టమే నెఱుఁగ ♦ నిట్టిది! పుట్టిననాఁటి నుండియున్!" 143

క॥ అని గంభీరవిభుండనఁ
దనసంసారస్థితులను ♦ దనకష్టములన్
వినిపించి యానృసింహా
వనిపతి యాతనిని మేడ ♦ పైకిఁ గొని చనెన్! 144

క॥ చని కమ్రాసనములపై
నను దగఁగూర్చుండి చిన్న ♦ నాఁటి చరితముల్
మనసారఁ బలుకుకొని వీ
రనృసింహాధిపుఁడు సైన్య ♦ రమణునితోడన్. 145

సీ॥ "వృద్ధనై దూరము ♦ వెడలఁజాలక సమీ
పమునందుఁగల యల్ల ♦ యమరపురిని
నా సరివాఁడె యు♦న్నతవంశభవుఁడు మో
హనుఁడనెడు ధనాఢ్యు ♦ నరసి వానిఁ
గుదిరించుకొంటి-నా ♦ కూఁతు కుద్వాహ వై
భవము నొల్లమిఁ జేసి ♦ బంధు లెవరు
రాఁబోరు! భానువా♦రము మూర్త! మీ రెందుఁ
బోవ కిం దుండుము! ♦ మోహనుండు,

గీ॥ ప్రథమదర్శనమున నింత ♦ వాఁడు గాఁగ
గనఁబడును! గాని చూపటె! ♦ కలిమికాఁడు!
హృదయమున నున్న దున్నట్లు ♦ వదరుచుండు!
నేఁ డిటకు వచ్చు! నీవును ♦ జూడ వచ్చు! 146

చ॥ ఇతరుల మెచ్చుముల్ మఱియు ♦ నింటికి నెచ్చము లన్నిఁ గూడి నా
కతనికి నిచ్చిపుచ్చుకొను ♦ నార్థికబంధము సాఁగుచుండు! నా
హితుఁడవు! పెద్దవాఁడ! వెటు ♦ లే నిలువంబడి పెండ్లిఁదీర్చి నా
వెతలఁ దొలంపవయ్య! యిఁక ♦ వేల్పుఁ జూచెద" నంచుఁ బల్కినన్! 147

మ॥ అల గంభీరవిభుండు "పెక్కులగు కా ♦ ర్యంబుల్ సమీక్షింపఁగా
వలెఁ! గార్యత్వర లే వెఱుంగుదువు! ని ♦ ర్బంధింపఁబో" కన్న న
ప్పలు కాలించి నృసింహరాయఁ "డిదె నే ♦ వత్తున్! క్షణం బిచ్చటన్
నిలువుం" డం చని క్రిందికేగి తనయన్ ♦ దెచ్చెన్ వడిన్ మేడకున్! 148

గీ॥ "బిడ్డ! డిల్లిసైన్యేశు గం ♦ భీరవిభునిఁ
గనుము! సార్వభౌమునకు నీ ♦ తనియెడఁ గడు
గారవం బుండు! యెట్టులో ♦ కదలి నేఁడు
పరమమైత్రిని ననుఁజూడ ♦ వచ్చినాఁడు!" 149

మ॥ అన "లోకోత్తరవీరు నిన్నుఁ గన న ♦ త్యానంద మయ్యెన్! దినం
బును నాతండ్రి త్వదీయ శౌర్యకథనం ♦ బుల్ దెల్ప నాలింతు! నా
జనకున్ మించిన ప్రేమవార్ధివి! నమ ♦ స్కారంబు లర్పించి నీ
కను సుస్వాగత మందఁజేతు" నని యం ♦ ఘ్రుల్ గొల్చె నా లేమయున్! 150

క॥ నలినీరంజనుఁడును మును
దెలిపిన పొగడికలు తేట ♦ తెల్లంబుగ నీ
లలనయెడ సార్థకంబగు
ననుచుఁ జమూపతియుఁ దోయ ♦ జాక్షిని గనుచున్, 151

క॥ "అరుదెమ్మ! తల్లి! నీమం
దిరమున కే నడుగుదెంచి ♦ నినుఁగని మిగులన్
మురిసితి! నిటఁ గూర్చుండుము
పరితృప్తిన్ గంటి" ననుచుఁ ♦ బలుకుచు నుండన్, 152

క॥ వినయపరుఁ డొక్కభృత్యుఁడు
చనుదెంచియు 'నారగింపఁ ♦ జనుదెం'డని పి

ల్చిన నపుడు మువ్వురును డిగి
చనిరి మహాసనముఁ జేర ♦ సంతోషమునన్! 153

"మోహనుని రాక"

గీ॥ కుడిచి పడసాలలోన వా ♦ రచట గిడఁగనె
వాఁకిటను దోఁచె నొకబండి ♦ వచ్చు చప్పు
డదియు మోహను శకటమం ♦ చెద గ్రహించి
ప్రీతిమెయి నాసనము వీడి ♦ వేగ లేచి, 154

క॥ "అరుదెంచె మోహనుఁడు! స
త్వరముగఁ గొనివత్తు! మీరు ♦ హైకేసుఁ" డటం
చరిగి నరసింహరాయఁడు
తొరతొరఁ దనక్రొత్తియల్లుఁ ♦ గోడ్కొని వచ్చెన్! 155

గీ॥ 'అమరపురవాసి–పేరు మో ♦ హనుఁ' డటంచు–
'శ్రీయుతులు వీరు గంభీర ♦ సింహు' లనుచు–
నొకరి కొకరికిఁ దెలుప–వా ♦ రొండొరువులు
పరిచయపు లాంఛనంబులు ♦ పలుకు కొనిరి! 156

ఉ॥ "నాదగు బాల్యమిత్రుఁడు స ♦ నాతనధర్మ పరాయణుండు–ఢి
ల్లీదళవాయి–దుర్దమ బ ♦ లిష్ఠుఁడు–కీర్తివిభాసి–పార్వతీ
శాదులనైన మెచ్చని భ ♦ యావహ శౌర్యుఁడు–నన్నుఁ జూచియున్
బోద మటంచు వచ్చె" నని ♦ మోహనుతో నరసింహరావనన్, 157

"మోహనుని యుపన్యాసము"

క॥ "ఎఱుఁగుదు ఢిల్లీనగరము!
నెఱుఁగుదు నేఁ బృథ్వీరాజు! ♦ నెఱుఁగుదు సైన్యే
శ్వర సామంతుల నూద్వర!
నెఱుఁగుదు నందఱ చరిత్ర ♦ లెన్నేండ్లుగనో! 158

చ॥ తఱుచుగ 'రాజకీయముల ♦ దార్ఢ్యము తగ్గ' నటంచు నాస్వయం
వర మయినంత నుండియును ♦ వార్తలు పుట్టెను ఢిల్లిఁగూర్చి! మీ
రరుదుగ సాయముల్ సలుపుఁ ♦ డంచని మమ్మును వేఁడుచుందు! రే
తరుణమునందుఁ దాఁకుడులు ♦ తగ్గియు హెచ్చెను వారినుండియున్! 159

చ॥ సరభసభంగిఁ జేయఁదగు ♦ సాయము లన్నియుఁ జేసి యొక్కనిన్
బిరబిర సాగనంపఁగనె– ♦ వీనిని మించిన కోలుకాండ్రు పె...

క్కడ దనుదెంతు రా దినమొ! ♦ కోళ్లను గోలికయుల్లు–చేటలన్
జెరగిన యట్లు! లిందఱకు ♦ సేవ యొనర్పఁగ నెవ్వఁడోపెడిన్! 160

మ॥ ప్రతిమాసంబును ముప్పదో–నలుపదో ♦ రాబందుపుల్గుంగుముల్
గతి–వాపైనను వాలుచుండు! రిపుడున్ ♦ గంభీరసింహేంద్రుఁడన్
బృతనాధీశుఁడు వ్రాలి వార్దినము ల ♦ ర్యున్! బంచ వీడింపు! ను
ద్ధతు నాసాయముఁ గోరుచుండె! నెటులో ♦ తప్పించి రావించితిన్! 161

చ॥ తలపఁగరాదు ఢిల్లి వసు ♦ ధాపతి యోధుల దండగంబు! ప
క్షులు నలుదిక్కులన్ బొదువ ♦ గొన్న విధంబున వచ్చి వ్రాలి లో
కుల కవయంబునన్ గలుగఁ ♦ గూడని రాయిడి గూర్చుచుండు! రీ
విలయము పృథ్విరా జెఱుఁగు ♦ పెం పది యెన్నటికైనఁ గల్గునే! 162

మ॥ వినయశ్రీనిధియంచుఁ బేర్వడిన పృ ♦ థ్వీసింహు నామందిరం
బునకున్ బిల్వఁగఁబంచి యన్నివిషయం ♦ బుల్ దెల్పి యాపైన శా
స్త్రనికాయంబుల కెప్డు సైన్యపతులున్ ♦ రాకుండఁగాఁ గట్టడన్
బొనరింపన్ వలె నంచు నాజ్ఞ యిడ నెం ♦ తున్ నేను నిష్కర్షతో!'' 163

మ॥ అన–గంభీరచమూనరాస్యముపయిన్ ♦ వ్యాపించె భానూదయం
బున విస్తారసహస్రపత్రనిచయం ♦ బున్ గేరు నాశోణకాం
తి నికాయంబు! నృసింహరాయవిభుఁ డా ♦ ర్తిన్ బొంది కూర్చుండెఁ! ద
ర్జనముల్ చేసిన నోడమూయఁడని నై ♦ రాశ్యంబు తన్ ముంపఁగన్! 164

మ॥ అనురాగోక్తులఁ జూతు నంచు నరసిం ♦ హాధీశుఁ "డో ప్రాజ్ఞుఁడా!
నిను వర్ణించెదఁ! దొందరన్ బడకు! శాం ♦ తిన్ బొందు! ఢిల్లీ పురీ
శుని వృత్తాంతము లేటి కి ట్లిచట! హె ♦ చ్చుల్ లొచ్చులున్ వారలే
కనఁగా నేర్తురు! వారివృత్తిఁ దఱువం ♦ గా భావ్యమే యిచ్చటన్!'' 165

మ॥ అనినన్ మోహనసింహుఁడున్ "భయము లే ♦ దావంత! నే నిప్పు డే
రిని నిందించితి! భూమిపాలుర విమ ♦ ర్శింపంగఁ దప్పౌనె! పృ
థ్వీనృపుం డైనను వాని పూర్వులయినన్ ♦ విశ్వస్తతంబైన మొ
త్తని వృత్తంబు రహింపకున్నఁ బ్రజలున్ ♦ దర్కించుటల్ నింద్యమే!'' 166

ఉ॥ ఈ నుడులన్ జెవిన్ బడిన ♦ నెంతయు ఢిల్లి చమూవిభుండు కో
పానల దీప్తుఁడై నిజ ఖ ♦ రాసిపయిన్ జెయిమోపఁ జూచె! న
చ్చో నరసింహరా వతని ♦ జూచి "మదీయ తనూజఁ బిల్చెనన్
గానము సేయు! నీవు విని ♦ నన్ ముద మందెద" నంచుఁ బల్కినన్, 167

మ॥ "కరమున్ హర్షముఁ గాంతు" నంచుఁ బలికెన్ ♦ గంభీరసింహేంద్రుఁడున్! శ్రీ
నరసింహేంద్రుఁడు క్రిందికేగి తనయన్ ♦ రప్పించుచుఁ బిల్వఁగా-నుఁ
దరి నిర్వేదము చూపె! బుద్ధు లిరవొం ♦ దన్ బల్కి పుష్పావతిన్
వరు పేరన్ బచరించి యొప్పియిన తాఁ ♦ బ్రార్థించె దీనాస్యుఁడై! 168

మ॥ కడకెట్లో! జనకుండు "గౌరవము ద ♦ క్కన్ జేయు" మంచున్ గనం
గడుఁ బ్రార్థింప లతాంగి వీణియను చ ♦ క్కన్ గొంచుఁ బైమేడకున్
నడిచెన్! ఫుల్లసరోజనేత్రఁ గనుచున్ ♦ "తల్లి! నేఁడేటి యా
క్కడఁ గూర్చుండుము రమ్మ"టంచుఁ బిలిచెన్ ♦ గంభీరసింహేంద్రుఁడున్! 169

"పుష్పావతి గానము చేయుట"

క॥ తగినట్టి యాసనంబున
సొగసుగఁ గూర్చుండి వీణ ♦ శ్రుతి పఱచుచు పొం
పుగ రాగాలాపంబును
జిగురాకుంబోఁడి యప్పుడు ♦ చేయన్ దొడఁగెన్! 170

మ॥ స్వరవిన్యాసములున్ రసప్రచుర భా ♦ వస్వారస్యముల్ దోఁప-రా
గ్గలుఁగన్ మంజుల'మేఘరంజని', నలం ♦ కారప్రయుక్తిన్ మనో
హర వాసంత విలాస కోకిల మనో ♦ జ్ఞారావసంకాశ సు
స్వరతన్ గాన మొనర్చె ప్రమోదులు చిగు ♦ ర్పన్ జేతముల్ పొంగఁగన్! 171

మ॥ లలనారత్నము మేఘరంజని స్వరా ♦ లాపంబుఁ గావించి మం
గళ కంఠస్వన మొప్పఁ బాడుతఱి నా ♦ కాశంబునన్ జిన్ని మ
బ్బులు వాతావరణంబు చు ట్టలుము గుం ♦ పుల్ గట్టుచున్ వానచి
న్కులు రాలంగఁ దొడంగె! సైన్యపతి యెం ♦ తో హర్షమున్ గాంచుచున్, 172

మ॥ "సరసీజేక్షణ! గాననైపుణికి నే ♦ సంతోషమున్ గాంచు ట
బ్బురమే! చుట్టును గల్గు నీప్రకృతియే ♦ పూర్ణానుమోదంబునన్
గలుఁగెన్ జూడుము! మేఘముల్ నభమునన్ ♦ గన్పట్టుచున్ వానయున్
గురిసెన్! నీ మృదు గానసౌష్ఠవము నా ♦ కున్ మెచ్చు పుట్టించెడున్!" 173

మ॥ అని గంభీరవిభుండు న త్తరుణి గా ♦ నానూనసూక్తిన్ నుతిం
చిన నమ్మోహనుఁ జాలకించుచుఁ బర ♦ శ్రేయః ప్రకాశిత్వ లా
లసమున్ సైపనివాఁడు కావున నిజ ♦ శ్లాఘావకాశంబులున్
బనుపొందన్ గొనసాగఁజేసెను మహో ♦ పన్యాస మీరీతిగన్! 174

“మోహనుని మహోపన్యాసము”

ఉ॥ “గానము సేయ మేఘములు ♦ గ్రమ్ముచుఁ జిన్కులు రాలఁ జొచ్చె నెం
దేనియుఁ నబ్బురం బగునె! ♦ యియ్యది వానల కాలమే కదా!
దీనిని మించు రాగములఁ ♦ జెప్పెదఁ దక్కినవెల్లఁ బల్కినన్
మానసముల్ చిగుర్చు! నను ♦ మానము మాని సమాలకింపరే! 175

మ॥ ‘పవి’ రాగంబును నాలపించినను న ♦ భ్రం బెల్ల మేఘావృతం
బవు! బైరాలును పెద్దపెద్ద పిడుగుల్! ♦ హాహా కృతుల్ చేసి లో
క వితానంబులు క్రుగ్గి క్రుగ్గి చను! నీ ♦ కాలంబు నారాగ మీ
భువి నెవ్వారును బాడ! రాపదలకున్ ♦ మూలంబుగా నుండుటన్! 176

మ॥ కలి రాగంబును బాడ-సద్దెసల వే ♦ గన్ దయ్యముల్ పుట్టు! జాం
గల రాగంబును దీయ-నెల్లెడల శా ♦ కవ్రాతముల్ లేచుఁ! బం
గల రాగంబును బాడ మ్రోడులును జ ♦ క్కంగాఁ జివుర్వెట్టు! మం
గళ రాగంబును దీయ బాసికములున్ ♦ గన్పట్టు వేవేలుగన్! 177

సీ॥ లగుడ రాగంబు నా ♦ లాపంబు చేసిన-
వినువారి వెన్నులు ♦ వ్రీలి పోవుఁ!
బూర్వశోభన రాగ ♦ మును నాలపించినఁ-
బడకిండ్లు వేనవేల్ ♦ ప్రభవ మందు!
భువనకంటక రాగ ♦ మును బాడ-నిలయెల్లఁ
గంపతెట్టెలు పుట్టి ♦ గాసి వెంచు!
లంబాడి రాగ మా ♦ లాపింప-సంచులు
కోటానఁగోట్లునై ♦ క్షోణి మొలుచు!

గీ॥ శిశిరము-వసంతము నడుమఁ ♦ జిత్తగించి
పరమ హిందోళి రాగంబుఁ ♦ బాడి రేని-
విన్నవారల దేహముల్ ♦ వ్రీలి మరణ
మొందుదురు రెండు పగలుల ♦ యందు నిజము! 178

ఉ॥ ఎన్ని యమోఘ భూరుహము! ♦ లెన్ని వనస్పతు! లెంత మూలికా
సన్నయ! మెన్ని పూవులు! ప్ర ♦ సన్నలతా ఫలరాజి యెంత! సం
పన్న ధరాతలంబు! మన ♦ భారతదేశ పదార్థకోటి య
త్యున్నత సారవంత! ముప ♦ యోగ మొనర్చెడి ధీరుఁ డుండినన్! 179

ఉ॥ మన్కువతో నిశీథముల ♦ మంచి ముహూర్తః
ల్చక్కని పెద్దపెద్ద శిల ♦ లన్-రథకారుఁడు ౼

జెక్కులఁ జెక్కుచందమునఁ - ♦ జెక్కు-మలంపఁగ-చూపు దీక్షఁగా-
వ్రక్కలు సేయ-సాధ్యమని - ♦ వ్రాసిరి కొండెలవంటి పండితుల్. 180

సీ॥ వెలిచంద్రవ్రేళ్లఁ జొ ♦ బ్బిలు రసంబున ముంప-
నినుప గుండ్లొట్టె పై ♦ కెగురనేర్చు!
సురపొన్నరసము పై ♦ నొరయు నంతట కాతి
గుండ్లు బెండ్లుగ మాడ్చు ♦ గొనఁగనేర్చు!
నిప్పు యిపుళ్లంటి ♦ యినుము నంటిన క్షణం
బున నది ద్రవమయి ♦ పోవనేర్చుఁ!
బ్రబ్బలాకునఁ బాద ♦ రసపుఁగుండను డాఁక
రసము సీరముగ మా ♦ ఱంగనేర్చు!

ఆ॥ విరిగి బెరడుఁ దెచ్చి ♦ నెచ్చచేసి తినిన-
యాతఁ డొరుల దృష్టి ♦ కందఁబోవఁ!
డిట్టి క్రియలు కోటు ♦ లెసఁగును మనదేశ
మందు! వానిఁ దెలియు ♦ నతఁడె కొదువ! 181

ఆ॥ బ్రహ్మదర్భఁ దెచ్చి ♦ బ్రహ్మజముఁడు చేర్చి
బ్రహ్మబిందువులను ♦ బట్టి నూటి
బ్రహ్మరంధ్రమునకుఁ ♦ బట్టించి కేనియు
బ్రహ్మభూయ మొందు ♦ భ్రష్టుఁడైన! 182

సీ॥ అమవస-యాదివా♦రమునాఁడు ప్రణవపూ
ర్వక మనుష్ఠాన కా♦ర్యములు దీర్చఁ!
యూరివెల్పల బల్లు♦లుండెడు బొరియల
కడ కేగి యొకదాని ♦ వెడలఁదోడి!
కత్తిచే దాని తోఁ ♦ కను గోయ-నాముక్క
యెగురు! న ప్డందఱు ♦ నెగురవలయు!
నది చలించుట మాని ♦ నంత నందఱు నిల్వ—
వలయు! దాని బరణి ♦ భద్రపఱచి!

గీ॥ దూది చుట్టి-తైలంబునం♦దునను ముంచి
పెండ్లి ఇండ్లలోఁ దిరుణాళ్ల ♦ వేళ లందు
దాని వెలిఁగింప-జనులు గా♦ర్దభము లట్టు
లెగురుదురు కాళ్లు నిలుప కెం♦తేనిఁదడవు! 183

సీ॥ ఇంతదూరంబు నే ♦ నీ విశేషంబుల
నేల వర్ణింపఁగా! ♦ దూలగొండి
వేఱొక వస్తువు ♦ చేర్చి చూర్ణించి
ధరణియందున భద్ర♦పఱచి యుంచి,
సూచీముఖమున నా♦చూర్ణంబుఁ గొని కూప
మునను గాని తటాక ♦ మునను గాని
ప్రాఙ్ముఖుఁడై నిల్చి♦పడవేయ జలమెల్ల
క్షణమునందునఁ జేరి ♦ గడ్డ కట్టు!

గీ॥ వేయి బారువగుం డ్లందు ♦ వేసిరేని
మునిఁగిపో! వస్టె మొకతొట్టి ♦ కొనుచు లేచు!
నిటులు జలమున దూఁకి నే ♦ నెన్నిమార్లొ
యడుగు నీ రంటకయె పైకి ♦ వెడలియుంటి! 184

ఉ॥ లాఁకలు వెట్టుచున్ బాలము♦లో గుబురొందిన పెద్దకాకిదొం
డాకును దెచ్చి దాని పస♦రందు శరీరము ముంప- నగ్గిలో
దూఁకగవచ్చు! శాంతిరతి♦తో నిదురింపఁగవచ్చు! రోమమున్
గాకయు సోఁక! దచ్చటనె ♦ కాపుర ముండఁగ వచ్చుఁ గల్పముల్! 185

సీ॥ వనమూలిక యొకంటు ♦ దనరు! నద్దాని వా
సన సోఁక వేయివ♦త్సరములకును
మును మరణించిన ♦ జనులైనఁ ద్రుటిలోన
బ్రతుకఁగలరు! దాని ♦ పస దెలియక-
యెనిమిదేండ్లపుడు నే ♦ నీజిప్టు చని యుండి
మఱచి తప్పితొ గొప్ప ♦ పిరమిడులను
జేరఁ దద్వాసన ♦ పాఱి వేలేండ్లు పూ
ర్వము చచ్చి యందుఁ బూ ♦ డ్వఁ బడియున్న

గీ॥ యవనిపులు నిద్రమేల్కాని ♦ నట్లు లేచి!
రా వనస్పతి మన దొడ్డి ♦ యందుఁ గలదు!
జగతి జనులంద ఱొకసారి ♦ చచ్చిరేని-
నేను బ్రతికింపఁగల నొక్క ♦ నిమిష మందు! 186

ఉ॥ కూడని కానివాని కొక ♦ కొంచెము కీడొనరింపఁ గోరినన్
గూడ దొకింత సందియము ♦ నన్! దొడిమల్ కడు మ్రాఁగి మెత్తనౌ
నూడుగుఁ బండులన్ నమలి ♦ 'హు' ధ్వని యూఁదిన-వాని నోటి పం
డ్లూడును! బోసినోరు వడి ♦ యుర్విని గూలు నతండు మూల్గుచున్!" 187

మ॥ అని చౌక్కాయను గల్గు లోపలి రహ ♦ స్యంబైన యాసంచిలోఁ
దన-మున్ దాఁచిన దంతపుంబరణి మూఁ ♦ తన్ దీసి "యిద్దానినిన్
గనుఁ! డీ చూర్ణమె దూలగొండి! యిది ని ♦ క్కం బొక్క చీమంత రా
ల్చిన నీపద్మసరోవరం బఖిల మో ♦ లిన్ గడ్డయై పోయెడిన్! 188

ఉ॥ ఉన్నదొ లేనిదో యొకటి ♦ యూఱక ప్రేలుచునుండు నీతఁ డం
చెన్నుచునుంద్రు! కాని యిట ♦ నించుక దబ్బర లేదు! మీకు కా
దన్న నిజంబు చూపఁగల! ♦ నద్దిర! పద్మతటాకమందు దీ
ని న్నెఱి రాల్చి దూఁకి త్రుటి ♦ నే వెలికిన్ జనుదెంతుఁ జూడుఁడీ! 189

మ॥ ఇది చూపించెద! లేచిరం డిపుడు! మీ ♦ కీ చూర్ణపుంశక్తి స
మ్మదమారన్ బరికించుటొప్పు! నన్నృతఁ ♦ బున్ బల్కుచున్ గొల్లగొ
ట్టుదునే మి మ్మిట! నాదు నైపుణము నేఁ ♦ డున్ జూపి మీ మెచ్చులొం
దెదఁ! గాకున్నను నాదు ప్రాణముల నిం ♦ దే పీడుదున్ జూడుఁడీ! 190

గీ॥ ఇన్ని మూలికల నెఱింగి ♦ యున్న నాకు
జీవమును శ్రమ లేక త్య ♦ జించు తెరవు
తెలియదే! యెన్ని క్రియ లేనిఁ ♦ గలవు గాక!
యొక్క పూ-వాసనను జూడ- ♦ నుసురు వాయు! 191

ఉ॥ నెట్టన మీరు రావలయు! ♦ నిక్కువమున్ గని పిమ్మటన్ ననున్
దిట్టినఁ దిమ్మినన్ మిము ను ♦ తించెద!" నంచు నిజాసనంబునున్
గట్టిగఁ ద్రోసి లేచె! నది ♦ కా దన లేక – నృసింహరావు "కూ
పెట్టకు! చెప్పినంత నెఱ ♦ వేర్చెడి దిట్టవు! శంక లేటికిన్! 192

క॥ చెప్పిన నొకటియుఁ జేసిన
యప్పని మఱియొకఁడు గాఁగ ♦ నలరాదనె! మా
యప్పా! శంకలకును జో
టెప్పాటున గలుగ! దెఱుఁగఁ ♦ మే నీశక్తిన్! 193

మ॥ అదిగా కీ సమయంబు కూడనిది! సా ♦ యంకాలమై యుండె! నీ
యదనన్ జిన్కులు రాలుచున్నవి! ప్రయా ♦ ణాయాస సంతప్తుఁడై
యిదె గంభీరవిభుండునున్ బలిమినై ♦ నేపాఱఁ! డిక్లాట ఱే
పుదయంబో మఱి సాయమో సలుపు మ ♦ త్యుత్సాహ మేపారఁగన్! 194

క॥ చలి కీదర కీజామున
ఝలమునఁ దడియుటయు మిగుల ♦ సాహసమని నేఁ

బలికెద! నాబోధము మది
నిలుపుము! నీక్రియలు నేఁడు ♦ నిలుపుము తండ్రీ!" 195

క॥ అని-యనునయ వాక్యమ్ముల
వినిచిన-బోధమును బెడచె ♦ విన్ బెట్టుచు మో
హనుఁ డాతని గనుగొని "యిటు
లనఁదగునే" యనుచు నట్ట ♦ హాసముతోడన్, 196

చ॥ "ఇది జలమై-మదీయ తను ♦ విందు మునుంగుట తథ్యమైనచోఁ
గడ-చలియంచుఁ జల్లనగు ♦ గాలి యటంచుఁ దలంకఁబోలు! నె
మ్మది నిటు లోకతత్త్వములు ♦ మంచియుఁ జెడ్డ యెఱుంగలేక నీ
వడవడ నంద నేటికి! కక ♦ టా! యిట జంకుకుఁ దావు గల్గునే! 197

చ॥ కృతయుగమాదిగాఁగఁ బరి ♦ కింపఁగ-భీతియుఁ గొంకు-జంకు-దీ
నత-జగమందుఁ గాపుర ము ♦ నర్చిన మాట ధ్రువంబు! కాని, యు
న్నతిఁగను నేను బుట్టిన క్ష ♦ ణంబున నన్నియు స్వస్తి పల్కె - భా
రతమును వీడె! నేటికిఁ జి ♦ రాకు! పరాకు వహింప నేటికిన్! 198

క॥ తల వెలికిఁ జూపఁ బుండగు
చలిలోఁ బుష్యమునఁ దుహిన ♦ శైలంబున-మం
చుల-గుడ్డలేక తిరిగితిఁ!
జలి-ననుఁ గనఁ బరువు లిడు ది ♦ శా ముఖములకున్! 199

గీ॥ దినమణి మయూఖసమితిఁ గేం♦ద్రీకరించి
దరియ నేతెంచి నాపైనఁ ♦ బరపె నేనిఁ
జలన మందక శిలమాడ్కి ♦ నిలువ నేర్తు!
శీతవాతాతపములఁ గా♦సిల్ల నేను! 200

మ॥ అలుకొందన్, బదిబాడవల్ మిరెపకా♦యల్ దెచ్చి చూర్ణించుచో
నులివున్ జెందను! సుంత దగ్గను సుఁడీ! ♦ యుచ్ఛ్వాస నిశ్వాసముల్
సలుపన్ నేర్తును స్వేచ్ఛమై! హృదయకో♦శంబుల్ దృఢంబైన మ
ర్త్యుల దేహంబులు వజ్రదేహములుగా ♦ నొప్పన్ బలోపేతమై! 201

మ॥ ననువున్ గోల్పడఁ గొండ పైఁబడిన! నెం♦డన్ గ్రాఁగఁ! దీవ్రాగ్ని గ్రిం
గిన నేఁ గాలను! కత్తితోఁ దెగను! నా♦గ్నేయాస్త్రముల్ నాపయిన్
బనియున్ జేయవు! పచ్చినీటికిఁ జలిం♦పన్ బోదునే! యేటికీ
యనుమానంబులు! లేచిరం! డిపుడె స♦త్యంబున్ నిరూపించెదన్!" 202

మ॥ అని గోడన్ బడి ప్రేలు ఖడ్గమును జా♦యన్ దీసి "నాచేయుఁ బ్రా
ర్థన మాలించి సరోవరంబు దరియన్ ♦ రాలేని, నా పక్షమం
దున నీఖడ్గముఁ జొన్పి ప్రాణముల నిం♦పన్ వీసుమున్! నేనునం
గను గాంక్షింతుర యేని - లెం డికఁ దటా♦కంబున్ వహింపఁగన్!" 203

మ॥ అని కొండంతటి మౌర్ఖ్య మూనిన నృసిం♦హస్వామి "నీ పుణ్యా! వివా
పని వ''ర్దించని గడ్డ మంటి వచియిం♦పన్-మోహనుం డింతయున్
వినమిన్-ఢిల్లి చమూవరుం "డితని యా♦విష్టైక్యం బాలింపు! వివా
దనె వారింపఁగ నేల! చెంత మన ముం♦డన్ నీకు వాట్లేనే!" 204

మ॥ అన, రీవావిభుఁ డిష్టమున్ దెలియఁ జే♦యన్-ఖడ్గ మందించె మో
హనుఁ "డయ్యేనుగు నెక్కినంత గను సౌ♦ఖ్యం బయ్యె! మేల్మేలు! రం"
డని మేడన్ దిగఁజొచ్చెఁ! జంద్రమహి ల♦క్ష్మీకుండు గంటీశుం
హునితో డిగ్గుచు నిర్వురన్ నడలి ర♦త్యుత్సాహ మేపారఁగన్! 205

క॥ తలవాకిలి దాపలి దెసఁ
గల ద్వారముఁ జొచ్చి యందుఁ♦గల సోపానం
బుల వెంట డిగుచు మువ్వురు
జలజసర స్తీరమునకుఁ ♦ జని నిల్చిటయున్. 206

"మోహనుఁడు పద్మతటాకమునఁ బడుట"

ఉ॥ ఎంచఁ బదాఱు మూరలుగ ♦ నెత్తగు రాతిని నిల్చి మోహనుం
డంచిత చూర్ణమున్ జిటికె ♦ డప్పుడు పద్మసరోవరంబునం
దుంచుచు "నోంహరో"యని మ♦హోగ్ర నినాదముతోడఁ జైకిఁ గు
ప్పించుచు దూఁకె! నీర మొక♦పెట్టికతొట్టి కరున్ ధ్వనింపఁగన్! 207

ఉ॥ తోయమునన్ బడ్డేలుమని ♦ దూఁకిన యంతట మోహనుండునున్
బోయెను సూటిగా నడుగు ♦ పూటిక ముట్టఁగ-సీత యన్న నే
మో యెఱుఁగండు! కావునను ♦ నుక్కిరి బిక్కిరియై కలంగి పా
నీయముఁ ద్రావుచున్ గడుపు♦నిండిన-మున్గుచుఁ దేలు చుండఁగన్! 208

మ॥ పులుగా కొంది నృసింహరాయఁడును వా♦పోవంగ-నా చెంత ను
త్పల హారంబునుబోని చిన్నపడవన్ ♦ వాహ్యాళి సంధించు నా
నలినీరంజనుఁ "డెవ్వఁడో కొలఁకులో♦నన్ ద్రాలె"నంచున్ గడున్
బలవద్ధాటిని దోనెఁ దోలుకొనుచున్♦బ్రత్యక్షమై నిల్చెన్! 209

మ॥ కలమందుండి జలంబునన్ దుమికె! న♦క్కాలంబునన్ సూటిగాఁ
దల కన్పింపఁగఁ దేలు మోహను, శకుం♦తస్వామి బల్పొందుటె

క్కలఁ గోడిన్ గబళించుకొని చనిన్ ♦ గాంచెంబునన్ బట్టి యం
దలిపోతంబునఁ జేర్చెఁ బ్రేక్షకు లమం♦దప్రీతి వీక్షింపఁగన్! 210

గీ: గట్టుఁ జేరంగఁ బడవ గ్ర♦క్కునను నడిపి
మోహనుని గ్రింద డించెఁ! జ♦మూపతియును
'నితని కపకరింపఁగఁ గడ ♦ కీవె దిక్క
యితివె' యంచుఁ గృతజ్ఞతా♦రతిని దెలిపె! 211

చ: మునుఁగుచుఁ దేలుచున్ సలిల♦మున్ గడు పుబ్బఁగఁ ద్రావియుంట మో
హను నరసింహరాయఁడును ♦ నాతని భృత్యతతుల్ చికిత్సలన్
బొనరిచి! యంత నేత్రయుగ♦మున్ లవమున్ దెఱచెన్! నృసింహరా
యనిముఖమున్ వెలింగె దర♦హాస విలాస వికాస రేఖలన్! 212

మ: "ధనముండెన్! ఘటకోటియుండెఁ! గదు స్వా♦తంత్ర్యంబుపై నొక్కభూ
పుని చందంబునఁ గాలమున్ గడుపుమీ! ♦ పుట్టెండు వెట్టెన్ శిరం
బున మోయన్ వల"దంచు నే ననుదినం♦బున్ గడ్డమున్ బోఁకి చె
ప్పిన నాలింపకపోతి! విట్టి యిడుమల్ ♦ వేధింప నెట్లోర్తునో! 213

మ: అనురాగాంబుధి-ఢిల్లిసైన్యపతి యే ♦ మం చాత్మ భావించు! నా
తనయన్ నీకిడి పెండ్లిసేతునని ప్రా♦తర్వేళ నేఁ దెల్ప-న
ల్లునిఁ గొండంతటి వెఱ్ఱిమానిసి నెటుల్ ♦ దోఁదెచ్చినావంచు న
న్ననఁగా - మో మెటులెత్తి యాఘనుని చా♦యన్ జూడఁగా నేర్తునో! 214

మ: సురకన్యా సమ రూపశీల యుత సు♦శ్లోకత్వ సౌభాగ్యభా
స్వర నాపుత్రిక "యిట్టివేఁదుఱున కు♦ద్వాహంబు గావింతె తం
డిరి! యన్నన్-విస మింత పుచ్చుకొనుచున్ ♦ నేనంతమున్ జెందఁగా
నరుదెంచెన్ సమయంబు! నే మనిన ని♦న్నావంత మే లుండునే! 215

సీ: ఇంత కిచ్చోట నేఁ♦డే ప్రళయము గూడె!
సైన్యనాథుఁడు గాన♦సరణి మెచ్చె!
నంతలోనఁ బ్రపంచ♦మంతరించి చనెనె!
యదిగాక నీవు పెం♦డ్లాడ మన్న
యువిదయే గద యని ♦ యోర్చుకోనఁగ లేక
పరిపరి విధముల ♦ వాగిపోతి!
వీ దూలగొండి నీ ♦ కెట దాపురించె! దా
నిని రాల్ప నీదు ఘ ♦ నీభవించు

గీ॥ ఎటు గలుగు! గాసు వీసము ♦ నేని లేక
బిచ్చమెత్తుకొనెడు నిరు♦పేద నేని
నిట్టి వృత్తికిఁ జొచ్చునే! ♦ యేమనందుఁ!
బెంకెవో! కుంకవో! నిరూ♦పింప లేను! 216

ఉ॥ నాలుక పీఁకికొన్నఁ ద్రుటి ♦ నాదగు మాట వెఱంగఁబోవు! నీ
వాలముఁ బెంచి లంక కడ ♦ వాయుతనూజుని భంగి నగ్నిమన్
గాలిచి బొగ్గు చేసెదవు! ♦ కాదన-'నప్పు నొసంగుమందు! వా
వేలుపులెల్ల జెప్పినఁ జె♦విన్ బడ నీ! వెటువంటి మూర్ఖుఁడో! 217

ఉ॥ పుట్టినుబుట్టు బుద్ధి తుదిఁ ♦ బుల్లలతోడనె కాని పోదు! నే
నుట్టట లూఁగుచుంటి! మఱి ♦ యున్ మఱియున్ నెలకేఁగఁ గేఁగ నీ
వెఱ్ఱి పెరుంగుఁ! దగ్గు నని ♦ పింపదు! నాదు నదృష్ట మిహా విధం
బొఱ్ఱియ వోయె! నెంత వగ ♦ నొందిన నేమి ఫలంబు నోహహా! 218

ఉ॥ ఐనది యయ్యె! నిప్పటికి ♦ నైన ననున్ విని వెఱ్ఱి పోకడల్
మానుము! నేఁటినుండి పని♦మాలిన వ్యర్థపు బొల్లిమాటలన్
మానుము! తిక్కమానిసి వ♦నన్ జరియింపకు! లోకమందు నా
మానముఁ దీయఁబోకు! నిను ♦ మా యిలువేల్పుగఁ జూతు" నం చనన్! 219

ఉ॥ "నమ్మరు మీర! లేరి వద♦నంబును గంటినొ! దూలగొండి మా
ర్ణమ్మిట్టులయ్యె నేఁడు! భిదు♦రంబును బోలిన మాయుధమ్ము వ్య
ర్థమ్మయిపోయె! నింతటి వ్య♦ర్థన్ బడ చేసెకనాఁడు గూడ! మా
యమ్మయు తోడు! నేఁబలికి ♦ యవ్వలఁ దప్పను బ్రహ్మవచ్చినన్! 220

ఉ॥ ఏనును దూలగొండిపొడి ♦ యేఁబదిసారులు వేసి చూచితిన్!
గాని యొక్కప్పుడున్ జయముఁ ♦ గానక గాసిలపేదు! నేఁడిటుల్
హానికి హేతు వున్న! నవు♦నౌ! నొకసూదిని వేయఁదగ్గ యు
ద్దానిని దద్ద సైచితిని! ♦ దాన జనించె ననర్థ మీగతిన్! 221

చ॥ పొరవడి నేను బ్రాగ్వదన♦మున్ గన కుత్తరదిఙ్ముఖుండనై
యురవుగ దూలగొండి నిడి♦యుంటి! నదే యిటు గొంతు నొక్కి కి
క్కురు మనిపించె! నీ వయినఁ♦గూడదు కాదని పల్కనైతి! వి
త్తఱి నెటు చింతఁజేసిన-వృ♦ధా కద! కల్గవుపో ప్రతిక్రియల్! 222

మ॥ చిరజీవీ! యల తూర్పుగా దిది యుదీ♦చీ దిక్కు నుమ్మంచు నా
కెఱుఁగన్ జేసితె! చిన్ననాఁడు బడియం♦దే నెప్పుడున్ విద్దెలన్

గలవన్ లేదు గదా! చతుర్దశ లెఖుం ♦ గన్ నాకు బ్రహ్మోస్తు! చె
చ్చెర నేఁ డిందలి తప్పు లన్నియును నీ ♦ చే నయ్యె! వా దేటికిన్! 223

సీ॥ ఇది తూర్పు గాదు సు ♦ మ్మీ! యంచుఁ బట్టి తూ
ర్పునకుఁ ద్రిప్పుమి - నీది ♦ మొదటి తప్పు!
దృష్టిదోషము గాఁ జు ♦ మ్మీ! యంచు సైన్యేశు
నవలఁ బంపమియు రెం ♦ డవది తప్పు!
యిది నా సరస్సు సు♦మ్మీ! నలినీరంజ
నా! రాకు మనమి మూఁ ♦ డవది తప్పు!
నితని యిష్టము గాఁ జు♦మ్మీ! పైకిఁ దీయఁగాఁ
దగదు పొమ్మనమి నా ♦ లుగవ తప్పు!

గీ॥ తప్పు లన్ని నీపై నుండఁ ♦ గుప్పలగుచు
నన్ని నాపైని వైచు టై ♦ దవది తప్పు!
నిన్ను సంరక్షకునిగాఁగ ♦ నేను గొనుట
యదియ నేఁ జేసినట్టి కొం ♦ డంత తప్పు! 224

గీ॥ ఎప్పుడు నలినీరంజను ♦ నెడల నాకు
మనసు కుదురదు! వానిదా ♦ చెనటి దృష్టి
దోష మిటుసోఁకి వమ్మయ్యె ♦ దూలగొండి!
శనివలెను చేరె నీ దేశ ♦ మునను వాఁడు!" 225

మ॥ అన – "గంభీరవిభుండు చెంతనె గలం ♦ డా బాలుఁడే నీట ము
న్గిన నిన్నున్ బయికెత్తి యోడపయి యు ♦ క్తిన్ దెచ్చి తీరమ్ముపై
నను జేర్చెన్! దురదృష్ట! 'మాతఁడు నినున్ ♦ గాపాడె' నన్ గీర్తిఁ గై
కొనె! నీవాతని దూఱ – లోకులు కృత ♦ ఘ్నుండంచు ని న్నాడరే! 226

క॥ జరిగిన యవివేకంబెటొ
జరిగెన! ఇఁక దాని గొడవ ♦ చాలించి పయిన్
జరగవలయు పని గను"మని
నరసింహవిభుండు పల్కె ♦ నన్ మోహనుఁడున్! 227

మ॥ "అరె! యీ దేహము నాది! నాది యగు నీ ♦ ప్రాణంబు! నాయిష్టమై
యువరాజైనన్ గద నీట మున్గుటయొ - వ ♦ హ్నిన్ జొచ్చుటో - వేఱె యొ
క్కరికిన్ బాధ్యత యున్న దే! యపుడు! నా ♦ కాశంబుపై నెక్కెదన్! యు
ర్వర నే దూఁకుదుఁ! జత్తు! వల్వ దనుచున్ ♦ వారింపఁగా భావ్యమే! 228

మ॥ ఇఁకఁ గాసారములోన దూఁకుటయు నా♦యిష్టంబుగన్! నీటిలో
నొకనాఁ డుందునొ! యేఁడు లుండుదునొ! య♦న్యుల్ పిచ్చి భావింపరే! నే
సకలజ్ఞుండ నటంచు నీ వెఱుఁగవే! ♦ చాలున్! బనుల్లన్ విశా
వికలమ్మయ్యెన్! నిను నమ్మి నేఁడు చెడితిన్! ♦ జీవంబుఁ గోల్పోయితిన్! 229

సీ॥ ఆ యజంతాగుహ ♦ లన్ని చిత్రించు శి
ల్పుల కొజ్జనై పేరు ♦ మోసియుంటి!
నబ్ధి కిర్వంకల ♦ హెర్కులీస్ బొమ్మ నే
నిలిపినంతకు దిక్కు ♦ గలుగకుండె!
సోవియట్టులకు మాస్కో ♦ గంట కని వేడ
మూసను బదులిచ్చి ♦ పుచ్చియుంటి!
సేతుబంధన మప్డు ♦ శ్రీరాముఁడును గణ
నాథునకును మున్ను ♦ నన్నుఁ గొలిచె!
గీ॥ కన్నుసన్న నీరేడులో♦కములు గెలుచు
ప్రోడనగు నేను నీతమ్మి ♦ పూలకొలఁకు
గణన సేతునే! యొకనీటి ♦ కణముమాడ్కిఁ
గేలఁ గైకొని పాఱ ద్రిమ్మి♦గెదనుగాక! 230

మ॥ అకటా! మోహనుఁ డంతమొందినను నా♦కప్పిచ్చువా రెవ్వ రం
చిఁక నీ వాతని బ్రోత్సహించితి వటం♦చే నెంతుఁ! గాదేని వా
నికిఁ గాసారము జొచ్చు ధైర్యము – ననున్ ♦ నిరంబునందుండి ధై
ర్యకి లాగన్ గల ధైర్య ముండెడినె! నీ♦దేగాట లీయన్నియున్" 231

క॥ అని పోరువేళ – నమరపురిని మోహను గృహమునుండి ♦ భృత్యుఁ డొకం డా
తనిఁ బిలువ వచ్చె! నరసింహనృపాలుం డతని వెంట♦నడుగఁ దలఁచుచున్! 232

మ॥ తనయున్ బ్రక్కకుఁ జేరి "సైన్యవిభు–ను♦ద్వాహంబు సాంతంబు నొం
దినదాఁకన్ బయనంబు సేయవల దం♦టిన్! నీవునున్ జెప్పి యా
తని నొప్పింపు! మతండు నిల్చినను వం♦తల్ వందలున్ దీఱు! నీ
పని ముఖ్యంబుగఁ! జీద్రుమీ! పిదప దై♦వంబుండు"నం చాడుచున్! 233

మ॥ నరసింహేంద్రుఁడు మోహనుండును బ్రయా♦ణంబైరి! ఢిల్లీ చమూ
వరుఁ డుద్యానముఁ జూచుకోర్కి వెలయం♦పన్ – వెంటఁ బుష్పావతీ
తరుణీరత్నముగూడ వెళ్లె నరవిం♦ద వ్రాత సౌగంధ్యబం
ధుర మందానిల పోతసంతతి పయిన్ ♦ దోరంబుగా వీవఁగన్! 234

తృతీయాశ్వాసము



శ్రీ

# పుష్పవతి

## చతుర్థాశ్వాసము



" పుష్పవతీ-గంభీరసింహు లుద్యానమున నుండుట "

మ॥ ప్రమదారామ లతానికుంజములఁ బు♦ష్పవ్రాతముల్ జూచుచున్
భ్రమరీఝంకృతు లాలకించుచు ఖగ♦వ్రాతంబులున్ బాడు గా
నములన్ జొక్కుచు బోయి పోయి యొక పు♦న్నాగంబు క్రీనీడ డెం
దము లింపొందఁగఁ గూరుచుండి రొక స్ని♦గ్ధంబైన వేదిస్థలిన్! 1

ఉ॥ ధారుణిఁ గల్గు వార్తలు ప♦దంపడి వీరనృసింహరావు సం
సారము మాట పుట్టి యదు ♦ సమ్మన నన్నియుఁ జర్చచేసి గం
భీరవిభుండు పుల్లదర ♦ వింద దళేక్షణఁ గాంచి మోహనున్
గూరిచి-పెండ్లిగూర్చి-పలు♦కుల్ పచరించె! లతాంగి యంతటన్, 2

చ॥ "జలనిధిలోఁతు నెత్తి పయి♦స్వర్గము నెత్తు నెఱుంగ నేర్చు ధీ
బలులరు! మీకు నేమి తెలు♦పన్ గల! మోహనుఁగూర్చి సర్వమున్
దెలియుదు! రేల న న్నడుగ! ♦ దేవున కట్టులు విన్నవించెదన్!
దలఁగల వ్రాలు పోఁదుడువ ♦ నాతరమే విపదబ్ధితారకా! 3

క॥ నా పూర్వపుణ్యపాకం
బా పురుషునితో వివాహ ♦ మమరిచె! నీ సం
తాపముమెయి మల్లిక నెం
తో పుష్పి గ్రసించినట్లు ♦ దుర్గతిఁ బడితిన్! 4

ఆ॥ వాని చెట్టపట్టి ♦ నే నెంతగా హాస్య
భాజనం బగుదునో! ♦ పలుక సాకు
వశమె! వెఱ్ఱివాని ♦ భార్య వాడవదినె
యనుచు లోకులాడు ♦ నదియు వినరె!" 5

క॥ అనఁ -"దల్లీ! నీమది గుటి
యొనరించుచు వెతను గూర్చు ♦ నుద్దేశము నా

కును లే! దిచ్చటి స్థితిగతు
లనువుగఁ దెలియంగఁ గోరి ♦ యడిగితిఁ జుమ్మా! 6

సీ॥ నీ మనోమార్దవ ♦ నియతి-నీరూప వై
భవము-నీపరిశుద్ధ ♦ వర్తనంబుఁ-
గని, వాని గ్రామ్యవ♦ర్తనముఁ గన్గొనఁగ - నా
స్వాంత మగ్గిని గ్రేల్చి ♦ నట్లు పొగిలె!
నకట! నీయిడుమ వా♦యఁగఁజేయు టెట్లని
యుదయంబునుండి నే ♦ నుడుకుచుంటి!
నీపెండ్లి యగుదాఁక ♦ నిలువు మనియెఁ దండ్రి!
నిలువ జాల నటంచుఁ ♦ బలికియుంటిఁ!

గీ॥ గాని, నిను ముట్టు నాపదఁ ♦ గనిన పిదపఁ
గొమ్మ! కాళ్లాడకుండె నం♦గుళము నడువ!
నీ యిడుమ దీఱుదాఁక నే ♦ నిలుతు! వదలి
యవలఁ గదలను క్షణము! నా ♦ ప్రాణమాన!

సీ॥ చనుదెంచునపుడె త్రో♦వను నలినీరంజ
నునిఁ గంటి! నాతని ♦ మనసుఁగంటి!
నిట నిన్నుఁ గంటి! నీ ♦ యాప్తితంబును గంటి!
విను మొకమాటఁ దె♦ల్పెదను నీకు!
బీర మెట్లున్న గం♦భీరసింహేంద్రుఁ డ
ప్రతిమానలోక దు♦ర్దాంత శౌర్యుఁ
డని పేరు గలిగె! నా♦డు నధీనమైన మ
హోద్ధతి నిపు డుప ♦ యోగపఱచి

గీ॥ నీ విపత్తును బాప య♦త్నింతు! నజుని
వ్రాలు దుడుప యత్నింతు! నీ ♦ వలచు నంద
గాని నినుఁ గూర్ప యత్నింతు! ♦ మానసమున
సంతసము నింపవమ్మ! పు♦ష్పావతమ్మ!" 8

క॥ అనఁ "దండ్రీ! నీహృదయముఁ
గనుగొనఁలే కంటి! నన్ను ♦ క్షమియింపుము! నే
మని నన్నినాళ్లు నీపద
వనజములను మౌళిఁ దాల్చి ♦ భక్తిఁ జరింతుఁగా!" 9

"గంభీరసింహుఁడు నరహరిని మహాబాహుకుఁ బంపుట".

చ॥ అనుచుఁ గృతజ్ఞతల్ దెలుప ♦ హర్షముఁగాంచె నతండు! సందెజా
మున సదనంబుఁ జేరుకొని ♦ భోజనముల్ ముగియించి! రంత భృ
త్యునిఁ గని సైన్యనేత "నృప ♦ ఘూర్జటిఁ జేరఁగఁ బోయి నాదు లే
ఖ నొసఁగి వారియాజ్ఞఁ గొని ♦ క్రమ్మఱ నిచ్చటి కీవు రావలెన్! 10

సీ॥ ప్రభులోకమణి మహా ♦ బాహుఁడు! నదియు ము
న్నూఱుమైళ్లిచటికి ♦ దూరముండు!
నరసింహపుర రామ ♦ నగరంబులను నీవు
గుఱ్ఱంబులను మార్చు ♦ కొనఁగవచ్చు!
సౌమ్యవారము నేఁడు! ♦ జలజాప్తవారమం
దుదయంబె యిచట నీ ♦ వుండవలయు!
గుఱ్ఱాలమార్పుల♦కును భోజనంబుల
కేనూఱు రూప్యంబు ♦ లిత్తుఁ! గొనుము!

గీ॥ వార్ధు లింకిన - గగనంబు ♦ పై నొఱఁగిన-
క్షోణి కంపించి శైలముల్ ♦ క్రుంగి చనిన -
భానువారోదయంబు త♦ప్పక యిచటికి
వచ్చి దూఁకంగ వలయు - నీ ♦ ప్రాణమాన!" 11

క॥ అని లేఖను ధన మొసఁగుచు!
బనిచెన్! నరసింహరావు ♦ బల్లునఁ దెలవా
ఱిన వేళకు నింటికి వ
చ్చెను! మోహను నతనిగేహ ♦ సీమ విడుచుచున్! 12

"పుష్పావతీ వివాహ సన్నాహము"

ఉ॥ ప్రాతపురంబునన్ ధనిక ♦ వర్తకవర్గముఁ జేరఁ బోయి జా
మాతకుఁ బెండ్లిపీటల స♦మర్పణసేయఁగఁ బట్టు గుడ్డలున్
గూతున కీయఁగావలయు ♦ కోకలునున్ అవికల్ విభూషణ
వ్రాతము మూటఁగట్టుకొని ♦ వచ్చె నృసింహవిభుండు నెమ్మిమై! 13

మ॥ ప్రమదంబొప్ప నృసింహరాయఁడు నిజ ♦ ప్రాసాదరాజంబు సు
న్నముఁ బూయించి, విశాలతోరణములం ♦ దం బాఱఁ గట్టించి బి
య్యమునున్ జేడలు వట్టికట్టియలు నా ♦ జ్యం బాదిగాఁగన్ బదా
ర్థములెల్లన్ సమకూర్చి పెండ్లిపను లా♦రంభించె శీఘ్రంబుగన్! 14

క॥ క్రమముగఁ జంద్రమహాలు దు
ర్గము ముందఱఁ బందిరులును ♦ గ్రామాలంకా
రము లొనరింపఁగ నది య
య్యామరేంద్రుని వైజయంత ♦ మటు వెలుఁగొందెన్! 15

మ॥ భృగువారోదయ మాన్యసింహవిభుఁ డెం♦తేనిన్ బ్రమోదం బెల
ర్పఁగ నమ్మోహను కార్మిబంధువుల కా♦హ్వానంబు లందించి హా
యిగ జామాతను బుజ్జగించి మఱునా♦డే యాత్మస్నేహంబుఁ జే
రగ రమ్మంచని ముట్టఁబల్కి యిలుసే♦రన్ వచ్చె నారాత్రికిన్! 16

"పుష్పావతీదేవి వేదన"

క॥ అప్పుడు పుష్పావతి తన
చప్పర మంచమున మదన ♦ సంతాపము తోన్
గప్పఁగఁ బరుండి ప్రియు దెసఁ
జిప్పిలు మోహమునఁ బొగలు ♦ సెగ లెగయఁగన్, 17

ఉ॥ "తీయనివిల్లు-క్రొవ్విరుల ♦ తేఁటి-కిసాలయబాణపంక్తి-లే
దాయె నె కాని, నీవె జల ♦ జాక్షుల చిత్తములన్ హరించు నా
కాయజమూర్తి వంచు నినుఁ ♦ గైకొన నెంచితిఁ! గోర్కె లిప్పు డి
ట్లై మొగుపోఁతలయ్యె! నక♦టా! శుభకాలము నాకు వచ్చునే! 18

శా॥ నీసౌజన్యముఁగూర్చి కట్టువడుచున్ ♦ నిన్నెప్డు ధ్యానించుచున్
నీసల్లాప కళావిలాసరతులన్ ♦ మేనున్ గగుర్పొందఁగా
నీసావాసము నమ్మి స్వర్గమునకున్ ♦ నే నిచ్చెనల్ వైచి యే
దో సామ్రాజ్యము నొందుచందమున సం♦తోషించి యుప్పొంగితిన్! 19

ఉ॥ కౌఁగిటి కెక్కనున్న నినుఁ ♦ గట్ట! తొలంచు టటుండ-దానితో
నాఁగక గోరుచుట్టుపయి ♦ నాదట రోఁకటిపోటు ఘాతి నా
కా గిజిగాని మోహనుని ♦ యంటఁగఁ గట్టఁగనుండెఁ దండ్రి! యీ
యాగడ మేను మెచ్చి భవ ♦ దాస్యము నేగతిఁ జూతు నాయకా! 20

ఉ॥ అంపిలు నప్పుబాధ లచె♦ఱన్ బడఁజాలక తండ్రి నాయెడన్
అంపము వెట్టినాఁడు! పెను ♦ రక్కసి మోహనుఁదెచ్చి నాకు జో
డింపఁగ నున్నవాఁ! డిదియు ♦ డెప్పర! మెట్లు సహింతు! నక్కటా!
చంపఁగలేక చేసెఁ! దలి ♦ సచ్చినఁ దండ్రి యెవండు పుత్రికిన్! 21

ఉ॥ కేయుఁ బవల్ నినుఁ దలచి ♦ ప్రేమము నీపయి నిల్పి జీవితా
ధ్యాయము భూరిసౌఖ్యవిత ♦ తంబుగఁ ద్రోతునటంచు నుంటిఁ! బా
పాయతికేఁగి యట్టె విల ♦ యానిలఘాటికిఁ దీవె యూడి యి
స్సీ! యటవీస్థలిన్ బడి న♦శించు సుమం ♦ బయి రాల నుంటినే! 22

సీ॥ స్మరుని మించెడు సుప్ర ♦ సన్న మోహనమూర్తి!
యనురాగముల కెల్ల ♦ నాటపట్టు!
చటుల శౌర్యోద్రేక ♦ సంగ్రామపార్థుండు!
లావణ్యలీలా వి♦లాసఘనుఁడు!
దాక్షిణ్యనిరతి కా♦ధార మూల స్తంభ!
మతివాద మెఱుఁగని ♦ యలఘుగుణుఁడు!
దిగ్దేశములు మెచ్చు ♦ దివ్య తేజశ్శాలి!
లలితమహారాజ ♦ లక్షణుండు!

గీ॥ మగ సిరులకెల్ల నేకాంత ♦ మందిరంబు!
ముచ్చటలు దీర్చు ప్రేమ స♦ముద్రమూర్తి!
భర్తగ నలినీరంజనుఁ ♦ బడయ–నెన్ని
యాపదలకైన మనసార ♦ ననుమతింతు! 23

సీ॥ అతికాంతిమంతంబు♦లగు నాణె ముత్యాల
ప్రోవులు తూర్పారఁ ♦ బోసినట్లు!
దాడిమీ బీజ సౌం♦దర్యంబు హసియించు
జాతిరత్నము లెగ ♦ జల్లినట్లు!
కరమును శైత్యసౌ♦గంధ్యముల్ చిలుకు క
ర్పూరపుఁ బల్కులు కుప్ప ♦ పోసినట్లు!
బాగడలై సమములై ♦ సొగసు నించెడు మల్లె
మొగ్గలు నిలువునఁ ♦ బోసినట్లు!

గీ॥ నాప్రియు నలినీరంజను ♦ నవ్వు లోక
మోహనమె కాదు త్రిభువన ♦ మోహనమయి
యట్టె త్రైలోక్య సామ్రాజ్య ♦ మందఁజేయు
ననువునను నాదు హృదయంబుఁ ♦ దనుపుచుండు! 24

ఉ॥ ఆ లలనా సుమాస్త్రుఁ గని ♦ యాతని సంగడినుండి నేఁటికిన్
నాలుగునాళ్లు దాఁటి చనె! ♦ నాదు మనోహరుఁ డెట్టి వేదనన్

గాలము పుచ్చుచుండె నొకొ! ♦ నా ప్రియుఁడున్ సుఖమొందఁడాక! యా
భీల మదీయగాథ విని♦పించి తపింపఁగఁ జేయనేటికిన్! 25

ఉ॥ కాచెను బూచె నంచుఁ బలు♦కాఱులు ప్రేలుచు నెప్పు డాత్మవి
ద్యాచతురత్వముల్ ధన ని ♦ తాంత కథల్ పదికోట్లు చెప్పుచున్
నీచపుమాటలన్ వదర ♦ నీ సరి యా నొకొ మోహనుండు! హే
మాచల శృంగమెక్కి తెగ♦నార్చినఁ గోకిలమౌనె కాకియున్! 26

మ॥ నలినీరంజన! నీపడక్షురి నితాం♦తప్రేమమంత్రంబు ని
ద్రలయందున్ మఱువంగఁబోక సతమున్ ♦ ధ్యానించుచున్ సౌఖ్యప్రా
గలలన్ గంటిని రెండు మూన్నెలలుగాఁ♦గన్! నేఁడు దైవంబు క
న్నులఁ గార్చిచ్చులు కుట్టెనేమొ! నను గొం♦తున్ గోయఁగాఁ బాల్పడెన్! 27

గీ॥ మరణ శిక్షను బొందిన ♦ నరున కెపుడు
గడువు జ్ఞప్తిరాఁ బెద దడ ♦ యడరునట్లు
భానువారము మృత్యుదే♦వత విధమున
నెదుగునని ప్రాణ మిపుడె పై♦కెగసిపోవు! 28

చ॥ శివశివ! యెంతపాతకముఁ ♦ జేసితి నో కద పూర్వ జన్మమం!
దవిరళ సద్గుణోన్నతు మ♦హాభుజు మత్ప్రియు సర్వలోకపూ
జ్యు వెతల ముంచుచున్ గనుల ♦ చూపులకున్ మఱి నోట మాటకున్
దెవులు పడంగఁజేసి వెతఁ ♦ దెచ్చితి! నాకును జాలి యున్నదే! 29

చ॥ కడపటి మాటు నా ప్రియుని ♦ గన్గొని కన్నుల నీటఁ బాదముల్
గడుగుచు నాస్థితిన్ దెలుపఁ♦గా గమకించితి! నాతఁ డేవరం
బడుగునొ! 'నీదు తండ్రి విడ♦నాడుచు వెంబడి ర'మ్మటన్న నే
నుడివెడిదేమి! దీనికిని ♦ నూల్కొనకున్నఁ గడున్ దపింపఁడే! 30

గీ॥ అకట! యెంత మాటాడితి! ♦ నలఘుశీలుఁ
డతుల నీతిజ్ఞుఁ! డెప్పుడే ♦ ననుచితంబుఁ
ద్రికరణముల నెఱుంగని ♦ దేవమూర్తి!
దైవమా! యాతఁ డొక తప్పు♦దారిఁ జనునె! 31

క॥ వనజదళమునకు జల మం
టునె? యగ్గికిఁ జెదలు సోకె♦డునె! నలినీరం
జనునకు సడి గలుగునె! పా
వనమూర్తి యతండు! తప్పు♦వడి పొరవడితిన్! 32

ఉ॥ దాటక తండ్రిమాటఁ దలఁ♦దాల్చి విధేయత నూపనేని-నే
నేటి కుమారి! నింకఁ బ్రియు♦నిట్లు నిరాశఁ దపింపఁజేసి న
ట్టేటనుఁ ద్రోయ నాహృదయ ♦ మించుకయున్ గొఱగాదు! దైవమా
యేటి విపత్తు! దీనిఁ దరి♦యింప నుపాయ మొకండు గల్గునే! 33

గీ॥ పితరునాజ్ఞఁ జెల్లింతు నా- ♦ ప్రియుఁడు క్రుంగుఁ!
బ్రియుని మన్నింతు నా-తండ్రి ♦ వెతల బ్రుంగు!
నొకరి ననుసరించిన నొక్కఁ ♦ డుడికిపోవు!
వెనుక నూయి-ముందఱ గోయి ♦ యనుట యయ్యె! 34

గీ॥ నిష్కలుషవర్తనంబు న ♦ నింద్యమైన
వలపు గల ప్రాణులకు జీవ♦ములు త్యజించు
టన-నుగాదిపండుగయట్లు ♦ హర్ష మొసఁగుఁ!
జావునకు జంకు టొక ధైర్య ♦ సరణి గాదు! 35

మ॥ నను గన్నట్టి క్షణంబునుండియును బ్రా♦ణంబట్లు ప్రేమించు నా
జనకున్ మోసముచేసి లోకమున నా♦చంద్రార్క దుష్కీర్తిమై
వనటన్ గ్రుంగఁగఁజాల! దుచ్ఛమగు జీ♦వం బెంత! కౌక్షేయకం
బుననో-త్రాటనో-నీటనో-విషమునన్ ♦ బొందన్ శుభం బయ్యెడిన్!" 36

మ॥ నలినీరంజనుపైని యా ప్రణయబం♦ధం బొక్క తట్టీడ్వఁగా
బలితంబై తనతండ్రి పక్షమునఁ దీ♦ర్పన్ బోలు సద్ధర్మ రీ
తులు వేఱొక్కెడ కీడ్వ వార్ధిజలమం♦దున్ గాలికిన్ జిక్క నా
కలమున్ బోలె లతాంగిమానసము చీ♦కాకొందె వేభంగులన్! 37

"వర్షారంభము"

మ॥ శనివారం బుదయించె! నంత నభ మా♦చ్ఛాదించి మేఘంబు బో
రన వర్షింపఁగ సాఁగె! నప్డు 'శనివా♦రంపుం జడుల్ నిల్వఁబో'
వను లోకోక్తి నెదన్ దలంచి నరసిం♦హాధీశుఁడున్ జింత నొం
దెను! గంభీరవిభుండు ధైర్యమును బో♦ధించెన్ హితం బేర్పడన్! 38

క॥ చిటిపొటి చినుకులు-పదపడి
తటతట పెనుగాలితోడు♦తన్ ముసరి జడుల్-
కిటకిటలు వడుచుఁ గడు మి
క్కుట మౌచుఁ దుపాను రేఁగు ♦ కొనె నవ్వేళన్! 39

క॥ జలరాసు లన్ని చేరిచి
తలక్రిందుగ వ్రేల్చినట్లు ♦ దళముకొని మహా
ప్రళయ మరుదెంచె నన వా
నలు పోటుగఁ గురియసాగె ♦ నభ మవిసె ననన్ ! 40

క॥ "అతివాది మోహనుఁ డభీ
ప్సిత మలరఁగ సంజ కిటుకుఁ ♦ జేడనొ! యెందే
వితవిత మాటల దడయునొ!
వెతకుచుఁ బోవలెనొ! యేది ♦ వెఱవో నాకున్ ! 41

గీ॥ ఈయ కీయక పరమేశుఁ ♦ డిచ్చె నొక్క
పుత్రి! నామె పెండిలి చేసి ♦ మురియుదు నన-
నాదు దురదృష్టవశమున ♦ నాకు దొరకె
గుండగొయ్యల మొదలిటి ♦ గొంటుకాఁడు!" 42

క॥ అని సాయంకాలమువఱ
కును మోహనుగూర్చి తలఁచు ♦ కొనుచు నృసింహా
వనిపతి యమృతపురము దెస
కును బలుమఱు తనదు చూడ్కిఁ ♦ గొలుపుచుఁ గడపెన్ ! 43

గీ॥ కుడిచి యందఱు పవళించి ♦ కూర్కఁ దొడఁగి
రా నృసింహరాయఁడు మాత్ర ♦ మమరపురము
కడలఁ గనుపెట్టి కనుపెట్టి ♦ కనులు వాచి
కుక్కి నెక్కె! నప్పుడె తొలి♦కోడి కూసె! 44

గీ॥ డిగ్గన క్షణంబు నిద్రప♦ట్టినదొ లేదొ-
తూర్పు తెలతెలవాఱు కం♦దువలు గాంచి,
యుదయమె ముహూర్తమని జ్ఞప్తి ♦ యొదవి యతఁడు
నిమిషమున లేచి మేడ క్రిం♦దికినిఁ జేరె! 45

గీ॥ బయటికిని వచ్చు! నంతలో ♦ వంటయింటి
దెసకు వడివడిఁ జను! దిక్కు ♦ దెలియకున్న -
మఱల బయటికి వచ్చు! నీ ♦ కరణి నాతఁ
డాసుక్రోవి మాడ్కిని దిరు ♦ గాఁడుచుండె? 46

గీ॥ "చక్రములె గాదు! శకటంబు ♦ శకటమెల్ల
నడుసులో దిగఁబడి మున్గె ♦ నయ్యొ! యిపుడు

పైకిఁ దీయంగవలె'' నంచుఁ ♦ బ్రార్థనమును
బంపె! మోహనసింహుండు ♦ బంటు వెంట! 47

క॥ చేరువ నివసించెడు పని
వారలఁ దోడ్కొని నృసింహ ♦ వసుధావరుఁడున్
జేరఁగఁ జనె! మోహనుఁ గొని
తేర హుటాహుటుని మనసు ♦ తీవ్రతతోడన్! 48

క॥ ఎనిమిది గంటల ప్రొద్దున
కును నడుసుననుండి దాటు♦కొని నరసింహా
వని పతియు మోహనుం డె
క్కిన గుఱ్ఱపుబండి కోట ♦ క్రేవకు వచ్చెన్! 49

"మోహనుఁడు దుర్గమునకు వచ్చుట"

సీ॥ శైలాగ్ర నిస్సర♦జ్జలపాతము విధానఁ
దలనుండి జలము ధా♦ర లయి దూఁక!
గంగెద్దుమూఁపుపైఁ ♦ గదియు గుడ్డలభాతి
దడిగుడ్డలెల్ల మో♦దలుగ నుండ!
నడుమునఁ బొరలు (శ్రీ)♦హరి తృతీయావతా
రముమాడ్కి మేనఁ గ♦ర్దమము నిండఁ!
జలికి నీదరకు మి♦క్కిలి బిగిసిన మోము
పసివాని కడు నల♦సటను దెలుపఁ!

గీ॥ దోయమున మూఁతపడిన క♦న్దోయి తోడ
వాన నాని క్రుళ్లిన చెత్త ♦ వామి కరణి-
నరిది వానకు మోహనుం ♦ డసు రసురయి
బండి దిగజారి క్రింద ని♦ల్వఁబడె నపుడు! 50

గీ॥ భృత్యుఁడును బెట్టెలను గొని ♦ యింటఁ జేర్ప
వీరనరసింహరాయఁడు ♦ వెలికి దూఁకి
మోహనుని జేయివట్టి కొం♦పోయి మధ్య.
రంగమున నాసనంబుఁ జే♦రంగ విడిచె! 51

క॥ కనులు పులపొడుచుకొని వం
దన మిడు మోహనుని ఫిల్లి ♦ దళవాయియు "ని

న్ననె వచ్చెద వని తలంచితి''
మని పొరవడి హెచ్చరించె! ♦ నా మోహనుండున్. 52

ఉ॥ ''అన్నథ మెల్లఁ దాటువడు♦నట్టులు వానలు పేఁగకుండినన్
నిన్ననె వచ్చియుందు! నిది ♦ నిక్కము! నిన్నటి వర్ష ధాటికిన్
సన్నగిలెన్ మనోబలము! ♦ నాకును జెక్కలె యుండియున్న మీ
సన్నిధి వ్రాలియుందు! జన ♦ సత్వములన్ గొజలేదు నీకృపన్! 53

గీ॥ ఇంతదాఁక నృసింహేంద్రు ♦ హితుఁడ నగుదు!
నిప్పు డల్లుఁడ-నప్పటి ♦ కిప్పటికిని
నంతరము లేదె! యూఱక ♦ 'యల్లుఁ' డనినఁ
గోడియును జూరుపై నెక్కి ♦ కొక్కిరించు! 54

గీ॥ పెండ్లి వేయేండ్ల పైరన ♦ వినరె! దాని
తంతు లెన్ని దీర్చినఁ దీఱు♦దల గలుగదు!
మీాటి మాయింటఁ గల కులా♦చార విధులు
వేయి తొంబది పంద్రెండు ♦ వెలయుచుండు! 55

గీ॥ గుజ్జుదేవరఁ బూజించి - ♦ కొలము వేల్పు
ముందుగా గంటలమ్మకు ♦ ముడుపుగట్టి-
పిదపఁ గులదేవతలనెల్లఁ ♦ బేళ్ళఁ బిలిచి
కొలిచి-నిన్నరేయిని బెండ్లి ♦ కొడుక - నైతి! 56

శా॥ గంగా - కాటమరాజులన్ గొలిచి-యం♦కాళమ్మ సేవించి - మా
తంగిన్ మ్రొక్కుచు-సుంకులమ్మ నెదలో ♦ ధ్యానించి - పోలేరు వే
డ్కం గాళ్లంబడి - పోతరాజుఁ గని-మా♦కాత్రేనిఁ బూజించి-మా
గంగానమ్మకు వందనంబు లిడి - మ్రొ♦క్కన్ గంటి మాకెమ్మకున్! 57

క॥ మును ప్రపితామహు లెడి వ
చ్చిన వృద్ధాచార మూని ♦ చెన్నయ దాస
ళ్లను బెట్టుకొంటి! నిది విడి
చినఁ బ్రాణంబునకె ముప్పు ♦ సేయు ననంగన్! 58

గీ॥ భువనమోహన మూర్తులౌ ♦ యువతు లపుడు
గారికల్యాణములు-నల్ల ♦ నేరెడులును-
ధవళములు-సువాలలువాడి ♦ దళముకొనుచు
దృష్టి దోషంబు దొలఁగించి ♦ రెజ్జనీళ్ల! 59

క॥ దేవునకుఁ దుది నమస్కృతి
గావించితి! వైష్ణవులకుఁ ♦ గైంకర్యములన్
సేవించి గోడచాటున
దైవ ప్రశ్నంబుఁ గాంచి ♦ తరలఁగ నుంటిన్! 60

సీ॥ పిల్లి యెదురయ్యె! నొక తేలు♦పిల్ల కఱచె!
ఘూకములు చుట్టు గుండ్రలు ♦ గొలుప సాఁగె!
శివలు వాపోయె! నెదురయ్యెఁ ♦ జెవులపోఁతు!
కుండ పగిలెను! నెత్తిపైఁ ♦ దొండ పడియె! 61

క॥ పడమటిదెస వంటిలు క
ప్పడ మెపుడో సుంత మె♦త్తపడి యుండి, జడిన్
దడిసి కడు నాని యది పద
పడి మధ్యాహ్నంబు కూలి ♦ పడె నాతలపై! 62

క॥ పసు లింటిపాక పసపెడి
వసుధాస్థలిఁ గూలె! నదియుఁ ♦ బడి - ముదిసిన యా
వసువులకుఁ బాసె! నీ వె
త్తి సహింపఁగ రానిదై ధృ♦తిన్ దొలఁగించెన్! 63

క॥ ఇక్కరణి శకునములు గని
చక్కఁగ బడసాలదాఁటి ♦ చనుదెంచెడిచో
నొక్కెడఁ గడప దాటఁగఁ
ద్రొక్కుడుఁ గజ్జయును సోఁకి ♦ తొట్రిలి పడితిన్! 64

గీ॥ మరలు పెండ్లికిఁ బిల్ల స♦ద్మంబుఁ జేర
వచ్చునప్పటి కుపయోగ ♦ పడవలె నని
యెంచుకట్టెలు వాసంబు ♦ లింకఁ ద్రాళ్లు
పెద్ద ప్రోవుగ నింటఁ జే♦ర్పించినాఁడ! 65

క॥ కావలయు వస్తువులు మీ
రేవియు నిట వెదకు శ్రమ ర♦హింపక యుండన్
నే వెదకి తెచ్చినాఁడ! ని
దే వీక్షింపుండు వచ్చి ♦ యిచ్చట" ననుచున్! 66

క॥ "ఇవి క్షేమతండులంబులు!
నివి ప్రమిదలు! నిదియు ముంత! ♦ యివి మూఁకుడు! లి

య్యావి నూఱుపోఁగు కండియు !
లివి పిడత లనన్ - న్నృసింహ ♦ ప్రకృతీశంకరా ! 67

క॥ "నిను స్నాతుఁజేసి మిగిలిన
పనులకుఁ బోవలయు ! లేచి ♦ పద" యన సమో
హానుఁడు మొగ మింత యగుచును
దనదు నుపన్యాస మిట్లు ♦ దళకొనఁ జేసెన్ ! 68

ఉ॥ "వానలు పెల్లురేగి-పగ ♦ పట్టిన యట్టులు చుట్టుముట్టఁగా
నైన ఘటాభిషేకము ధ♦రాధిప ! చాలదె ! వెండి యిప్పుడున్
స్నానముచేయు టెందులకు ! ♦ నాపయిఁ గప్పుము క్రొత్తవస్త్ర ! న
ద్దాని ధరించి కూలఁబడె♦దన్ ! బని నీవు ముగింపు నాపయిన్ ! 69

క॥ నీ విటఁ గన్యాదానముఁ
గావించుట - కన్య నేను ♦ గ్రహియించుట - ము
ఖ్యావసర ! మంతె ! స్నానా
ద్యావాహనముల నొనర్ప ♦ నగునే నాకున్ !" 70

క॥ అని యెన్నో విధముల వద
రిన నరసింహాధిపతియుఁ ♦ బ్రియమగు భంగిన్
దనమాట వినిచి స్నానముఁ
బొనరింపఁగఁ జేసి తెచ్చి ♦ ముంగిట నిలిపెన్ ! 71

సీ॥ తొలినాఁడు చాకింటఁ ♦ జలువచేసిన దొడ్డ
జలతారు జిలుఁగు దు♦వ్వలువఁ దాల్చి !
బొగడలు దీటిన ♦ మొకమాలుపై సన్న
కటిల బూర్నీసు చొ♦క్కాయఁ దొడిగి !
తలచుట్టు పెక్కు-సా♦రులు చుట్టివచ్చి వం
కర లెత్తు పట్టు పా♦గా ధరించి !
గుబురులై సరిగంచు ♦ కుచ్చులు చుట్టును
వ్రేలు గనీబు టో♦పీని బెట్టి !

గీ॥ బుడుసు పట్టించు పంచెలు ♦ మూఁడు నాల్గు
భుజయుగము చుట్టి మెడపైన ♦ ముడులు వెట్టి
కరము సింగార మొలికెడి ♦ గంగిరెద్దు
పగిది మోహనసింగు చూ♦పట్టె నపుడు ! 72

ఉ॥ అప్రతిమాన పావన స్వ♦దంతరుఁడున్ బలుశాస్త్రవేదియా
విప్రుఁడు బ్రహ్మవర్చస ప♦విత్రుఁడు పావకకుండమట్లు స్వ
చ్ఛప్రభ నెల్లువాఁడు శుభ♦సాత్త్విక విగ్రహుఁ డేగుదెంచి శ్రో
త్రప్రియమున్ బొనర్చె సము♦దాత్త మనోహర వేదవాక్తతిన్! 73

ఉ॥ అందఱుఁ గూడి మేడపయి ♦ కప్పుడు పోయిరి! ఢిల్లిసైన్యసం
క్రందనుఁడున్ గవాక్షము స♦రంగట నిల్చుచుఁ ద్రోవవైపు చూ
పందఁగ నిల్చి సేవకుని ♦ యాగమనంబును గోరుచుండె! వాఁ
డెంతను దోఁపకున్న మది ♦ నెంతయుఁ జింత వహించి వందురెన్! 74

"గంభీరసింహుని విచారము"

మ॥ "నడుమన్ సంద్రము లక్షవచ్చినను - బై♦నన్ గొండలున్ వ్రాలినన్ -
దడవున్ సేయక కార్యముల్ నడపు శ్రే♦ష్ఠావంతుఁడై యుండి యి
క్కడి కీవేళకు రాకపోయెనని కం♦గారయ్యె స్వాంతంబు! నె
క్కుడుగాఁ బ్రొద్దును సాఁగెఁ! గారణము నా♦కున్ దోఁప దావంతయున్! 75

చ॥ తొడిబడ కాదివారమునఁ ♦ దూరపుఁగొండల నెక్కఁబాటి సూ
ర్యుఁ డుదయ మొందు వేళకు జ♦వోన్నతిఁ బృథ్వినృపాలులేఖ నా
కిడునటు రమ్మటంచు వచి ♦ యించితిఁ! బ్రాణముతోడ నుండినన్
దడయఁడు! సుంతయేనియును ♦ నావచనంబును దాఁటఁ డెన్నఁడున్! 76

చ॥ మురహరి దేవసైన్యచయ♦ముల్ గొని యుద్ధము వచ్చెనేని నా
నరహరి నిల్వలేఁ డెపుడు! ♦ న న్నెడఁబాసి క్షణార్థమేనిఁ దా
నరిగెడు వాఁడుగాఁ! డిచట! ♦ నక్కట! కార్యము మించనుండె! నా
నరహరి వానలన్ మునిఁగి ♦ నట్టడవిన్ గడగండ్ల స్రుక్కెనో! 77

సీ॥ పనిఁ జూచుకొని వెన్క♦కును బోకయిటుఁ బెండ్లి
పనులలో నేఁ దగు♦లొక్కనఁగనేల!
మగువ యడుగకున్న ♦ మానసం బుబ్బి బ్ర
హ్మాండబాండంబు వ్ర♦య్యలుగఁ జేసి
మోహనుతోఁ బెండ్లి ♦ బూదిఁగల్పెదు! నలి
నీరంజనుని గూర్తు ♦ నిక్క "మనుచుఁ
జెప్పి తప్పుట యెట్లు! ♦ శ్రీహరీ! యిఱువది
యేండ్లయీడున ధాత్రి ♦ నింత పేరు

గీ॥ వడసి యాడినమాటఁ దీ♦ర్పంగలేక
తలను దాపంగ బెత్తెడు ♦ తావులేక
కుందవలసెనె కటకటా! ♦ క్షోణి నెల్ల
బెండువడఁ జేయు - ధీర గం♦భీర విభుఁడు! 78

సీ॥ సమయంబునకు మహా ♦ సార్వభౌముని శుభా
శీఃపత్ర మిచటికిఁ ♦ జేరకున్నఁ -
బుష్పావతియుఁ బ్రాణ♦ములు వీడుట నిజంబు!
నరసింహరాయఁ డం♦తంబు గాంచు!
ధనమునకును దోడు ♦ తరుణిపోవుట-గుండె
యవిసి మోహనసింహుఁ ♦ డవనిఁ ద్రెళ్లు!
వడి నలినీరంజ♦నుఁడు విఫలాశుఁడై
హృదయంబు వ్రీలి యు♦య్యాలను వ్రాలు!

గీ॥ నరహరీ! నీ యొకనిపైన ♦ నా మహాశ
లన్ని కేంద్రీకరించి నేఁ ♦ డలముకొనియె!
నీవు వచ్చిన జయమగు! ♦ నెలఁత నిలుచు!
నే నిలుతుఁ! దక్కువారును ♦ నిలువఁగలరు!" 79

"మోహనుఁడు నరసింహరాయునిఁ దొందరించుట"

మ॥ అని సైన్యేంద్రుఁడు భృత్యుఁగూర్చి కడుఁ జిం♦తాయత్తుఁడై నిల్చె! మో
హనుఁ "డో వీరనృసింహరాయ! యిట జా♦గయ్యెన్ జుమీ! నీవు పు
త్రిని రావించి ముహూర్తమున్ నడుప సం♦దేహింపఁగా నేల! ర
మ్మనుమీ! మూర్తముఁ దీర్చి యింటికిని సా♦యంకాల మేఁ బోవలెన్! 80

క॥ ఇక్కడ రాతిరి నిలిచిన
నెక్కడి వస్తువుల నచట♦నే తస్కరులున్
డక్కరులు దోఁచుకొందురు!
నిక్కము! నాకొంప మునుఁగు ♦ నేఁ బో కున్నన్! 81

క॥ అనఁగా వీరనృసింహా
వనిపతి గంభీరసింహు ♦ వదనముఁ గని "మీ
రును వచ్చి యిందుఁ గూర్చుం
డిన జరుగఁగ వలయు పనుల ♦ నే జరిపింతున్!" 82

మ॥ అన-గంభీరవిభుండు పీఠమును డా♦యన్ వచ్చి కూర్చుండి "మో
హన! నీ విం దరుదెంచినందులకు నే ♦ హర్షింపఁగాఁ గంటి! నిం
క నిమేషంబునుగూడ జాగు సలుపం♦గాఁ గోర్కెయున్ గల్గ! దై
వను కొప్పందములెల్ల మీఱ నసుమ సాం♦తంబయ్యెనే యియ్యెడన్! 83

మ॥ ఇరవొందన్ మును మీరు లిర్వురును నే ♦ యేర్పాటులన్ జేసికొం
టిరో! యా పూర్వనిబంధనంబులను బా♦టిన్ సేయఁగా ధర్మ! మి
ద్వారు భాషించియు నీయకొన్నఁ బొరలున్ ♦ బొచ్చెమ్ములున్ లేశమున్
వజలన్ బోక పనుల్ సమస్తము రహిం♦పన్ గల్గు సౌఖ్యోన్నతిన్!" 84

మ॥ అని వాక్రుచ్చిన మోహనుండు నగి "వీ♦రాగ్రేసరా! యీతఁడున్
తనజా పుత్రిక నా కొసంగి వడి ను♦ద్వాహంబుఁ జేయించు చొ
ప్పును నా కాయన యీయఁగావలయు న♦ప్పున్ నేను మన్నించుచొ
ప్పును నేర్పాటొనరించుకొంటిమి! లవం♦బున్ రావు పో భేదముల్. 85

క॥ గొప్పగ నినుఁ గైకొంటిమి!
యిప్పుడు సకలమ్ము నిర్వ♦హింపుము! నాపైఁ
దప్పులు గుప్పకు! మిరువుర
మిప్పను లొనరింపఁ జేసి ♦ యేలుము కృపతో!" 86

మ॥ అన - గంభీరవిభుండు వీరనరసిం♦హాధీశు నెమ్మోముఁ గ
న్గొనె - నాతం "డిది యంతయున్ నిజము! నా♦కున్ సమ్మతం బౌను! నీ
పనులెల్లన్ సమకూర్చి సాయమొనరిం♦పన్ నిన్నుఁ బ్రార్థింతు" నం
చన గంభీరవిభుండు మోహనుని ది♦క్కై మేఘగంభీరతన్, 87

ఉ॥ "ఈ నరసింహరాయ ధర♦ణీశ్వరుఁ డాడినమాట తప్పఁగాఁ
బూనఁడు! నీవు నట్టిఁడవె♦పో! యిపుడే సుముహూర్తవేళ దా
పైనది! పెండ్లి ముందొ! మఱి ♦ యప్పుల చర్చయె ముందొ! యేది వీ
లైనను దాని దీర్చి వడి ♦ నవ్వలి కార్యముఁ దీర్ప మేలగున్! 88

క॥ ఇరువురలో ముందున కె
వ్వరు వత్తురొ చూడవలయు! ♦ వారల నేనున్
గర మభినందించెద" నన
మురియుచు మోహనుఁడు "నేనె ♦ ముందుకు వత్తున్!" 89

క॥ అని మాటవెంట ముందున
కును జరుగఁగ-సైన్యవిభుఁడు ♦ కూడఁగ నిను ర

మ్మన! నిటఁ గార్యాచరణం
బును గూరిచి యంటి'' ననిన - ♦ మోహనుఁడు వడిన్! 90

## "ఋణపరిష్కారము"

ఉ॥ ఉదయమునఁ దనసేవకుం ♦ దొడిసి తెచ్చి
మేడ నొకమూల నుంచిన ♦ మిసిమి పెట్టె
వేగఁ గొనివచ్చి తనచెంతఁ ♦ బెట్టుకొనుచు-
బీగమును దీసి పత్రముల్ ♦ వెలికిఁదిసి- 91

క॥ "ఒక్కొకపత్రము విప్పుచు
నక్కడి వివరము పఠింతు! ♦ న ప్పెంతగునో
చక్కఁగ లెక్కించుచు మీా
రిక్కాగితములను జేతి ♦ కిం డాయనకున్!" 92

క॥ అల పత్రములకు నూటికి
నెల కొక రూప్యంబుకొలఁది ♦ నికరపు వృద్ధిన్
గలుపఁగ వలయును! దేవర
తెలిపెడు తీర్పునకు నమ్మ ♦ తించెద'' ననినన్! 93

చ॥ 'సరి' యనె గంభీర చమూ
వరుఁడును! నరసింహారావు ♦ 'బా' గనియెను! న
త్తతి నొక్కొక పత్రముఁ గొని
పఠువడి మోహనుఁడు చూచి ♦ పలుకన్ దొడఁగెన్! 94

క॥ "ఇది క్రోధియందుఁ దొలి న
ర్వదివేలకుఁ బుట్టె! రెండు ♦ పదు లేండ్లయ్యెన్
గద! యసలు వడ్డి గలుపుం!
డిదె కొనుఁ'' డని పత్ర మతని ♦ కిచ్చెన్ వడిగన్! 95

గీ॥ "వృద్ధియును మూలమును జేరి ♦ రెండులక్ష
లవల నాలుగువేలగు'' ♦ నంచు లెక్క-
చెప్పి పత్రమ్ము రాయని ♦ చేతి కిచ్చె
'మీారు తిలకింపు''ఁ డనుచు గం ♦ భీరవిభుఁడు! 96

సీ॥ "ఇది సౌమ్యయం దఱు ♦ వదివేలకును బుట్టె!
నబ్దముల్ పదియునై ♦ దయ్యె'' ననినఁ

"బదియునై దేండ్లకు ♦ వడ్డితో-లక్ష య
ర్వదియు నెన్మిది వేల - ♦ కేదిగ" ననియె!
"నిది పరీక్షావి ని ♦ ర్వదివేలకును బుట్టె!
ద్వాదశ వర్షముల్ ♦ దాఁటు" నవినఁ-
"బదియు రెండేండ్లకు ♦ వడ్డితో నల్వదె
న్మిదివేలు వంద లె ♦ న్మిది యగు"ననెఁ!

గీ॥ "బ్రబలె నానంద లక్ష కీ ♦ పత్రము! పది
యేండ్ల" దని యీయ 'మూలము ♦ వృద్ధిఁ గలిసి
రెండులక్ష లర్వదివేలు ♦ నిండె! నింక
మొత్తములు గూడుదునె" యన - ♦ మోహనుండు, 97

క॥ "మఱచితి! రీవా రాజ్యం
బిరవొందిన క్రోధిఁ బుట్టె! ♦ నిది యిర్వది వ
త్సరము లగు! "మూఁడు లక్షలు
నరసింహాధిపున కిచ్చె ♦ నాతండ్రి" యనన్- 98

క॥ "ఇది పదిలక్షలపై ని
ర్వది వేలగు" ననిన - నతఁడు ♦ వడిఁ 'గూడుఁ' డనన్
'బదునాఱు లక్షలును నఱు
వదివేలును బయి నెనిమిది ♦ వంద లగు" ననెన్! 99

క॥ "పదునాఱులక్ష లన - నా
మొద యలరెడి! వే లఱువది ♦ యెనిమిది నూఱుల్
వదలుఁ! డివి యన్ని దీఱఁగఁ
జిదురులుగాఁ బత్రములను ♦ జింపుఁడు మీరల్! 100

మ॥ మఱి నాపాలికిఁ దీర్ఘఁగావలయు ధ ♦ ర్మంబే నన్మొప్పించితిర్!
నరసింహేంద్రుఁడుఁగూడఁ బెండిలికి స ♦ న్నాహంబుఁ గావించె! ని
త్తఱి నుద్వాహముఁ దీర్ఘ-నిద్వర ముదా ♦ త్త శ్రేయముల్ బొందఁగా
నరుదే! పిల్లను దెచ్చి నా కిడి వివా ♦ హంబుల్ నివర్తింపుఁడీ! 101

"మోహనుఁడు తెచ్చిన భూషణములు"

చ॥ అల పదునాఱు లక్ష లిపు ♦ డాయన కిచ్చుట లేదు! వృద్ధియుల్
గలిసెను! మూల్య మల్పమగుఁ! ♦ గాని వధూటి నలంకరింపఁ గ
న్నులు మిఱుమిట్లు గొల్పెడు మ ♦ ణుల్ గల స్వర్ణవిభూషంబు లం
కిలిపడ నేల! వచ్చి తిల ♦ కింపుఁడు! తెచ్చితి! మీకుఁ జూపెదన్! 102

క॥ బాలామణి పుష్పావతి
రోలంబాలకలలో - శి ♦ రోభూషణమై
వ్రాలుటను-శిరోరత్నము
పోలు ననుచుఁ దెచ్చితిని ప్ర ♦ బుద్ధుఁడ నగుటన్! 103

చ॥ ఇదియును వాలపాశ్యమగు! ♦ నియ్యది మంజుల కర్ణికాద్వయం!
బిడి గళభూష! పేరు లివి! ♦ యియ్యదియున్ శతయష్టికావరం!
బిదియును గోస్తనంబు! మఱి ♦ లెక్కన పక్ష్మ మహాంగుళీయకం!
బిది యది యన్నిచేరి పదు ♦ నేడగు లక్షలు మూల్యమున్ దినార్! 104

క॥ మొలనూలిది! వేయి సరం
బులు గల మేఖల యటంద్రు! ♦ పులుగడిగిన ని
స్తుల వజ్రము లివి! పది ల
క్షల విలువకుఁ గొంటి! దీనిఁ ♦ గాశీపురిలో! 105

క॥ చిఱుగజ్జెలు రవళించెడు
బిరుద తులాకోటి! దీనిఁ ♦ బింగళపురిలో
నఱువది వేలకుఁ గొంటిని!
గరుమరుదై యుండుఁ! దొరకఁ ♦ గాఁ బో దెచటన్! 106

క॥ మృగరాజు రోమములతో
సొగసగు రాంకవము! దీని ♦ షోడశపురిలో
మిగుల వెల యిచ్చి కొంటిని!
మగువల కిది కూర్చి మిగుల ♦ మక్కువ దీర్చున్! 107

క॥ దీనిని రాకేఁడి యందురు!
పునహాపురి గుహల నొక్క ♦ మునికడ దొరికెన్!
వానినిఁ బదేండ్లు కొలిచితి
దీని కొఱకు! విలువ లక్ష ♦ దీనారంబుల్! 108

సీ॥ గళసూత్రము బిగించు ♦ కాలంబునకు వధూ
వరుల కడ్డంబుగాఁ ♦ బట్టుకొనఁగఁ
దెరచీర నిచటి కేఁ ♦ దెచ్చితి! నిదియు ఢ
క్కా పురంబున వణి ♦ గ్వరులు కాన్క
పంపిరి! వెల యిచ్చి ♦ పడయలే రెవ్వరు!
వేయి వేలకును ల ♦ భింపఁబోదు!

నలుగులు చందనం ♦ బులు వేయఁగా సుగం
ధ ద్రవ్యములు తెచ్చి ♦ దాఁచినాఁడఁ!

గీ॥ జందనాగరువులు ఘన ♦ సారములును
మృగమదంబు ధూపంబు కా ♦ శ్మీరజన్మ
మీ సమస్త వస్తులు పెద్ద ♦ రాసులగుచు
వెలఁదిఁ బుష్పావతిని జేరఁ ♦ బిలుచుచుండు! 109

క॥ తలగడలు - మంచములు - శ
య్యాలు - దువ్వెన - లద్దములును - ♦ వ్యజనంబులు - కొ
ల్లలు! నరసింహేంద్రున కివి
తెలిసిన మర్మములె! వెండి ♦ తెలుపఁగ నేలా! 110

క॥ కదలించుకోలఁది వాఁగుట
యది వాడుక నాకు! దీని ♦ నాపెద! మీరల్
సుదతిఁ గొనివచ్చి నా కిపు
డదికింపుఁడు! ప్రొద్దు వోయె! ♦ నాఁకలి యయ్యెన్!" 111

చ॥ అన - నరసింహభూరమణుఁ ♦ డచ్చట నిల్చిన బోనకత్తెతో
"వినుము! ముహూర్తమున్ దరిసె! ♦ వేగఁ గుమారిని దోడితెమ్ము! జా
గొనరుపఁబోకు" మం చనఁ డ ♦ లోదరి క్రిందిగి డిగ్గిపోయి రా
ట్తనయ కడంత మయ్యెడ య ♦ థావిధి విన్నపమున్ బొనర్చినన్! 112

"పుష్పావతి మేడకు వచ్చుట"

సీ॥ మనసును గోయు వే ♦ దన గ్రుక్కియు - మఱింత
ముడుపు గుల్కెడు ముద్దు ♦ మోముతోడఁ!
జవికి తద్దయుఁ గృశిం ♦ చియును వినూత్న వి
లాసంబుఁ గను తనూ ♦ లతికతోడ!
నరుణ రేఖా మనో ♦ హారములై సహజ భా
గ్య మనోజ్ఞ దీర్ఘనే ♦ త్రములతోడ!
నిద్దంపు నునుఁజెక్కు ♦ టద్దాల-వజ్రాల
జిగి గుల్కు తాటంక ♦ యుగళితోడ!
గీ॥ మినుకు మినుకను లేఁగాను ♦ మెఱుఁగుతోడ!
దళుకు దళుకను చెక్కుటి ♦ ద్దములతోడఁ!
గనకనలు గొల్పు వ్రేలి యుం ♦ గరముతోడ!
మెలఁత పుష్పావతీదేవి ♦ మేడ యెక్కె! 113

క॥ దడదడమని యెద యదరఁగఁ
గడగడ నడుగులు వడంకఁ ♦ గా - నొడలు కరుగ్
జడుపునఁ జెమ్మటఁ దడియఁగఁ
దడఁబడుచును దండ్రి పిలువఁ ♦ దనయయు వచ్చెన్! 114

గీ॥ రెండు రాత్రులు కంటిపై ♦ రెప్ప వడక
తలఁగుకొనిపోవు మృదుల చి ♦ త్తమ్ము తోడ
వగలఁ బొగులుచు నిట్టూర్పు ♦ సెగల నొగిలి
తరుణి వాడుపాఱిన పూవు ♦ కరణి నుండె! 115

క॥ "కమ్మని నా బంగారపు
టమ్మాయీ! రమ్మ! పాట ♦ కాసనమును జే
కొమ్మా! మాయమ్మా! ని
న్నెమ్మెయి సేవించి తృప్తి ♦ నేఁ గాంతునొకో!" 116

క॥ అని గంభీర చమూవరుఁ
డనఁ బుష్పావతియు "నాయ ♦ నా! తపనీయా
సనమేల! గవాక్షము నో
రను గూర్చుండెదను! దొండ ♦ రను జెందకుమీ!" 117

మ॥ అని మోహామణియుగ్ గవాక్షమును డా ♦ యన్ బోయి కూర్చుండె! మో
హనుఁ "డో వీరనృసింహరాయ నృపతీ! ♦ యాలస్యమున్ జేయఁగాఁ
జనునే! పిల్లయు వచ్చె! నన్నిపనులున్ ♦ సంసిద్ధమై యుండె! నిం
క నిమేషంబును జాగులేక నడుపం ♦ గాఁ బూను కార్యంబులన్!" 118

" మోహాను నుపన్యాసము "

క॥ అని లేచి నిలుచుకొని మో
హనసింహుఁడు మోమునెత్తి ♦ యటు నిటు గని చెం
తను గల విప్రుని డాయఁగఁ
జని యాతని హెచ్చరించి ♦ సంభ్రమ మతిమై! 119

క॥ "ఏవయ్యా! పెదబాపఁడ!
పూవులు రావాకులు కుశ ♦ ముల్ దెచ్చితివే!
నీవు కొనిరాక యుండిన
నేవి యిచట నుంప వలెనొ ♦ యెవరికిఁ దెలియున్!" 120

చ॥ అమరపురంబునందు జగ ♦ మంతయు నబ్రము నొంద దేశదే
శములను గల్గు నంచి క్షితి ♦ జమ్ములఁ దెచ్చియుఁ బెంచినాఁడ! సొం
పు మిగుల కోయిలల్ మొగలి ♦ పూపొద లెన్నియొ యుండుఁ! గేతకీ
సుమములు నూఱు మూర లగు ♦ చున్ నిరుపై చెలువారుచుండెడిన్! 121

ఉ॥ అమ్మహనీయ పట్టణము ♦ నందున వృష్టి సుధామయంబు! మా
నమ్మున కొక్కమాఱు పడు! ♦ సర్వ నదమ్ములు - కూపముల్ - తటా
కమ్ములు - నిండియుండుఁ! బొలు ♦ కాడునఁ జిక్కులు పెద్ద గండశై
లమ్ముల యంత లావునఁ బె ♦ లంగును జూపఱ వింత నొందఁగన్! 122

క॥ పూవులు వృక్షంబులె కా!
వే వస్తువు లమరపురిని ♦ నెంతయుఁ బ్రత్యే
కావిర్భావముఁ గన నివి
దైవారవు! నగరమహిమ ♦ దైవ మెఱుంగున్! 123

క॥ పులులకు మీసలు - సింహం
బులకును జూ - లొంటియలకు ♦ మూపురములు - న
క్కలకును దోఁకలు - వారణ
ములకును దొండములు లేక ♦ బోడిగ నుండున్! 124

క॥ మాయూరి యువతులును రా
మాయణమునకన్న ముందె ♦ మహిఁ బుట్టెను! ద
త్కాయములఁ దక్కు నుసుతల
చాయను జాఱలును ♦ లేవు ♦ సందియ మేలా! 125

శా॥ గోవిందుండును పూర్వ మెత్తిన మహా ♦ కూర్మావతారంబు లం
తై విప్పారుచు - నిన్నబాణలుల చా ♦ యన్ నల్లనై - తేళు లె
న్నే వర్తించును - నొక్కమాట! యవి శే ♦ లెందుండునో - ప్రాజ్ఞామం
దే వీక్షింతుము! త్రొక్కినన్ గఱువ! వె ♦ ట్లీ చిత్ర మూహింతువో! 126

చ॥ అమరపురంబుచుట్టు ♦ నిబి ♦ డాటవులన్ శతకోటి భద్రనా
గములు జనించె! నెక్కి తిరు ♦ గన్ గొనుచుంటిమి! మొన్న మన్మథా
బ్దమునను గామమందు మిడు ♦ తల్ చెలరేఁగుచు వాని మ్రింగివై
చె! మిగుల దొక్క యేన్గయినఁ! ♦ జెప్పెడిదే మిఁక మా విపత్తులన్! 127

క॥ గొరువంకలు - గొఱియలు - మా
పురి నధికము! మఱచి తప్పి ♦ పొరుగూరులవా

ఱరుదెంచిన గోరువంకలు
కోయిలకు గళము! నోడలు సెడఁగ ♦ గోజీయలు కలచుఁగ! 128

సీ॥ మున్నూఱు వత్సరం ♦ బులకు మున్మునుండి
చీఁకువట్టిన పెద్ద ♦ చేను గలదు!
నెవ్వ రెఱుఁగకుండ ♦ నెన్నికల్పములయ్యె
నో! యొక్క యిలకోడి ♦ యుండు నచట!
'గీ' యను రొదల నీ ♦ క్షితి నింపె! నాశ్రుతిఁ
బడుచులు పాటలు ♦ పాడుకొందు!
రాశ్వయుజాష్టమి ♦ నాపాలగోపాల
మమరపురీ జను ♦ లచటఁ జేరి
గీ॥ యా పుడవుఁ జూడకయె మహా ♦ న్యాసపూర్వ
కముగ లక్ష రుద్రాభిషే ♦ కములు దీక్ష-
బోనములు వెట్టి - కాయ క ♦ ప్పురము లిచ్చి
గొఱ్ఱియలఁ గొట్టి - జాతరల్ ♦ గూర్చుచుంద్రు! 129
గీ॥ అమరపురి చుట్టుపట్టులం ♦ దలమి పాఱు
వాఁగులం దుండునదియెల్లఁ ♦ బసిఁడి యిసుక!
వదనముల రాచిన - మసూచి ♦ వలని మచ్చ
లడఁగు నని వాఁడుచుంద్రు చం ♦ ద్రాస్యలెల్ల! 130

సీ॥ అమరపురము మట్టి ♦ యతి సారవంతమౌ!
నమృతాత్మకం! బవం ♦ ధ్యంబు నిజము!
కుడిచి దొడ్డిని జేయి ♦ గడిగితి! నొందు రెం
డావాలు రాలి చె ♦ ట్లగుచుఁ బెరిగె!
నమ్ముదురో మీరు! ♦ నమ్మరో! మూన్నాళ్ల
కవి కాచి యెండి కా ♦ యలును బగిలె!
గింజ యొక్కొకఁడు వీ ♦ క్షింప - గండశిలా ప్ర
మాణమై బరువు నా ♦ ర్మణుఁగు లుండె!
ఆ॥ నమరపురి జనించు ♦ నావగింజ లటన్నఁ
'బిల్లకొండ' లనుచుఁ ♦ బేరు వచ్చె!
నట్టి నేల జగతి ♦ యం దెచ్చటనుగాని
లేదు! సందియంబు ♦ లేదు నిజము! 131
చ॥ ఎడనెడ బాలుఱెల్లరు ప ♦ దేండ్లకుఁగాని యొకింత లేచియుర్
నడువఁగఁ లేరు! తెల్పెదను ♦ నా కత! పుట్టిన తొమ్మి దేండ్లకుర్

మెడలను నిల్పినాఁడు! మిడి ♦ మేలము! మూఁడగు వందలేండ్ల కె
క్కుడుగ శాకొక్కఁడున్ బ్రబకు! ♦ క్షోణిని గంటిరె యిట్టి చిత్రముల్!''132

క॥ అని - యేవేవియొ యాలో
చనములు మదిఁ దట్టి వెండి ♦ చనుదెంచి నిజా
సనమునఁ గూర్చుండుచు ది
గ్గన నరసింహేశ్వరుని ము ♦ ఖంబును గనుచున్! 133

"మోహనుఁడు నరసింహరాయనితో నిష్ఠురము లాడుట"

గీ॥ ''పత్రములు చించి గడియకుఁ ♦ బైన నయ్యె!
వార్తలే కాని యవ్వలి ♦ పనికిఁ బోవు!
పడఁతి నాకిచ్చి యవతల ♦ నడుగు వెట్టు!
మంతదాఁకను బోవనీ ♦ యను నిజంబు!'' 134

క॥ అనుచును వేగిరపడు మో
హనుఁగూర్చి నృసింహరాయఁ ♦ "డన్నా! యిట మిం
చిన దేమి! పెక్కులేండ్లుగ
నను నెఱుఁగుదు! తెలియలేవె ♦ నాహృదయంబున్! 135

మ॥ ధరణీఖండము సర్వమున్ వడఁకి పా ♦ తాళంబునన్ గ్రుంగుఁగా!
కరవిందాప్తుఁడు పశ్చిమాచలమునం ♦ దావిర్భవం బొందుఁగా!
కరిసంఘంబులు మూఁగి నాగళముఁ దీ ♦ యన్ ఖడ్గమున్ మోపినన్-
దిరుగ న్నేరను మాట! నీవు మది సం ♦ దేహింపఁగా నేటికిన్! 136

క॥ నీయప్పుఁ దీర్పలేమికిఁ
గాయము పుండయ్యె! మాట ♦ గాదని సుత నే
నీయనని కడు గృతఘ్నత
మోయుదునే! యెంతమాట! ♦ మోహనసింహా! 137

క॥ పరికరము లుండె! భూసుర
వరుఁ డుండెను! ఢిల్లిసైన్య ♦ పతి యుండెను! గూ
తురు నుండె! నేను మాటను
బొరలుదునే'' యనుచుఁ దనదు ♦ పుత్రిన్ గనుచున్, 138

క॥ "అమ్మా! నా కుందనపుం
బొమ్మా! యప్పునకు నిన్నుఁ ♦ బోకార్చితి! మా

యమ్మా! యితని గొని నా దుః
ఖమ్మును బాపంగదమ్మ ♦ కడువడి'' ననఁగన్. 139

మ॥ ''జనకా! నీదు కులంబు పావనముగా ♦ జన్మించియున్నట్టి నా
కును సాధ్యంబగురీతి నీకు సుఖమున్ ♦ గూర్పంగ నా ధర్మమై
తనరున్! నిన్నడలించునట్టి ఋణబా ♦ ధల్ దీఱెనే! యిష్టు! తె
ల్పిన, నీ యాజ్ఞ శిరంబునన్ గొనుచుఁ బా ♦ లింపన్ బ్రయత్నించెదన్! 140

క॥ నా కన్యాత్వము దక్కఁగ
నీకొఱకే నోసఁగుదాన ♦ నిఖిలము తండ్రీ!
కై కొను మీ నా ప్రాణము!
నీకన్నఁ బ్రియంబు గాదు ♦ నిజముగ నాకున్!'' 141

క॥ అనుమాట సైన్యనాథుఁడు
విని ''నీ మన సెంత! మృదువు! ♦ విమలము తల్లీ!
నినుఁ గని నృసింహరాయఁడు
తన జన్మము సార్థపఱచెఁ ♦ దథ్యముగఁ జుమీ! 142

క॥ నీవంటి పితృవిధేయులు
క్ష్మావలయమునందుఁ బెక్కు ♦ కల్పంబులకే
నావిర్భవింతురో! లే
దో! వనితామణి! తలంప ♦ దుర్జ్ఞేయమగున్!'' 143

క॥ అనుమాట నందుకొని మో
హనుఁ ''డీపెను బొగడనేల! ♦ యనుఁగు జనకుఁ డ
ప్పును దీర్ప నోసఁగెఁ! గావున-
నను బెండ్లాడుటయు సతికి ♦ న్యాయమగుఁ గదా! 144

చ॥ మన మిటు మాటలన్ దిగిన ♦ మాపటి జా మరుదెంచు! మూ ర్తమున్
జను! నిఁక మాన మూని పని ♦ సాఁగఁగనింపు! మిమున్ భజింతుఁ! బే
ర్మిని బలు పాదపూజ లొన ♦ రించెద! బంగరుకాన్క లిత్తు! నా
పని ముగియింపుఁ డీక్షణము! ♦ పాదములన్ బడి మొ త్తి వేడెదన్!'' 145

చ॥ అని తనమాట సార్థముగ ♦ నచ్చట సాఁగిలి మ్రొక్కుచున్న మో
హను నరసింహ భూరమణుఁ ♦ డంసము లంటుచు లేవ నెత్తి ''మో
హన! యిటు తొందరింపఁ జను♦నా! యిపు డిందఱు మిమ్ము పెండిలిన్
బొనరుపఁగాదె కూడితిమి! ♦ బుద్ధి నొకించుక శాంత మూనుమీ! 146

క॥ నిలిచి పడుండఁగ వశమే!
వలనుగఁ గూర్చుండి పిదపఁ ♦ బండ నగు! నటుల్
దోలి జరుగవలయు కార్యం
బులు జరిగినఁ బెండ్లికార్య♦ము లవల జరగున్! 147

క॥ ఏ జై డామడ లుండఁగఁ
చీరె తడియు ననుచు-విడిచి ♦ శిరమున నిడు నా
నారివలె నిపుడె తొందర
గూరిన-నేమనుచుఁ బలుకఁ ♦ గూడును నిన్నున్!'' 148

క॥ అనుచుండ-సైన్యనాథుఁడు
తనభృత్యుఁడు రాఁడటంచుఁ ♦ దద్దయుఁ జింతన్
మునిఁగి గవాక్షము దరియుచుఁ
గనుచుండెను త్రోవవైపు ♦ కడు నాసక్తిన్! 149

మ॥ సరసీమధ్యమునందుఁ బెక్కులు వలల్ ♦ సారించి పైకెత్తి జా
లరు లం దెయ్యది గాంచిరో! యతితరా♦హ్లాదంబు రేకెత్త న
త్తఱిఁ గోలాహలమున్ బొనర్చ ధ్వని శ్రో♦త్రద్వంద్వమున్ జీల్ప న
బ్బురపుం జూడ్కులు గొల్పి రా జనకుఁడున్ ♦ బుష్పావతీ దేవియున్! 150

క॥ జలమధ్యంబున వైచిన
వలనుండియుఁ బెట్టె నొకఁడు ♦ పైకెత్తుచు బెన్
కలకలముతోడ జాలరు
లలరిరి! మోహనుఁడు మిగుల ♦ నాత్రము తోఁపన్! 151

"మోహనుని యుపన్యాసము"

గీ॥ ''వాన యెగుపోటు-జాలరి♦వారి పోటు-
మీ నిలువుపాటు-నాదగు ♦ మ్రానుపాటు-
పెక్కుపాటులు గూడి-నా♦పెండ్లిపాటు-
కటకటా! నేఁడు పండౌనో ♦ కాయయౌనో! 152

క॥ చనుదెంచి జాము కడచనెఁ!
బనికిని దిగుమనుచు నెంత ♦ ప్రార్థించుచు నా
ల్కను బీఁకుకొనిన సుంతయు
నను వినిపించుకొన వీవు ♦ నరసింహనృపా! 153

క॥ పడఁతిని దూరంబునఁ గనఁ
బడఁజేయుచుఁ గొంటి వప్పు ♦ పత్రమ్ముల! సం
గడి నుండెడు బెల్లంబును
గుడి దేవున కనుచు వరముఁ ♦ గొనిన విధమునన్! 154

ఉ॥ అన్నముపేరు సెప్పినను ♦ నాఁకలి దీఱునె! వైద్యు పేరనన్
దిన్నఁగ రోగముల్ దెగునె! ♦ దీప మనంగనె చిమ్మచీఁకటుల్
బన్నుగఁ బాసిపోవునె! వి♦వాహ మనంగనె భార్య చేరునే!
ఖిన్నుని నన్నుఁబట్టి గిలి♦గించి సుఖింపఁగఁజేయ నెంచితే! 155

ఉ॥ నాయది బాల్యకాలమును ♦ నాయన కాలము దాఁటిపోవు! గాం
గేయధరాధరంబుఁ బరి♦కించినకై వడిఁ గొల్చి సేవలన్
జేయుచు నిప్పు డీ ప్లభిల ♦ షించితి నీసుత-సర్వదేంద్ర క
మ్మా యనినట్లు-నామనవి ♦ నక్కట! కైకొన వేమి సేయుదున్! 156

క॥ నీ లగువు లే నెఱుంగుదుఁ!
జాలు! ఫలము గలుగఁబోదు! ♦ సన్న్యాసులు తా
మాలము నడిపిన-బూడిద
రాలును! నొకవెంట్రుకైన ♦ రాలునె చెపుమీ!" 157

చ॥ అన-నరసింహభూరమణుఁ ♦ డాత్మజ దిక్కయి "తల్లి! వచ్చి యా
సనమునఁ గూరుచుండు! మిఁక ♦ జాగొనరింపఁగరాదు! నేఁడు మో
హనుఁడు మనంగనీయఁ"డన ♦ నామెయుఁ "దండ్రి! భవద్విపత్తులన్
జనియెనె! యిప్పు డన్నియును ♦ నా కెఱిఁగింపు" మటన్న-నాతఁడున్, 158

మ॥ "నను నుద్ధారముచేయు ముద్ధతనయా! ♦ నా యప్పుపత్రంబు లె
ల్లను జెల్లన్ బడె! నాదు కష్టములు ప్రీ♦లన్ గంటి! నీసాయమున్
మనమం దుంచితి! మోహనున్ గదిసి సం♦పత్సౌఖ్యమున్ గాంచి పు
ట్టిన యీయింటికి మెట్టినింటికిని జో♦డింపింపు సత్కీర్తులన్!" 159

క॥ అన-మోహనుఁడు "నృసింహా
వనిపా! యీ బుజ్జగింపుఁ ♦ బలుకులు-కథలున్
నెనరులును-నుపన్యాసము
లను విడిచి పనిన్ బొనర్ప ♦ లగ్గగుఁ గాదే! 160

క॥ నే నెంత తఱిమి చెప్పిన
మీ నుడులేకాని, పనికి ♦ మోనరె! నే

మానిని బలాత్కృతిని గొని
నానిలయముఁ జేరుకొందు! నన్నాపకుఁడీ!" 161

మ॥ అని లేచెన్! వనజాక్షియున్ "నిలువు! మయ్యా! యింద రిందుండ వా
రిని గా దంచని నన్నుఁ దాఁకుటకు నేకీలిన్ సమీపింతు! పు
గ్రనిశా తాస్మదుదారఖడ్గమున నీ కంఠంబు ఖండింతు! నో
య్యన నొక్కంగుళి మీావు ముందునకు రా యత్నించితే నిద్యోర్దన్! 162

క॥ ఇల యెఱుఁగు నీపరాక్రమ!
మొలియుచుఁ ద్రుళ్లెదవు! 'కోఁజ లుండినచోఁ గ
ప్పలుగూడఁ గఱచు'నను నుడి
నిలుచును సార్థకముగాఁగ నీయెడ నెపుడున్!" 163

మ॥ అనఁగా మోహనుఁ "డట్లు పల్కకుము! కాంతా! కత్తి నీకేది! న
న్ను నెటుల్ చంపఁగనేర్తు! నా సముఖమందున్ నీవు ఖడ్గంబు నె
త్తని వాక్రున్వకు మంచుఁ జెప్పుకొనలేదా! యింటికిన్ రమ్ము! నీ
కును గంఠంబునఁ ద్రాడు గట్టెదఁ! బరాకున్ మాని విచ్చేయుమీా! 164

చ॥ నఱకుము! కోయు! మే మయిన నన్నొనరింపు! పదాఱులక్షలున్
గురియుచు నీదుతండ్రికడఁ గొంటిని కాదొకో! నిన్ను వీడి నే
నరిగిన నింతకన్న నథ మాధమ దుర్యశ మొందు గల్గునే!
చెఱఁగొనిపోదు! లేనియెడ-చీ! మగ జన్మము నెత్తనేటికిన్!" 165

చ॥ అన-నరసింహభూరమణు "డమ్మరొ! జా గొనరింతుమేని ద
ప్పును మనపైన మోపు జగముల్! జననిందలఁ బొందలేక కా
దె నిను నొసంగుచుంటిఁ! జనుదెంచి ముహూర్తము సాఁగనిమ్ము ర"
మ్మని బ్రతిమాలసాఁగె హృదయంబునఁ జింత కరంబు హెచ్చఁగన్! 166

క॥ "చనుదెంచి తీఱవలెనే!"
యని మెలఁతయు సైన్యనాథు నాస్యముఁ గనె "నీ
తని పని ముగియింతముఁ జా
గొనరింపఁగనేల! యితని యొల్లమి యేలా! 167

క॥ దైవకృప లేనియెడ, ల
క్ష్మీవిభుఁడును సాయమైన మే లొదవంగాఁ
బోవదు! విధికృత మిది! యెటు
కావలసిన కార్య మటులఁ గడకున్ జరగున్!" 168

క॥ అని యతఁ డనఁ - జెలి "వచ్చెద"
ననె! మోహనుఁ డట్టె తఱిమె! ♦ హాహెలి జనకుం
డును 'నీవయి రాఁ జాలవు!
నిను దోడ్కొనివత్తు'ననుచు ♦ నిలువన్ జడిసెన్! 169

" పుష్పావతి పద్మతటాకమున దూఁకుట "

క॥ "జనకా! నీ కేటికి శ్రమ!
మనువుగ నే లేచి వత్తు" ♦ ననుచుఁ గవాక్షం
బునఁ దన తను వవ్వలి కెస
కును ద్రిప్పుచుఁ జెఱువునందు ♦ గొబ్బున దాఁకెన్! 170

క॥ 'చెడితి'మనుచు గంభీరవి
భుఁడు తత్తరపడె! నృసింహ ♦ భూవరుఁడు కదన్
జడిముడి పడి; యొకచో నిలు
గుడువడుచున్ ఱొమ్ము బాదు♦కొనెఁ దీవ్రముగన్! 171

చ॥ "తడయఁగరాదు మీ రిచటఁ! ♦ దప్పక యిప్పుడె డిగ్గి వెళ్లి యా
పడఁతి జలంబునుండియును ♦ బైటికిఁదీయుచుఁ దోడి తెండు! నే
దడఁబడఁ బెండ్లియాడవలె! ♦ ధారుణి క్రుంగి నభంబు వ్రీలి పైఁ
బడిన-తుణార్థమేని నిలు♦పన్ జడి యి"ష్టని మోహనుండనెన్! 172

గీ॥ ఎత్తుగల కిటికీనుండి ♦ యెగిరి దూఁకఁ
బద్మపద్మాకరంబు-దు♦ర్వార శబ్ద
మెత్తి జలము మొత్తంబుగా ♦ నెగసె దివికిఁ!
బారలఁబడి చెల్వ చెఱువులో ♦ మునుఁగనుండె! 173

మ॥ జలమధ్యంబున ద్రోణినుండి వలలన్ ♦ సారించు పుష్పావతీ
లలనానంద సుధాబ్ధిచంద్రుఁడు జనా♦లంకారుఁడౌ వీరుఁ డీ
వలి మోహమై యనుయాయులన్ బలిసి కొ♦ల్వన్-జెంతనే యుండి యా
నలినీరంజనుఁ డాధ్వనిన్ విని-కనెన్ ♦ నారీ శిరోరత్నమున్! 174

చ॥ తన యసమాన సద్గతులు ♦ తప్పి దివంబుననుండి భూతధా
త్రిని బడ జారుచున్న యమ♦రీగణసేవ్య శచీవధూటియో-
యన, భువనైకపావన శు♦భాకృతిఁ గ్రిందికి జారుచున్న నా
రిని గని గుర్తువట్టుచు-భ♦రింపఁగరాని వ్యథా పరీతుఁడై! 175

మ॥ తనద్రోణిన్ నడిపించుకొంచు సముదా♦త్తస్ఫూర్తిమై దాటులన్
గొని యేతెంచి సరోవరాంబువుల యం♦దున్ దూఁకి - సాహసోత్కరిం

చిర కాసారజలాధిదేవత యనఁగన్ ♦ జెన్నారు పుష్పావతిన్
దనహస్తంబుల నెత్తి యొడ్డ నిడి యంతన్ జేర్చెఁ దీరమ్మునన్! 176

సీ॥ లేమ జీవించియుండెనో ♦ లేదొ యనుచుఁ
జేరి హృదయకోశముఁ బరీక్షించిచూచెఁ!
బొంగుచు నలినీరంజను ♦ మోముఁదమ్మి
యందు దరహాసరేఖ దోల్యాడఁదొడఁగె! 177

మ॥ తనయత్నంబు ఫలింపఁబోవమిని జింతన్ గ్రుంగి సైన్యేశుఁ డ
ల్లన సౌధంబును డిగ్గి చెర్వుకడ నుల్లాసంబుతో బాలమి
త్రునిఁ బుష్పావతిఁ గాంచి లేడివలె గంతుల్ నెట్టుచున్ జూసి "జ
వ్వనికిన్ బ్రాణభయంబు కల్గదుగదా ♦ వాక్రువ్వు" మం చాడినన్! 178

గీ॥ "నాదు భాగ్యసర్వస్వ మర్ణవమునందుఁ
గలియునన్న నింతటి వెత ♦ గలుగఁబోదు!
మెఱపు మెఱసినగతి దోనెఁ ♦ దఱిమి నడిపి
చెలి జలమునుండి వెలికిఁ దీసితి క్షణమున! 179

గీ॥ ప్రాణములు దక్కెఁగాని యభ్రంబునో యయు
మేడపైనుండి పడుట నీ ♦ మెలఁత యలసె!"
నంచని నలినీరంజనుఁ ♦ డనఁగ-డిల్లి
సైన్యపతి మోము మందహాసంబు చినుక, 180

గీ॥ "గుండె సెడి నృసింహేంద్రుండు ♦ కూలిపోవె!
సమయమున నీ విచటనుండి ♦ సాయపడుటఁ
బదియువే లొనగూడె! నివ్వనజనయన
మనమె మేడఁ జేర్పుట భావ్యమనుచుఁ దోఁచు! 181

క॥ అన-"మీ కెందుకు శ్రమ! కా
మిని నే బుజమున వహించి ♦ మేడకుఁ గొనివ
త్తును! గాని నృసింహేంద్రుని
గని మెఱుఁగమి సుంత-మదికిఁ ♦ గటువై యుండెన్!" 182

మ॥ అన-సైన్యేశుఁడు వీడఁ గన్గొని "నృసింహాధీశుఁడున్ గ్రొత్తయై
నను నే నుందునుగాదె! సందియము నొందన్ బోకు! నీవి ష్టాన
ర్చిన సాహాయ్యము నాత్రిమూర్తులును జేర్చిన్ జేయఁగాఁజాల! రీ
మెను న్యాయమ్మును బట్టి నీకొసఁగి నెమ్మిన్ బెండ్లిసేయన్ వలెన్" 183

"నలినీరంజనుఁడు పుష్పావతిని మేడకుఁదెచ్చుట"

గీ॥ అనిన–"నాకంతభాగ్యమా" ♦ యను తలంపు
వాఁడమఁగా నలినీరంజ♦నుఁడు లతాంగి
నిజ భుజస్కంధమునఁ దాల్చి ♦ నిబ్బరమున
సైన్యపతివెంట సోపాన ♦ సమితి నెక్కె! 184

మ॥ కలుపుంగోలున మేడపై కరిగి యా ♦ గంభీరసింహేంద్రుఁ "క్రీ
నలినీరంజనుఁ డాజలాశయములో♦నన్ దూఁకి పుష్పావతిన్
వెలికిన్ దీసి లతాంగి జీవముల ని♦ల్పెన్ నేఁడు! నీవింకఁ జిం
తిలఁబో"కంచు నృసింహనేతకును సం♦ధించెన్ మనోధైర్యమున్! 185

గీ॥ వడివడిగ బోనకత్తె త♦ల్పమును వైచి
పరమసుకుమారమగు నొక్క ♦ పఱుపు పఱచె!
నంతట నలినీరంజనుఁ ♦ డా లతాంగి
నిబ్బరమ్ముగ నట శయ ♦ నింపఁజేసె! 186

గీ॥ సైన్యపతి చెంతఁ గల గవా ♦ క్షంబుగుండఁ
జూపుఁ బరగించి దూరపు ♦ క్షోణిజముల
పజ్జనుండియుఁ బరువెత్తి ♦ వచ్చు నొకనిఁ
గనుచు 'నరహరి కాఁబోలు' ♦ ననుచు నలరె! 187

గీ॥ ఉడిగపుఁ జెలి పుష్పావతి ♦ యొడల నున్న
తడివలువఁ దొలంగించి ♦ పొడివలువ ధ
రింపఁగాఁజేసి యామెకుఁ ♦ బ్రియము వెల్లి
విరియ–నుష్ణోపచార స♦ద్విధులు దీర్చె! 188

సీ॥ పుష్పావతి కనుఁద♦మ్ములు విచ్చి యిల్లంత
యును జూచి "యిప్పుడెం♦దుంటి" ననియెఁ!
వడి నలినీరంజ♦నుఁడు "నీదు గృహమునం
దున–మేడపైనుంటి" ♦ వనుచుఁ బలికె!
"నీవెవ్వ డడదెంచి ♦ నా"వని యడుగ–"నీ
వెంట వచ్చితి" నంచు ♦ వీరుఁ డనియె!
"బడలిక వాడమె! నన్ ♦ విడిచి పోకుము! కృప
తప్పవలవ"దంచుఁ ♦ దరుణి పలుక!

గీ॥ "భువనము రసాతలముఁజేర ♦ బ్రుంగిపోవు
పని యెటు లొనర్చితో! నేను ♦ మనవలెనని

తలఁపకె ! ఆత్మహత్యను ♦ దలఁపకు''మని
తల పగులఁగొట్టుకొని నీకుఁ ♦ దెలుప లేదె! 189

సీ। 'అలసటలు దీఱె! నారోగ్య ♦ మలరె! నీవు
చను'మ నెడుఁదాక నుందు నె''♦మ్మనుచు శయ్య
పైనఁ గూర్చుండి చెలిమోము ♦ పైనఁ బొరలు
కలకలను దిద్దె నతఁడు ప్రే♦మాతిశయత! 190

"నరసింహరాయని యాగ్రహము"

గీ। దూరమునునుండి నరసింహ ♦ భూరమణుఁడు
వారి యాలాపముల విని ♦ వారి చంద
ములను దిలకించి-కనుల ని♦ప్పులు రాలి
పడు క్రుధావేశభరమును ♦ బట్టలేక! 191

క। "అంతరు నెఱుఁగక నా సుత
చెంత నొదిగి కూరుచుండి ♦ చిన్నెలు వడెదే!
వంతలఁ గుడిచెదు! రీవా
క॥ కాంతుఁ బ్రతిఘటించి బ్రదుకఁ♦గాఁ గలవాకో! 192
నామెదురుకట్ల నిట్టులు
చేయుదువే! వెడఁగ! నీవు ♦ చేసిన పనికై
నీయుత్తమాంగ మిప్పుడె
నాయసి కుపహార మిత్తు! ♦ నను నెఱుఁగవొకో! 193

క॥ కాలాగ్ని రుద్రు గళమున
ప్రేలిన ప్రేలంగవచ్చు! ♦ వీరనృసింహా
భీల మహామూర్తి కడఁ
దాలిమినై నిలువఁగలరె! ♦ దైవతవిభులున్! 194

క॥ నీసాయముఁ దలపోసినఁ
గానునకును గాదు! నీవి ♦ కారపుఁ జేష్టల్
నే సహియింపనుబో! యు
గ్రాసిని నీ గళముఁ ద్రుంతు'' ♦ ననుచున్ లేచెన్! 195

క॥ కని-మోహనసింహుం''డీ
పని నీకున్ వలవ! దనఁటి ♦ పం డొలువంగా-
నినుపది గో రేటికిఁ బో''
మ్మని నలినీరంజనుని ము♦ఖాబ్జముఁ గనుచున్, 196

"నలినీరంజనునిపై మోహనుఁడు విజృంభించుట"

క॥ "నే నిపుడు పెండ్లికొమరుఁడ!
నా నెలఁతను దాఁకఁగలవె! ♦ నను నెఱుఁగుదె! ధా
త్రీనాథులందఱకు నే
నే నాథుఁడ! నాదు మాట ♦ కెదు రేది ధరన్! 197

శా॥ ధారాధీశ్వరు భోజభూభుజు భుజ♦ద్వంద్వంబు ఖండించితిన్!
ధీరాగ్రేసరు బృథ్వీరాజు నని నా♦ర్తిన్ ముంచి వేఁగొందితిన్!
వేరెవ్వారను నన్నుదాఁకి మనఁగా ♦ విశ్వంబునన్ లేరు లే!
రోరీ! కన్నడి తీ వాకొండ! విదె ని♦న్నువ్వెత్తుగా భ్రమింగెదన్!" 198

క॥ అని-తన పైగుడ్డను మో
హనుఁడును బైకెత్తి వీరు ♦ నటులన్ వైవం
గను జూచిన-నలినీరం
జనుఁ డాతనిఱొమ్ముఁ గ్రుమ్మె ♦ చయ్యనఁ ద్రోసెన్! 199

క॥ నడుమెల్ల బడలి యడలుచుఁ
బుడమిని బడి మోహనుండు ♦ "పోరా! ద్రోహీ!
విడ మిచ్చి పిలిచి రే! యి
క్కడి కేటికి రాఁగ! సిగ్గు ♦ గలదే నీకున్. 200

క॥ మాయమ్మి నీటదూఁకిన
మాయిష్టం బూరకుండు♦మా! మే మామెన్
ద్రోయుదుమో! తీయుదుమో!
యో యవివేకీ! పనేమి ♦ యున్నది నీకున్! 201

క॥ చెఱువున నెవ్వరు దూఁకినఁ
బారిపోరి-నీప్రాణములును ♦ బోయెదు నటు లా
తురపడుచు వెలికిఁ దీసెదు!
బిరబిరఁ దలఁగోసికాని ♦ విడువను నిన్నున్! 202

ఉ॥ నాకడఁ గత్తియుండిన-క్ష♦ణంబునఁ దున్మియె యుందు! ఖడ్గమున్
నీకడ నున్న! దిచ్చెదవె! ♦ నీగళమున్ దెగఁగోసి వెండియున్
నీకె యొసంగువాఁడ! నిది ♦ నిక్కము! నమ్ముము నాదుమాట! య
ట్రాకలఁ బెట్టఁబోకు" మన-♦నాయువకుండు తిరస్కరించుచున్! 203

క॥ "ప్రేలకు నోరికి వచ్చిన
లీలను! నిను నీప్రభుతను ♦ లెక్కింపను! నే
నేల నిడి కాల రాచెద!
నేలా సమయంబు పోవ ♦ నీయఁగ నాకున్! 204

క॥ తులువా! యుదయాద్రిని నొక
పలుకను నస్తాద్రి నొక్క ♦ పలుకుఁ గలుపుచున్
విలపించెదు! చక్కఁగ మా
టల నాడు టెఱుంగ! వెట్టి ♦ డవర వా నీవున్! 205

క॥ వేసంక నోరి కొదవిన
యాసరణిని జొల్లుకూత ♦ లఱవకు! యింక నీ
వేసముఁ గన దోసంబగు!
దాసరి! పడియుండు! పడువు ♦ దక్కదు నీకున్! 206

ఉ॥ ముప్పదిరేండ్లు వచ్చినవి ♦ బుద్ధి యొకించుక రాకపోయెనం
చెప్పుడు చింత నొందెద! వరా ♦ రే! గిలిగింతయె లేని ముద్దురా
చిప్పవు! ముందు తప్పుపడి ♦ చీ! తలిదండ్రులు గాంచియుందు! రీ
తప్పులు సృష్టి చేసిన వి ♦ ధాతవి! వారలఁ దిట్టనేటికిన్! 207

మ॥ అవివేకం జెకతొట్టి యూకొలఁదునం ♦ దానాఁడు నీవట్టె దూ
క వెనన్ నే నపదెంచి సాయపడనే! ♦ కట్టా! శతాబ్దంబు లీ
భువి జీవించి సుఖింపఁగావలయు నీ ♦ పుష్పావతీదేవి యం
బుపులన్ వ్రాలిన గట్టుచేస్పులకుఁ ద ♦ ప్పున్ బట్టెదే దుర్మతీ! 208

క॥ మతిహీనత వెంటఁ గృత
ఘ్నత నీయెడఁ గలదు! నిన్నుఁ ♦ గనరా" దన-ను
ద్ధతిఁ జైకిదూఁకు శునకము
గతి మోహనుఁ డధికకోప ♦ గర్వితమతియై! 209

మ॥ "ఎవఁడా దుర్మతి! నీవె దుర్మతివి! నీ ♦ వే క్రోధి! నీవే విరో
ధివి! నీవే ఖర! నీవె శుక్లివు! విరో ♦ ధికృత్తు! నీవే పరా
భవ! నీవే నళ! నీవె దుందుభివి! యా ♦ పై హేవళంబ్యాహ్వయుం
డవు! నీవే క్షయ! నీవె క్రూర! విటు లా ♦ ర్దన్ బోకు నాసన్నిధిన్. 210

॥ ఈవె మఖ! నీవె పుబ్బ! నీ ♦ వే ధనిష్ఠ!
నీవె భరణివి! నీవె రో ♦ హిణివి సుమ్ము!

జ్యేష్ఠ వీవె! పూర్వాషాఢ ♦ వీవె! మూల
వీవె! శతభిష మీవె! నో♦రెత్తవలదు! 211

క॥ నీ వతి గండంబవు! నీ
వే వైధృతి! వీవె గండ! ♦ మీవే శూలం
బీవే వ్యాఘాతంబవు!
నీవె వ్యతీపాతమవు! గ♦ణింపఁగ నేలా! 212

క॥ నీవే పాఠీనంబవు!
నీవే నలికిరివి! నీవె ♦ నిట్రాతివి! నీ
వే వాయువిళంగంబవు!
నీవే మిన్నాగమవును! ♦ నీవె యఖిలమున్! 213

క॥ నీవే నిద్దురపోతవు!
నీవే నిప్పచ్చరమవు! ♦ నీవే ప్రాచీ
నావీతివి! రాబందవు!
నీవే బోరువవు! నీవె ♦ నిర్భాగ్యుఁడవున్! 214

క॥ తులువా! యొకటికి వేయిగఁ
బలికెద! వడ్డికిని వడ్డి ♦ వడ్డింతుఁ! గడున్
సులభముగా భేతాళుఁడు
తొలఁగును! నను దొలఁగఁద్రోయ ♦ మసాధ్యమగున్" 215

క॥ అను మోహను నలినీరం
జనుఁ "డరరే! వదరుపోత! ♦ చాలింపుము నీ
యనుచితపు టొట్టెకూఁతలు!
నిను నిలువున నఱికివైతు ♦ నిమిషములోనన్! 216

క॥ నాఁ డొసఁగిన నీప్రాణము
నేఁడు గొనెద! నుదుట మూఁడు ♦ నేత్రంబుల క్రొ
వ్వాఁడిగల హరుఁడు వచ్చిన
వీడను బ్రాణములతో వి♦వేక విహీనా!" 217

మ॥ అని-నిస్త్రింశము దూసె! నప్డతని జా♦యన్ వచ్చి వైవ్యాధినే
త "నినున్ మెత్తురె యీతనిన్ దునుమ! శాం♦తంబూని కూర్చుండు ర"
మ్మని హస్తంబునుబట్టి తెచ్చి యొకచో ♦ నాసీనుఁ గావించె! నా
యన మన్నించుట, మౌన మూనుచు నృసిం♦హస్వామి శాంతిన్ గనెన్! 218

మ॥ తన పీఠంబునఁ జేరి మోహనుఁడు శాం♦తం బూనఁగా లేక "వీ
ర నృసింహాధిప! నేఁటి తప్పులకు భా♦రం బంతయున్ నీది! నా
మనవిన్ బెండ్లి ముగించియుండినను-భా♦మారత్నమున్ నీటిలో
మునుఁగన్ బోవక యుండు! నీ చెనఁటి త♦ప్పుల్ చేయకుండున్ గదా! 219

ఉ॥ నెత్తిన నోరు పెట్టుకొని ♦ నేఁ బలుమాఱును నీకు మ్రొక్కుచున్
బత్తిని విన్నవించితిని! ♦ నా నుడులన్ గొని నీ మనంబునన్
మెత్తపడంగఁబోక-నను ♦ మిక్కిలి యాఱును దూఱుపెట్టి యీ
క్రొత్తవిపత్తుఁ దెచ్చి యిటు ♦ కొంపకుఁ జిచ్చు ఘటించి తక్కటా! 220

మ॥ అలఘుమాధ్ర్యము గల్గి నీతనయ లో♦కాతీత సౌజన్యమున్
గలదంచున్ మది మెచ్చి మేల్పడితి! నీ ♦ గయ్యాళి క్రౌర్యమ్మునన్
మెలఁగెన్ నేఁ"డని పల్కె మోహనుఁడు! మేల్ ♦ మేల్! లోక మిట్లే కదా!
వలపుల్ పల్చనయైన-లోపములు కు♦ప్పల్ కుప్పలై తోఁపవే! 221

సీ॥ "పెండ్లిపీటలఁ గూర్చుండ ♦ వే యటన్న
బోటి మొగమోటి కోనేటి ♦ నీట దూఁకె!
నింతియే యిది! మొఱ్ఱో! యి♦దేటిమాట!
యెవ్వనైన వరింతుకే ♦ యిపుడు దీని!" 222

క॥ అని మోము చిట్లుగొని మో
హనుఁడును "నేఁ బోదు నింటి"♦కనఁగ-నృసింహా
వనిపతి వెఱపొందుచు "నే
మనవలెనో నిన్ను! నింత ♦ యాతుర మేలా! 223

సీ॥ బాల్యచాపల్యమున నిష్ట ♦ పడమిఁ జేసి
మనసు నిలువక సాహసం♦బునకు దిగెను!
నడుగు దప్పిన యంతనే ♦ పిడుగు దప్పె
ననక యోరిమిపట్టి మ♦మ్మాదరింపు! 224

క॥ నీ పేదమాట లన్నియుఁ
గోపముఁ గలిగించు నాకు! ♦ గుణనిధిగ జగం
బేహద్దు వినుతి చేసిన
నాపాపను దప్పు వట్ట ♦ న్యాయమె నీకున్! 225

॥ ఇంతకును వెఱ్ఱిపోకడ ♦ లెన్నియున్న
నింతి గనుపింప నుడిగి నో♦రెత్తకుండు!

నేఁడు మేమెల్ల నడలి భ్రాం♦తిని బడంగఁ
గడకు నీ కెత్తె నీరీతి ♦ గంగవెఱ్ఱి! 226

క॥ మఱి నిన్ను నెఱిఁగి యెఱిఁగియు
వితకద నీతప్పు లిచట ♦ వెదకుట నాకుఁ!
గతిమాలి కంబళంబున
గతుకుచు - వెంద్రుకల నెంచఁ ♦ గడఁగిన పగిదిఁ!" 227

క॥ అని కోపము దెలుపఁగ మో
హనుఁడు "నృసింహేంద్ర! నాకు ♦ నఖిలము దెలియుఁ!
నిను వ్యాఖ్యానం బొనరుపు
మని కోరను! చేటతెల్ల! ♦ మఱుఁగఁగ నేలా! 223

మ॥ వనితా! యేటికి నీట దూఁకి తని చెం♦పన్ గొట్టి శిక్షించి నె
ట్టనఁ గన్నెత్తిఁగఁజేసి నా సరసఁ బీ♦టన్ దెచ్చి కూర్చుండఁ బె
ట్టిన-నిన్ మెచ్చిరె యుండు లోక! మిటులన్ ♦ డీకున్ బ్రదర్శింప ని
చ్చిన తప్పంతయు నీదె! కావున నినున్ ♦ శిక్షింపఁగా నొప్పగున్! 229

చ॥ మది నను మెచ్చకుండినను ♦ మానె! తటాకమునందు మాఁకినన్
ముదమగుఁగాక! యే రకము ♦ పోకడ పోయినఁ బోవుగాక! నీ
హృదయమునన్ జనించునొకొ ♦ యించుకయున్ బరితాప! మట్టులేఁ
దుదకు వివాహమున్ సలిపె♦దనో-మఱి సల్పనో-తెల్పు మిప్పుడున్! 230

క॥ నాకన్న భాగ్యవంతుఁడు
నాకన్నను నందగాఁడు ♦ నాకన్న శుభ
శ్లోకుఁడు లభించునే! యెవఁ
డో కపికుంజరుఁడు తుదకు ♦ నువిదకు వారకున్! 231

చ॥ నిను విని మోసపోయితిని! ♦ నీ నడతల్ కొనసాఁగ వింక! నా
కనులకు రక్త మెక్కె! మదిఁ ♦ గల్గినమాట వచింపు! పిల్ల ని
చ్చిన గడు లెస్స! యీయనని ♦ చెప్పిన నంతటికన్న లెస్స! యీ
వనిత లభింపకుండిన వి♦వాహములేక వటుండ నోడునే! 232

క॥ ఆడినమాటను దప్పిన
ప్రోడవు నీవగుదుగాక! ♦ పోపొమ్ము! నినున్
జూడఁగ దోసం" బని వా
దాడెను మోహనునితోడ ♦ నధిపతి యంతన్! 233

చ॥ “నిను నను లోకమే యెఱుఁగు! ♦ నే నిటఁ బల్కఁగ నేల! యేడులన్
జనిరొ! బరస్పరం బెఱుక ♦ చాలని దే” యన మోహనుండు “నీ
వనుపది నే నెఱుంగుదుఁ గటా! నెడమాటలు నావి! మోసపుం
బను లివి నీవి! ముందెఱుఁగ ♦ వచ్చియు యుండిన నమ్మియుందునే! 234

ఉ॥ కోఁలను మాట యుండఁగనె ♦ నూల్కొను గోపము కొండయంత! యిం
తేటికిఁ బత్రముల్ చిరిగి ♦ యెన్నిగడెల్ గమియించె! నింతకున్
బోటికొలంగు నాపనికిఁ ♦ బూనవు! సుంత ప్రసక్తిఁ దెచ్చినన్
గోటులు కోట్లు పల్కెదు! నిన్నుఁ గుఱుతింపక మోసపోయితిన్! 235

గీ॥ జనక! చిక్కులు దీఱెనే ♦ యనుట-సరసి
దూఁకు! లేక యెమ్మొకాఁడు సందుకొను! టిచటి
కిట్లు మాయుట-యెఱుఁగనే ♦ నృపవరేణ్య!
తినక రుచి-దిగకయ లోఁతు ♦ తెలియువాఁడ! 236

క॥ నా రోగము మంచిదియై
యీ యరవిందాక్షిగుణము ♦ నిపుడె యెఱింగితిన్!
జేరె ప్తి దండపెట్టెద!
నోయీ! వల డింక వలవ! ♦ దూరికిఁ బోదున్! 237

గీ॥ తండ్రియెడ భక్తిగలిగి-బాంధవులయెడలఁ
బ్రీతి గలిగి-మర్యాదల ♦ పెంపెఱింగి-
యించుబోఁడుల నూటవే ♦ యింట నొకతె
యుండునో లేదో! సందేహ ♦ మొదవు నాకు! 238

ఉ॥ వీడదు నేహమున్! బయట ♦ వెళ్లదు! నిన్నునుదప్పఁ దక్కఁరున్
జూడదు! వీని నె ల్లెపుడు ♦ చూచెనొ! యెట్టులు వెంటఁదెచ్చెనో!
యేఁడుది గామరా యిది! యెుయారవుఁ జెన్నెలకోడెకాంద్ర వే
టాడెడు కామదేవత య♦టంచు వచించెదఁ జిత్తశుద్ధిగన్!” 239

చ॥ అనఁగ-నృసింహభూరమణుఁ ♦ డాతని దిక్కయి “నిన్నుఁగూర్చి నా
మనమున నున్న ప్రీతి-యభిమానము-ప్రేమము-వేయి వ్రక్కలై
చనఁగఁ గఠోరభాషలను ♦ సల్పితి! పూర్వపు మైత్రిబంధమున్
గని నినుఁ దప్పుపట్టి పలుకన్ జన కిప్పుడు మాన మూనెదన్! 240

క॥ నీకు బలము కడుఁదక్కువ!
పైకొని ముజ్జగము ద్రింగఁ ♦ బరుగెత్తెదు! నీ

కాకసము గ్రమింగుసంతటి
యాఁకలి! గొం తావగించ ♦ యంత! మెఱుఁగుమర్! 241

క॥ నిలువుము నీ నుడు''లని పతి
పలుకఁగ మోహనుఁడు బదులు ♦ పలుక యతింపన్
నలినీరంజనుఁ డోర్వక-
''పలువా! తెగవ్రేతు శిరము ♦ బదు లాడినచో! 242

క॥ అమరవధూసమ యగు నీ
కొమ పేరెత్తినను-నాల్క ♦ కోతలు వడు! వశా
నము నూనవేని నీ ప్రా
ణము నీకును దక్కదనుచు ♦ నమ్ముము కుమతీ! 243

మ॥ మఱి నీపెండిలిఁగూర్చి నిర్ణుటించి మాఁ♦మర్ జేరి సూక్షాను కో!
మ్మురవా! నీ తరుణీప్రసక్తికి లవం♦బుంకింప శీర్షంబు కో
బ్బెరకాయల్వలెఁ గ్రింద ద్రొర్లెడిని! గం♦భీరేంద్రుఁ డొక్కింత స
త్కరుణన్ దాల్పకయున్న-సర్వసురలున్ ♦ గాపాడ నేరెంచినన్! 244

క॥ పిఱికీ! బండెడు కండలు
తఱుగుచుఁ గుప్పలుగ నిడెదఁ! ♦ ద్వరగ నృసింహే
శ్వరు మన్ననంబు-నీ సుం
దరి కాళ్లన్బడుచు మన్న♦నముఁ గొనకున్నన్! 245

" నరహరి దుర్గమునకు వచ్చుట "

చ॥ ''త్వరపడు'' మంచు వీరుఁడు క్రు♦ధావిలయాంతకుఁడో యనన్ మిడుం
గురులు కనుల్ దిశాంతములఁ ♦ గుప్పఁగ-ఖడ్గముఁద్రిప్పె! నంతలోః
బొరిపొరి రోఁజు చక్కడికిఁ ♦ బూర్ణజవంబున నేగుదెంచి యా
నరహరిసింగు - స్వామి చర ♦ ణంబుల వ్రాలి నమస్కరించుచున్! 246

చతుర్థాశ్వాసము

---

శ్రీ

# పుష్పావతి

## పంచమాశ్వాసము



క. "ఏకిమీఁడ! క్షమింపుము! నేఁ
డొక గడె తడవయ్యెఁ బ్రాణ ♦ ముండంగనె పూ
నిక తాఁ గలిగితిఁ! గార్యం
బిఁక కాయో పండో తెలిపి ♦ యేలుము దేవా! 1

మ॥ జవ మొప్పారఁగ వాజిపైఁ బఱపనమ్మున్ ♦ సాఁగించుచున్ మొన్న భా
ర్గవవారంబె నృపాలదేవు పదయు♦గ్మంబందు మీ లేఖ నుం
చి వెసన్ వారిడు నాజ్ఞఁ గైకొనుచు వి♦చ్ఛేయంగ రామాద్రి ప
జ్జ వనంబున్ దరియన్-దుపానలమి వ♦ర్షం బెంతయున్ బైకొనన్! 2

సీ॥ నిన్న ప్రొద్దుటినుండి ♦ నిరుపయోగం బయ్యె
హయ! మెట్లో నిన్న సా♦యంతనమ్ము
హరిపురంబును జేరి ♦ యట విశ్రమించి యీ
యుదయంబె లేచి ము♦ప్పదియు మైళ్లు
బ్రదుకో-చావో-యంచుఁ ♦ బఱవెత్తి వచ్చితి!
వాన లేకుండినఁ ♦ బయనమెల్ల
నిన్ననే ముగియించి ♦ నీపాద నీరజం
బులు గొల్చియుందు! నా ♦ పుణ్యమిట్లు

గీ॥ త్రోపు వదిమె! దైవము చిన్న ♦ చూపు చూచె!
నిందు నా తప్పు లేదని ♦ యెంతు! దేవ!
నీదు హృదయంబు కారుణ్య ♦ నీరధి గద!
యెట్టులేలిన ముదము వ♦హింపఁగలను!" 3

చ॥ అని యొక సంచినుండి యొక ♦ యందపుఁ బెట్టియఁ దీసి స్వామి చెం
త నిడి, కరంబులున్ మొగిచి ♦ తద్దయు భక్తిని నిల్చె! సైన్యపుం
డును 'సరి' యంచుఁ బెట్టియఁ గ♦డున్ బదిలంబుగఁ దీసి కాగితం
బును గనుగొంచు-మోమున న♦పూర్వవికాసము చెంగలింపఁగన్, 4

క॥ "నరహరి! యెప్పుడైనను ద
ప్పెఱుఁగుదువే! పనుల కిచట ♦ నెడ మున్నది! ము
మ్మరమగు శ్రమము ఫలించెను!
గరము ముదముఁ గంటి నెదు ♦ కష్టంబునకున్! 5

క॥ నిలుచుకొనలేవు! మిక్కిలి
యలసి నటులు దోఁచెఁ! గ్రింది ♦ కరుగుచు శ్రాంతిన్
వలసినగతిఁ జేకొను" మని
పలికి-మహోత్సాహకళల ♦ వదనం బలరన్, 6

"మోహనుని విజృంభణము-అంత్యోపన్యాసము"

క॥ బల్లపయిఁ గాగితంబును
నల్లనఁ బొందించె! నప్పు ♦ డా మోహనుఁడున్
బెల్లగు చీకాకున-నో
రెల్లఁ దెఱచి యావులించి ♦ యి ట్లనఁ దొడఁగెన్! 7

క॥ "మీరంద ఱొక్కగుంపుగఁ
జేరుచు నాపైనఁ గుట్ర ♦ చేసితి రని నే
నారూఢిగ నెఱిఁగితిఁ! జే
కూరదు మీకోర్కి-జగము ♦ క్షోభముఁ గనినన్! 8

మ॥ నృపుఁ డాలస్యమొనర్చుటల్-వనితయున్ ♦ నీటన్ వడిన్ దూఁకుటల్-
గృపయున్న ట్లితఁ డామె నోడపయినన్ ♦ గిల్కొల్పి తోడ్తెచ్చుటల్-
విపులోదగ్రపరాక్రముండయిన గం♦భీరేంద్రుఁ డడ్డుండుటల్-
విపరీతంబులు గావె! నాకు నెఱుఁగన్ ♦ విజ్ఞానమున్ లేదొకో! 9

చ॥ అతివను బెండ్లియాడఁ బదు♦నాఱగు లక్షలు ధారవోసి నే
వెతల మునుంగుచుండ-నొక ♦ వీఱిఁడి నాకును దీర్పు సెప్పఁగా
నతకుకొనెన్ విచిత్రముగ! ♦ నా ధనమంతయు నా కొసంగినన్
గుతుకము నొంది నే నిపుడు ♦ కొంపకుఁబోదు మిమున్ స్మరింపుచున్! 10

సీ॥ 'తనయ నిచ్చెదను ద♦ప్పను దప్ప' ననుచుఁ బ
ల్కాఱును మాట న♦మ్మంగఁ బలికి-
యీడఁజేరిన బెక్కు ♦ లిచ్చకంబులు పల్కి
నమ్మించి యప్పుప♦త్రమ్ములు గొని
నాలుక పీకుకొ♦న్నను బదులాడక-
జాలిఁ దలంపక - ♦ కాలయాప

సముచేసి–చెలిఁ దటా ♦ కమునఁ దూఁకఁగఁ జేసి–
వైరి నొక్కని నిందుఁ ♦ జేరఁదీసి

సీ॥ పెద్దతల నొక్కఁడని నడ్డి ♦ వెట్టి–పిల్ల
నీయకుండనె నా యప్పు ♦ లెగురఁగొట్టి–
సర్వసన్న్యాస మిప్పించి ♦ సాఁగఁదోలఁ
బాలుపడితె నృసింహేంద్ర ♦ పాప మనక! 11

క॥ అప్పులు దీర్పఁగ సుళువగు
నిప్పద్ధతి లోకమునకు ♦ నెఱిఁగింపుము! నే
గొప్పలు కుఱుచలు తలఁపక
నెప్పుడు నీపదయుగమున ♦ కెరగును జగముల్. 12

క॥ విలువకు విడిచిన టోలియు
వెలసేయని వట్టికూటి ♦ పేదవు! నీవో
నలినీరంజన! యిటఁ దగ
వులు దీర్పఁగ వచ్చియుంటె ♦ ప్రోడవు వోలెన్! 13

క॥ వెల యిచ్చి విలుచుకొంటిని!
గలికికి నే గట్టువాఁడ ♦ గళ సూత్రము! నన్
వల దనఁగా నీ వెవఁడవు!
కలియుగ భీముండ! నీదు ♦ గళమును ద్రుంతున్! 14

క॥ పదిలక్షలు సైన్యంబులు
గదిసినఁ జీరికిని గొనని ♦ గండరగండం
డదనను ముప్పూర కోడునె!
కదియుఁడు! మీ తలలు గోసి ♦ కండలు రాల్తున్! 15

క॥ నా యప్పుఁ దీర్పలే క
న్యాయముగాఁ బిల్లఁ జూపి ♦ నా పత్రములన్
జేయూరఁ జింపిరని దే
శాయతి మీ దౌష్ట్యములను ♦ నాక్రోశింతున్! 16

క॥ నరసింహరాయ! నీ సుత
నిరవొందఁగ నీయవేని ♦ నేఁ జని రోమే
శ్వరుఁ డెత్తెఁ! జంద్రమహలును
ద్వర నాతఁడు లగ్గ వట్టి ♦ ధరణిన్ గలుపున్! 17

సీ॥ మో - హ - న - యను వర్ణ♦ముల మకారాదుల
మగధ-మంగోలియా ♦ మాత్స్యములును!
మద్ర మాళవములు- ♦ మతి హకారాదులు-
హూణరాజ్యము లెన్ని ♦ యుండు నన్ని-
హాలెండు-హాంకాంగు- ♦ హంసురాలును-నకా
రాదులు-నార్వేయు ♦ నాడగిరియు-
నెల్లూరు-నాగూరు-♦ నేటాలు-నాసిక
నేపాళ దేశ రా♦జ్ఞివహమెల్లఁ

గీ॥ గూడి - తమతమ సేనల ♦ తోడ నన్నుఁ
గొలువ దండెత్తి వచ్చును! ♦ గోడు పడెద!
పుఱక నా కిచ్చి పొమ్ము నీ♦వరతనూజ-
బ్రదుకవలెనంచు నీ వాస ♦ పడెదవేని! 18

మ॥ అల కైలాసము రావణాసురుఁడు బా♦హాశక్తిమై లేపెనన్
పలు కాలించి-హిమాద్రినెత్తి తలఁడా♦ల్పన్-గొండయున్ బ్రీలి రొ
ప్పులు వార్చెన్ బడఁదొల్గె! నొక్క శకలం♦బున్ నిల్చె! శీతాద్రియుం
చలరన్ జొచ్చిరి! నేను గన్నపుడు బ్ర♦హ్మాండంబునన్ నిండెఁబో. 19

క॥ అల గంభీర విభుండని
యలుకుదునే! ఢిల్లినాథుఁ♦డగు పృథ్వీభూ
తలపతి వచ్చిన నిలుపక
తలఁ దరిగెద! వీరులేనిఁ ♦ దరలుం" డనినన్! 20

మ॥ నలినీరంజనుఁ డాగ్రహించుచుఁ గృపా♦ణంబెత్తి "యోరోరి మ
ర్త్యులుఁడా! మే మిట శాంత మూనుకొలఁదిన్ ♦ వాయెత్తుచున్ బోటుకూ
తలనున్ గూసెదె! నీ పరాక్రమము శౌ♦ర్యత్వంబునన్ గంగలోఁ
గలుపన్ నేర్తును! నీవె మేటరివె లో♦కంబందు! నేఁ జూడనే! 21

మ॥ పలుగాకీ! ధనమో ధనంబో యనుచున్ ♦ బల్మాఱునున్ జిమ్మటన్
బలె వాపోయెదు! నీ యసహ్యపు గళ♦ధ్వానంబు నాలించి చి
ల్లులు వోవున్ జెవులున్! బ్రగల్భముల న♦ట్లున్ నిల్పి రాఁదగ్గ య
ప్పుల మొత్తంబును దెల్పు! మిప్పుడె ధనం♦బున్ నెత్తిపైఁ బోసెదన్! 22

చ॥ అపరిమితార్తికిన్ జివికి ♦ యందఱు రోయఁగఁ దండ్రి విత్త లో
లుపుఁ డయి కూర్చి యింట నిడు ♦ లోహపుఁ దుంటలు చూచి నీకుఁ గం

ళ్లఁ బోరలు గప్పియుండె! నడ♦లున్ గొన-మత్కరవాలధార నీ
దు పోర సడల్చి లోకము స♦మస్తముఁజేసెద నీక్షణమ్మునన్!" 23

మ॥ అని క్షుద్రంపుమృగంబుపైఁ గవియు హ♦ర్యక్షంబు చందాన-మో
హను ఖండించెద నంచు నొక్కవడి డా♦యన్-సైన్యనాథుండు బో
రన హస్తంబున నాపి "పిచ్చుకపయిన్ ♦ బ్రహ్మాస్త్రమా! లేడిపై
ఘనహర్యక్షము దూఁకుటా! శశకమున్ ♦ ఖండింప దంభోళియా! 24

మ॥ నలినీరంజన! నిల్వు! మీ కలఁత యం♦తంబొందె! నాయానయున్
గల''దం చాడిన-వీరుఁడున్ నిలిచె! వే♦గన్ నారసింహేంద్రుఁ డ
వ్వలి క్రమాసనమొందె! మోహనుఁడు దు♦ర్వారోద్ధతుండైన యా
నలినీరంజను పోటు తప్పెనని వం♦తన్ బాసె డెందంబునన్! 25

మ॥ స్థిరతేజున్ నృపమౌళిఁగన్న యపరా♦ధిశ్రేణి చందాన నం
దఱు మౌనంబు వహించి తద్దయును శ్ర♦ద్ధాభక్తు లొప్పార వి
స్ఫుర దాస్యంబులఁ జూచుచుండి! రరుసం♦బున్ గాంచి గంభీరనే
త రటద్వ్యాప్షక మేఘమో యనఁగ ను♦ద్ఘాటించె నీవాక్యముల్! 26

" గంభీరసింహు నభిభాషణము "

మ॥ "స్థిరశౌర్య ప్రథిత ప్రభావుఁడగు పృ♦థ్వీసింహ భూమీతలే
శ్వరుఁ డీ చిక్కులఁ దీర్చె! నేఁ డిచటి కా♦జ్ఞాపత్రమున్ బంచె! నో
నరసింహేశ్వర! నీవు నీ తనయ బం♦దాలైతి! రీపత్రమం
దరుదౌ నంశము లెన్నియేని విదితం♦బై కానఁగా వచ్చెడిన్! 27

మ॥ కొలుతన్ నిన్ను రివామహీస్థలికి నా♦థున్ జేసిన స్థూల క
ప్పులు గావించుచు దేశభాగ్యనివహం♦బున్ బెంపు గావింప-క
వ్వల నీయిచ్చకు వచ్చినట్టి గతులన్ ♦ వర్తించి రాజ్యంబునన్
విలయోద్వేగము నొందఁజేసి తనుచున్ ♦ బెంపొందె దుర్వార్తలున్! 28

గీ॥ కొమిరెఁ బుష్పావతిని గన్న ♦ కొన్నినాళ్ల
కల వసుంధర – నీదు న♦ర్ధాంగలక్ష్మి-
శివునిలో నైక్య మయ్యె! నీ♦చిన్నికూతుఁ
బదియు నేడేండ్లు పెంచితి ♦ వెదను నిలిపి! 29

క॥ ఏకైకపుత్రి! కలిగిన
ప్రాకటభాగ్యములు వెచ్చ ♦ పఱచి తగు వరున్

లోకమున వెదకి తెచ్చుట
నీకగు ధర్మంబు! దాని ♦ నెఱవేర్చితివే! 30

గీ॥ వీరనరసింహరాయ! వి♦వేక మింత
వలవదే! లోకమునఁ దగు ♦ వరుఁడులేక
పడఁతిఁ జంపంగలేక యీ♦పని కొడఁబడి!
తీ తృతీయా ప్రకృతి నీకు ♦ నెట్లు దొరకె! 31

శా॥ మింటన్ మంట యుగంబులన్ వెదకి యీ♦మేల్చేయి సాధించి వా
ల్గంటిన్ గూర్చెదు నీ కృపాబలము లో♦కంబెన్న-నీ కంచు చే
గంటన్ దెచ్చితి! వెంత మూసినను వాఁ♦గన్ జొచ్చు జొక్రైగ-ము
క్కంటిన్ మెచ్చని వెఱ్ఱిబండి-నెఃఱులా♦గన్ జాలితో యీడకన్! 32

గీ॥ చిటచిటలు గొల్పి చిట్టాడు ♦ చిట్టికట్టె!
లోకముల మ్రింగి త్రేఁచెడు ♦ తోఁకచుక్క!
చుచ్చుదకు పల్కులాడెడు ♦ చూపుగుజ్జు!
మితని సవరింప బ్రహ్మకు ♦ నేని వశమె! 33

ఉ॥ అద్దిర! యప్పు దీఱు నను ♦ నాక-సురాంగనలన్ జయించు సి
మ్ముద్దియ సేమమైన లవ♦మున్ దలపోయక-జ్ఞానహీనస్యాఁ డీ
మొద్దుకుఁ గట్టఁజూచితివి ♦ హో! జగమేలెడు లచ్చిఁ దెచ్చి గం
గెద్దుకుఁ గట్టబూను గుణ♦హీనుల లోకము మెచ్చనేర్చునే! 34

సీ॥ కృతయుగంబుననుండి ♦ యెసఁగు వైరము డింద
హృది నెంచి కన్యక ♦ నిచ్చువారు!
కన్నుఁగానక యప్పు ♦ గావించి యదిఁ దీర్ప
నీవలె సుత నీయ ♦ నేర్చువారు!
స్వార్థమ్ముఁ దలఁచి ద్ర♦వ్యాపేక్ష నొక యమో
గ్యునకుఁ గూతు నొసంగఁ ♦ గోరువారు!
'తనపనులకు సాయ ♦ మొనగూడు' నని యన
ర్హునకుఁ బుత్రిక నీయ ♦ నూనువారు!

గీ॥ కటకటా! ఘోరనరక పం♦కమునఁ బడుచు
బ్రహ్మకల్పంబుదాఁక వి♦పత్తిఁ గుడువ
కుందురే! యాఁడుబిడ్డలు ♦ కుంది రేని
నతని వంశంబు నిర్వంశ ♦ మగుట ధ్రువము! 35

సీ॥ విరజాజిపూవులఁ ♦ బరిహసింపఁగఁ జాలు
 రమణీయ మృదు శరీ♦రములతోడ!
నమృతసారంబున ♦ కన్నను స్వచ్ఛమై
 దాక్షిణ్య మలరు చి♦త్తములతోడఁ!
దమయుక్తి లఖిలభూ♦తశ్రేణిఁ గని కృపఁ
 బరపెడు మృదులభా♦వములతోడ!
నల చతుర్దశలోక ♦ ములనైన వశకించు
 నలఘు పాతివ్రత్య ♦ బలముతోడ

గీ॥ సూర్యుడైన నైనఁ గన్నెత్తి ♦ చూడనట్టి
యాడుబిడ్డలు దేవత ♦ లనుచుఁ గొలిచి
సేవసేయని యధముల ♦ జీవితంబు
లఖిల ఘోరపాతకముల ♦ కాకరములు! 36

గీ॥ బాధ్యత వహింపకయు కని ♦ పాఱవైచు
బైనఁ-బందియుఁ బడిపిల్ల ♦ లీను గాదె!
నరుఁడు తన జన్మమట్టి ధ♦న్యతఁ గనవలె
ననిన-బిడ్డలఁ బ్రేమతోఁ ♦ బెనుపవలయు! 37

సీ॥ రాజర్షి లోక మూ♦ర్ధన్యుండు జనక మ
 హారాజు సీత నె♦ట్లరసి యుండె!
నఖిల భూపారాధ్యుఁ♦డగు నశ్వపతియు సా
 విత్రి నెంతటికూర్మిఁ ♦ బెంచియుండె!
విశ్వలోక నుతుండు ♦ భీమరాజేంద్రుండు
 దమయంతి నెంత ప్రే♦మమునఁ బెంచె!
మహితవర్తనుఁడు భీ♦ష్మక నృపాలుండు రు
 క్మిణి నెట్లు పెంచి ప్రే♦మించియుండెఁ!

గీ॥ దనదు కండలు రక్తంబు ♦ ధారవోసి
పెంచు కరుణార్ద్ర చిత్తుఁడే ♦ పితృవరుండు!
పేరు మాత్రంబె! యది తద్ద ♦ పెద్ద బరువు!
బిడ్డలను దేవతలుగ భా♦వింపవలయు! 38

సీ॥ కొడుకుల పెండ్లిండ్లు ♦ కూర్చుట సులభంబు!
 కూతుల చిత్తముల్ ♦ కోమలములు!

మాగ్ధ్వి ప్రధానవై ♦ మనసిచ్చి మాటాడ!
రెడనెడ నొకని మేల్పడిరయోని,
నాస లన్నియు మోపి ♦ ప్రాణంబు లర్పింతు!
రా రాగదార్ఢ్య మిట్లనఁ దరంబె!
ఫలియించుదాఁక వి♦శ్వప్రయత్న మొనర్తు!
ఫలియింపకున్న జీ♦వముఁ ద్యజింతు!

గీ॥ రఖిల లోకంబు వరశూన్య ♦ మనుచు-నీమొ
యేవగించు మోహనునకు- ♦ నీయనుంటి!
వఱువదియు దాఁటి బుద్ధి వ్య♦త్యస్తమయ్యెఁ!
జెప్ప సిగ్గు నీమాట నృ♦సింహరాయ! 39

గీ॥ సరస సౌజన్యముల కెల్ల ♦ జననసీమ!
సుదతి పుష్పావతీదేవి ♦ మది యెఱుఁగక-
కటకటా! మోహనుని జూపి ♦ కత్తిలేక
చంపఁజూచితి! నీ పూన్కి ♦ సఫల మగునె! 40

సీ॥ కనకగిరీంద్ర శృం♦గమునఁ గాపురమున్నఁ
గాకిని గోయిల ♦ కవయఁగలదె!
చేలెల్లఁ దిని బలి♦సినను గాడెనుబోతుఁ
గవగూడ గజలక్ష్మి ♦ కాంక్షపడునె!
గుడ్డలు గప్పి రం♦గులు పూసినను గార్ద
భంబును హరిణి చే♦పట్టఁగలదె!
హేమాద్రిశిఖరి ను♦య్యెల లూఁగినను దివాం
ధముఁ గాంచి రాయంచ ♦ తమకపడునె!

గీ॥ యక్కటా! నీది విఫల ప్ర♦యత్న! మంతె
గాక పుష్పావతీదేవి ♦ కాంక్షపడుచు
మోహనుని గూడునే? కూడి ♦ మురియఁగలదె!
చెలువ మృతినొందుపనిని జే♦సితివి గాక! 41

మ॥ తనయా! నీకును నేరిపై నయిన స్వాం♦తం బున్నదే యంచు నొ
క్క నిమేషంబు నవాంబుజాస్య నడుగం♦గాఁ బూనితే! "కట్ట! మో
హనుఁ డున్నాఁడు-ఋణంబు దీఱు"నను నీ♦యారాటమే కాని యం
గన కొండంతటి నొప్పి చూడవు గదా! ♦ కన్నుండు నంధుండవై! 42

క॥ నలినీరంజనుఁ డెవ్వఁడో
తెలియుదె! తిట్టితివిగాని ♦ దీవింపవు! మూ
న్నాలలఁబడి మొగలిపల్లియ
నిలిచెఁ! బ్రతాపేంద్రు సుతుఁడు! ♦ నీ యల్లుండున్! 43

మ॥ అలినీలాలక యొక్కనాఁ డరిగి యు♦ద్యానంబునం దుండ బె
బ్బులి పై దూఁకఁగఁ జూచియుండెను! మృగం♦బున్ దున్మి కాపాడె నీ
నలినీకంజనుఁ! డాక్షణంబు మొదలీ ♦ నారీవతంసంబు ని
శ్చలరాగంబున వీని మేల్పడి మన ♦ స్సామ్రాజ్య మర్పించెఁబో! 44

చ॥ నినుఁగన మొన్నమొన్న నిట ♦ కే నరుదేరఁగఁ ద్రోవ ఘోరకా
ననమునఁ దస్కరుల్ గవియ- ♦ నా కుపకారమొనర్చె! రేయిఁ గూ
ర్మి నితని యింటియందు నిదు♦రించితి! నిన్నుగూర్చి వింటి! నీ
తనయచరిత్రమంతయు య♦థాగతి వింటినిఁ! గంటి హర్షమున్! 45

ఉ॥ ఇచ్చటి నీ విశేషముల ♦ నెల్ల నెఱింగితి! నిప్డు నీకు వా
క్రుచ్చెద! నప్పుబాధలకుఁ ♦ గ్రుంగుచు మోహను గూర్తునంచు నీ
విచ్చటఁ బల్కుటాది సహి ♦ యింపఁగరాని విషాదవేదనన్
జిచ్చొడిగట్టినట్లు వగ♦చే దురపిల్లిరి వీర లిర్వురున్! 46

గీ॥ రమణి పుష్పావతి ప్రశంస ♦ రాఁగ నితఁడు
దేవతా స్త్రీవిధమున భ♦క్తిని వెలార్చు!
నతని యలికిడి నీ పుత్రి ♦ యాలకింపఁ
గ్రుచ్చి క్రుచ్చియుఁ గొసరు ప♦ల్కులను బలుకు! 47

ఉ॥ ఏ పరమోత్తమోత్తముని ♦ నించుకయున్ గను లెత్తి చూడఁగా
నైపదు! మించి మోహను ప్ర♦సంగ మొకింత యొసంగ-మిట్టి మీ
నై పదు! నీమె వాంఛలకు ♦ నాదటవచ్చు మహానిరోధముల్
బాపఁగ నేఁటిదాఁకను భ♦వద్గృహమందున నేను నిల్చితిన్! 48

శా॥ నీ సౌజన్యము స్నేహబంధము మదిన్ ♦ లెక్కింపఁగాఁబోక ని
న్నాసేధింపఁగ నిల్చితిన్! భువన వి♦ఖ్యాతుండు పృథ్వీంద్రు ఢి
ల్లీ సామ్రాజ్య రమా వధూటికరణిన్ ♦ లెక్కించి పుష్పావతిన్
దాసోహమ్మని కొల్వ నిష్టపడితిన్ ♦ దథ్యంబు ముమ్మాటికిన్! 49

శా॥ నా దేవుండగు రాజరాజ గురు నా♦జ్ఞాపత్రమున్ వింతు! నా
హాదం బేర్పడ నాలకింపుము! మదీ ♦ యాశీస్సులన్ గొంచు మ

ర్యౌదర్ గౌరవముల్ గడించుచును శ్రే♦యస్సంపదాయాధి వాం
ఛా దర్పంబులు సిద్ధినొందు మను మా♦చంద్రార్క సుస్థాయితన్! 50

“ సార్వభౌముని శాసనము ”

సీ॥ “అనుచర సామంతు ♦ లష్టోత్తరశతంబు-
మటి చతుర్వింశతి ♦ మంత్రిమణులు-
ప్రబలి కొల్వంగ స♦ ప్తద్వీప పరివృతా
ఖండ విశ్వంభరా ♦ మండలికి మ
హా సార్వభౌముఁడై ♦ “యఖిల జగత్పతి”
“భారత సూర్యుఁ”డన్ ♦ ప్రబల బిరుద
రాజి దీపింప-నిం♦ద్రప్రస్థ సామ్రాజ్య
సింహాసనం బధి♦ష్ఠించు మేటి!

గీ॥ చౌహాణ కులాబ్ధి సంపూర్ణ ♦ సోమమూర్తి!
శత్రు సమవర్తి! శ్రీపృథ్వి ♦ చక్రవర్తి!
నిండుటొడ్డోలగం బుండి ♦ నెఱపి నట్టి
సత్వరాజ్ఞా ధురంధర ♦ శాసనంబు! 51

మ॥ ప్రతి లేనట్టి మహోగ్ర శౌర్యుఁడు మహా♦బా మంత్రి ‘ఆలా’ చమూ
పతి యుద్ధం బనఁ గాలు దువ్వెడు ప్రతా♦ప ప్రాభవుండై మహో
ద్ధతి దండెత్తెఁ! బ్రతాపరాయ ధరణీ ♦ దారుండు సంయత్పరా
జితుఁడై యేగె! నృసింహరాయునికి ని♦చ్చెన్ వాఁడు రేవా ధరన్! 52

మ॥ “అరిచే భంగమునొంది పాఱిన ప్రతా♦పాధీశుఁ డుద్యద్దయా
పరుఁడన్! సత్పరిపాలకుం! డఖిల వి♦శ్వ స్తుత్యుఁ! డిల్లాలితో-
మురవుల్ గుల్కెడు పుత్రుతో నరిగి ‘యా♦బూ’ శైలమందుండి యీ-
శ్వర సాన్నిధ్యముఁజేరి యాతఁడు గతా♦బ్దంబందు శాంతిన్ గనెన్! 53

మ॥ కులశైలంబుననుండి యాతని యనుం♦గుం బుత్రకుండైన యా
నలినీరంజనుఁ డన్నియంశముల వి♦జ్ఞాపించె! నాలించి యం
దలి యంశంబుల నన్నిఁటిన్ దఱచి యా♦థార్థ్యంబు సూచింపఁగాఁ
గలఁడం చచ్చటి కంపియుంటిమి మహా ♦ గంభీర సింహప్రభున్! 54

శా॥ సేనానాయకమాళి విన్నపముఁ బం♦చెన్! దాని మన్నించి రీ
వా నాథత్వ మొసంగి క్రమ్మఱఁ బ్రతా♦పక్ష్మాపు వంశంబు స

న్మానింపన్ మది నిర్ణయించితిమి! కా♦నన్ మా చమూనాయకుం
డానన్ గొంచుఁ బ్రతాపపుత్రకుని రే♦వాధ్యక్షుఁ గావించుతన్! 55

మ॥ ప్రమదం బారఁగ నిర్వదేడు లిట రే♦వా ధాత్రిఁ బాలించు వీ
ర మహీభర్త నృసింహరాయఁడు మహీ ♦ రాజ్యంబు సర్వంబు చం
ద్రమహాల్ దుర్గముతోడ నా యువకుచే♦తన్ బెట్టి వెన్వెంట దే
శము పేర్తన్ వలె నడ్డుసెప్పక-మదా♦జ్ఞన్ నెత్తిపైఁ దాల్చుచున్! 56

మ॥ నరసింహేంద్రుఁడు రాజ్య మాతని యధీ♦నంబున్ బొనర్పన్ దిర
స్కరణం బూనిన-షిల్లిమూలబలమున్ ♦ గైకొంచు గంభీర సై
న్య రమాధీశుఁడు వానిఁ బోఁ దరిమి రా♦జ్యంబున్ బ్రతాపావనీ
శ్వరు సత్పుత్రున కీయఁగావలయు వి♦శ్వంబున్ నిరోధించినన్!" 57

క॥ అని చదువుచు నుండఁగ మో
హనుఁ "డయ్యా! యితనిపైన ♦ నాంక్షలు గల! వీ
తని పోఁబడి తెలిసిన చెఱ
నునుపు" మనుచు! దోషి రాజ్య ♦ మూనఁగఁ జనునే!" 58

క॥ అన-సైన్యనాయకుఁడు "శా
సనము ముగియలేదు! నీదు ♦ శాపము లిపు డ
ట్లునుపుము! విశ్వము నేలెడు
ఘనులకు నాజ్ఞలు లిఖించు ♦ కళ నేర్పదవే! 59

క॥ "అనఁగా ననఁగా నొక యు
జ్జని" యనియెడు చందమునను ♦ సంభాషణ మీ
వొనరించెదు! తుదిదాఁకను
విని యడుగు "మటంచు మఱల ♦ వినుపఁ దొడంగెన్! 60

మ॥ "ప్రమదోద్రిక్తులు దుష్టబుద్ధులు మహా♦శా నేత లేవేని దో
షములన్ బై నిడియున్న-నిప్పటి మదా♦జ్ఞా వ్యాప్తిచే నన్ని భ
గ్నములై పోయెఁ! బ్రతాపపుత్రకుఁ డనూ♦న స్థానమున్ జెంది దే
శముఁ బాలించెడు దోడిభూపతులఁ దే♦జస్సౌఖ్యమున్ గాంచుచున్! 61

చ॥ ఇరువదియేడు లా ధరణి ♦ నేలు నృసింహనృపాలు నేమ మే
మరయుచు నొక్క-చందమున ♦ నాజ్ఞ యొనర్తుము! బిడ్డ నిచ్చి తం
డిరియు గుమార్తెతోడ నలి ♦ నీప్రభు నింట వసింతురేని మే
మరసము గాంతు! మిద్ది విడ ♦ నాడిన దేశము వీడఁగావలెన్! 62

క॥ ఈ రాజకీయములు విజ
యూ రూఢిని నిర్వహించి ♦ యరుదేరఁగ గం
భీరవిభుం డధికారిగ
నేరుపడున్ స్థిరత యావ ♦ హిల్లెడుదాఁకన్!'' 63

గీ॥ ఇదియు - రక్తాక్షి నభమునఁ ♦ గృష్ణపక్షు
పంచ మీఁదువారము మహో ♦ బా పురమునఁ
బ్రభుల సంతకమును ముద్రఁ ♦ బడసె-నిట్లు
సత్వ రాజ్ఞా ధురంధర ♦ శాసనంబు!'' 64

క॥ అని శాసనము ముగింపఁగ
విని నరసింహేంద్రుముఖము ♦ వెలవెల పోయెన్!
వనితామణి పుష్పావతి
కిని ప్రాణము లేచివచ్చి ♦ కింకిరి వాసెన్! 65

క॥ నలినీరంజను హృదయో
త్పలము వికాసంబుఁగనె! వె ♦ తన్ మోహనుఁడున్
గలగుండు వడుచుఁ దద్దయుఁ
జలియించెను రావియాకు ♦ చందం బాఱన్! 66

శా॥ అబ్బాలా తిలకంబుఁ గైకొని వివా ♦ హం బాడు నాశా లతల్
తబ్బిబ్బై తెగిపోవ-వేదనను గ ♦ న్దమ్ముల్ రుచుల్ పాయుచున్
మబ్బుల్ గ్రమ్మఁగ మోహనుం డడలి సో ♦ మ్యస్ఫూర్తిఁ గూర్చుండలే
కబ్బా లాడఁదొడంగె గుండుకొని జా ♦ త్యంధుండో కో వీఁడనన్! 67

క॥ ఘనుఁడు చమూనాథుఁడు "మో
హనసింహా! శంక తీఱె ♦ నా! నలినీరం
జనుఁ డప్పుడె రాజ్యేందిరఁ
గొని పుష్పావతిని జేరఁ ♦ గొని పెండ్లాడన్?'' 68

" మోహనుఁడు గంభీరసింహునిపై విజృంభించుట "

క॥ అన—"నీవు వచ్చినప్పుడె
మునుఁగుఁజుమీ కొంప యనుచు ♦ బుద్ధి నరసితిన్!
ధనము చనె! గన్య చనియెను!
జనె మానము! నిన్ను నేఁడు ♦ చంపక విడువన్! 69

క॥ నిను నమ్మి యప్పుపత్రము
ల నొసంగితిఁ! జేతఁ జిక్కు ♦ లలనయుఁ బోయెన్!
ధనము సెడె! మోసగించెద
వని యెఱుఁగఁగలేక చెడితి ♦ నాద్యంతంబున్! 70

క॥ భండనభీముఁడ! నాకడఁ
బిండి యగుదు నీవు కన్ను ♦ విప్పెదునంతన్!
గొండంత దూది యణువై
యుండెడు చిచ్చంటి నాకు ♦ మొండెదు కరణిన్! 71

క॥ భండనమున గంభీర వి
భుం డొకత్రుటి తూలి కూలి ♦ పోయిన నను మె
చ్చం! డిదె కొండంతటి కూ
ష్మాండమయినఁ గత్తిపీట ♦ కడకువయె కదా!" 72

క॥ అని 'తునిమెద' నని లేచినఁ—
గని వీరనృసింహవిభుఁడు ♦ "కానిపనుల్ నీ
మనమునఁ దలఁచిన మృత్యువుఁ
గనెదవు! నామాట వినుచుఁ ♦ గదలకు మింకన్! 73

క॥ జగమున నరుడుగఁ బుట్టిన
మగవాఁడవు! నీ పరాక్ర ♦ మము మేము నెఱుం
గఁగ నేరమె! మా పున్నెము
రగులుచు నీరూపమెత్తి ♦ ప్రతిబింబించెన్! 74

శా॥ శ్రీపృథ్వీనృపమాళి మాన్యుఁ డతుల ♦ శ్రీవీరసంఘుంబు వృ
ద్ధోపాధ్యాయుఁడు – కీర్తిశోభితుఁడు ధీ ♦ రోదాత్తశౌర్యోగ్ర రే
ఖాపారీణుఁడు సర్వలోకనుతుఁ డీ ♦ గంభీరసింహుండు! నీ
కోపాటోపముఁ జీరికిన్ గొనునె! ను ♦ గ్గున్ నూచమున్ జేసెడిన్! 75

సీ॥ కాశ్మీరపతి రణాం ♦ గణమునఁ దాఁకి డీ
లుపఱచి ఘోరాటవుల్ ♦ బట్టఁదోలె!
సింహళేంద్రుఁడు తిర ♦ స్కృతి సూప సంగర
క్షోణి గుండెలు గ్రుళ్లఁ ♦ గూలఁదన్నె!
సాళ్వేశుఁ దన రథ ♦ స్తంభంబునకుఁ గట్టి
యఖిలదేశముల వా ♦ హ్యాళిఁ దీర్చె!

నేపాలభూపాలు ♦ నిర్జించి పృథ్వీశు
చరణపద్మములపై ♦ నొరగఁజేసె!

సీ॥ భోజ కాంభోజ చేది భూ ♦ పులను గెలిచి
'వీరసంగ్రామపార్థుఁ'డన్ ♦ బిరుద మొందె!
నిట్టి గంభీరసింహేంద్రు ♦ నెఱుఁగ – నంత
కుఁడవో! లేక కాలాగ్ని ♦ రుద్రుఁడవొ నీవు! 76

ఉ॥ వింటివొ లేదొ! యీ ఘను గ ♦ భీర పరాక్రమ గాథ! వీర సం
క్రందనుఁ డీతఁ డల్గిన సు ♦ రల్ మనఁజాలరు! నీవ్రనుక్ క్రమటిక్
క్రమందెదు! గోపురమ్ములును ♦ మండపముల్ గుడి క్రిమింగు వానికిన్
నందియుఁ బిండివంట యను ♦ నానుడి క్రొత్తదా! నీవు లెక్కసేఁ! 77

ఉ॥ పూనెన యేని సర్వజగ ♦ మున్ మసి సేయఁగలండు! నింగిత
జ్ఞానములేని గొప్ప గురి ♦ కాఁడవు! కావునఁ గానికార్యముల్
పైన వహింపఁజొచ్చితివి! ♦ పావకునిన్ శలభంబు క్రిమింగునే!
యేనుగుతోడఁ బంది కల ♦ హించునె! నక్క – మృగేంద్రు గెల్చునే! 78

ఉ॥ పుట్టెడుమాట లాడి చెఱ♦పున్ గను బుద్ధులు నీవు పుట్టగా
బుట్టిన! విప్పు వల్వ దనఁ ♦ బోవునె! నానుకు లా మహోర్మిలో
నెట్టితి! విప్పు డిద్వారకు ♦ నిందలు తెచ్చితి! నిన్నుఁగూర్చి నా
పట్టు తొలంగె! మూర్ఖ సహ♦వాసము క్రేయముఁ దెచ్చిపెట్టునే!" 79

క॥ అను నయ్యధిపుని పలుకులు
విని గ్రుక్కడు మిక్కు రనక ♦ వెనుక వెనుకకున్
జని యొదుగుచుఁ దన యాసన
మును డాయుచుఁ గూరుచుండి ♦ మోహనుఁ డంతన్! 80

క॥ "అందఱకుఁ బెద్దవగు నీ
యందున భారమ్ము నుంతు! ♦ నప్పుఁగుఱిచి యే
మందువు సైన్యప! తెలుపుము!
ఇందును నీ న్యాయపథము ♦ వీను లలరఁగన్!" 81

క॥ అని పలుకఁగ నలినీరం
జనుఁడు "నృసింహేంద్రుఁ డపయ♦శంబును బొందన్
జన! దితని యప్పుఁ దీర్చెద"
నని భటుచే నొక్క పెట్టె ♦ యను దెప్పించెన్! 82

సీ॥ పదియునాఱు లక్షలకును ♦ బసిడి నాణె
ములను లెక్కించి యతఁ డిచ్చె ♦ మోహనునకు!
వాహినీపతి "యితఁ డార్ద్ర ♦ వస్త్రములను
విడువలే" దంచుఁ గనుసన్న ♦ విప్రుఁ గనియె! 83

సీ॥ "రాష్ట్రసంప్రాప్తివేళ – వీ♦రనరసింహ
పతి యొసంగు బంగరుపట్టు ♦ పంచె" లని వ
చించి విప్రవరిష్ఠుఁ డా♦శీర్వదించి
వేదమంత్రాక్షతముల దీ♦వెన లొసంగె! 84

క॥ నలినీరంజనుఁ డా దు
స్తులు దొడిగెను! సైన్యవిభుఁడు ♦ సుదతిన్ దరియన్
బిలుచుచుఁ "దల్లీ! నీ తల
పులు దెలుపు మనెన్! నృసింహ ♦ భూతలపతియున్, 85

ఉ॥ "ఎంతటి చిత్తకోమలత! ♦ యెంతటి ప్రేమభరంబు తండ్రిపై –
నెంతటి మార్ధవ – మెంతటి య♦హీన గుణోన్నతవృత్తి! యీ జగం
బంతట నిన్నువంటి సుగు♦ణాకర లేదని నమ్మియుంటి! నీ
వెంతటి కత్తిగొంటివి సు♦మీ! సుతరూపముఁ గాంచు ద్వేషిణీ! 86

ఉ॥ "అప్పుల పోతనై సతత ♦ మాపదలన్ బడి నల్గియుంటి! నా
కెప్పుడు సేవచేసెడు మృ♦గేక్షణ నన్నెడఁబాసిపోయె! నా
ముప్పున కయ్యెదంచు వల♦పున్ దయివారఁగఁ బెంచుకొంటి! నీ
విప్పుడు చెర్వులో దుమికి ♦ యింతలుచేసితి! వేమి చెప్పుదున్! 87

క॥ 'మన సెట్టు ఉండినను – మో
హను గొందును! మాట దిరుగ" ♦ నని – నేఁ బిలువం
గనె సరసిని దూఁకితి" వన
విని – మోహనుఁ "డవును! వెలఁది ♦ పెండ్లి కొడఁబడెన్! 88

క॥ నే నలరితి! నిప్పుడు గతి
హీనుఁడనై చెడితి" ననుచు ♦ నేడిచె! డిల్లీ
సేనాధీశుఁడు వారిని
'మానంబు వహింపుఁ' డనుచు ♦ మంద్రముగ ననెన్! 89

ఉ॥ "అగ్గలమైన మార్ధ్వము–న♦నర్ఘ గుణోన్నతి యీమె సొమ్ము! కా
రగ్గిని కౌఁగిలింప వల ♦ నౌను! లతాంగిని సోఁకవచ్చునే!

యి గ్గజరాజయాన నిను ♦ నెంతయు మెచ్చె నటన్న మాటయున్
సిగ్గులచేటు సు! మ్మెటుల ♦ నే మది నమ్మితో! నెఱ్ఱెమోహనా!" 90

"పుష్పావతి తన మనసు విప్పి చెప్పుట"

మ॥ అని భాషించెడు సైన్యనాయకుని జా♦యన్ వచ్చి పుష్పావతీ
వనితారత్నము భక్తి నాతని పద♦ద్వంద్వంబుపై వ్రాలి "నా
జనకున్ మించిన ప్రేమమూర్తివి! భవ♦త్స్నేహమ్ము మన్నింప నే
రను! నూతేడులు సేవచేసినను దీ♦ర్పన్ లేను నీ యప్పులన్! 91

మ॥ అతితామిస్రపరీతమౌచు శిథిలం ♦ బై పోవు మత్స్వాన్త జీ
వితమున్ నీవను సూర్యదేవు కళ లా♦వేశించి శోభా సమ
న్వితమున్ జేసెను! దేవదేవుఁ డిటు లా♦విర్భావమున్ బొంది దుః
ఖితతన్ మాన్చెను! మర్త్యమాత్రులకు నీ ♦ కారుణ్యమున్ గల్గునే! 92

మ॥ జనకా! నీవు సమస్త భూప్రజలచే ♦ సర్వజ్ఞతుల్యుండ వం
చనిశంబున్ నుతు లొందుచుందువు! రహ♦స్యం బేల నీ ప్రేమల! మో
హనుఁ డప్పిచ్చుచు నాదు తండ్రి ననపా♦యశ్రీల సాధించె! నీ
తని బెండ్లాడఁగ నెంచుకేనియు సమా♦ధానంబు లే దెప్పుడున్! 93

క॥ నలినీరంజనుఁ దమిమెయి
వలచితి! నితఁ డొదవకున్నఁ ♦ బ్రాణంబుల ని
మ్ముల విడువ నిశ్చయించితి!
వలపు విఫలమైన వనిత ♦ బ్రదుకఁగఁ గలదే! 94

చ॥ సఖుఁడు సహాయుఁ డితఁ డని ♦ స్వాంతము నమ్మి చరింతుఁ! బ్రత్యహా
ద్ముఖము వినూత్న నూత్న జగ ♦ మున్ గొలుపున్! బ్రతికోరకంబునన్
నుఖ మిదు నూత్నపుష్పమును ♦ జూపును! దర్శనమాత్ర మీతఁడున్
సుఖము నొసంగు నా! కిపుడు ♦ చూపులకున్ గఱవయ్యె నక్కటా! 95

క॥ నీవు ప్రభంజన రూపుఁడ
వై వచ్చితి! మోహనాభ్ర ♦ మటు దరిమితి! వా
దేవుని నలినీరంజను
నే వీక్షించితిని బద్మి♦నీ విభు పోల్కిన్ 96

క॥ రారాజులు నీదు కృపా
సారమునకు వేచియుంద్రు! ♦ సాధారణ క

న్యారత్నము నే నెట్టులు
నీ ఋణమును దీ ర్తు'' ననుచు ♦ నిజ జనకునితో! 97

క॥ ''జనక! విను! మేను మనవలె
ననియుండిన – నితనికొసఁగు! ♦ మల్ల ప్రతాపేం
ద్రునిఁగూర్చియైన నను నిత
నిని గూర్పుమసంగనె – వలి ♦ నీరంజనుఁడున్! 98

శా॥ ''నా లావణ్య మహాబ్ధిచంద్ర కళయున్ ♦ నా ప్రాణసారంబు – నా
శ్రీలక్ష్మీసుభగావతార నిదె నా ♦ చింతామణీ రత్నమున్
నా లోకైకమహాధనంబు – మఱి ప్రా ♦ ణంబైన ప్రాణంబు నీ
బాలారత్నముఁగూర్చి జీవితము శో ♦ భావంతమున్ జేయుమీ॰! 99

క॥ కరగత రాజ్యముఁ గొని నని
మురయకు ననుఁ గినుకతోడ! ♦ నల్లుఁడ! నూతన్
వరియింప నర్హుఁడును! మా
యిరువుర దీవింపు! పదము ♦ లెవు కున్ గొలుతున్! 100

మ॥ పురుషశ్రేష్ఠుఁ ప్రతాపభూపు నొకచో ♦ వ్వన్ నిన్ను వే ఱొక్క చో
ప్పరయన్ నేర్తునె! తండ్రికిన్ వలెనె నే ♦ వాత్సల్యర్చనల్ దీర్తు! నీ
వఱ కైప్లలితో యింకమీఁద నటులే ♦ పాలింపు రాజ్యంబు! నీ
యశమై మించెదు పర్యవేక్షణము నే ♦ నర్థింతు వేభంగులన్!'' 101

క॥ అని సాష్టాంగ నమస్కృతిఁ
బొనరుప నరసింహరా డ్వి ♦ భుఁడు నలినీరం
జను నెత్తి తనదు తొడ నిడు
కొనె! సైన్యవిభుండు కాంత ♦ కును సన్నయిడన్, 102

క॥ పడఁతి చనుదెంచి తక్కిన
తొడయందునఁ గూరుచుండెఁ! ♦ దోడనె సైన్యేం
ద్రుఁడు–దరహాసము మోమునఁ
గడు నలర నృసింహరావుఁ ♦ గని యిటు లనియెన్! 103

మ॥ ''కలశాంభోనిధి సార్వభౌముఁడు రమా ♦ కంజాక్షులన్ గూర్చి పెం
డిలి గావించినయట్లె చంద మలరన్ – ♦ నీవిప్డు పుష్పావతీ
నలినీరంజనులన్ వివాహదృఢ సూ ♦ త్రస్వాంతులన్ జేసి ని
ర్మల కీర్తిస్థితులన్ నృసింహనృప! పెం ♦ పన్ జూడు'' మం చాడినన్, 104

ఉ॥ వాలగు ఢిల్లిసైన్యపతి ♦ వాక్యములన్ విని మోహనాఖ్యుఁడున్
గాలము సెల్లు రోగివలెఁ ♦ గన్పడి మూర్ఛిలి నేలవ్రాలె! "నా
మూలవిరాట్టు మూలఁ బడి ♦ పోయె"నటంచు నృసింహరాయఁడున్
మూలిగి-యంతలో హృదయ♦మున్ సవరించుకొనెన్ గ్రియార్థియై! 105

మ॥ "నను సేవింతుఁగ నొక్క కోరవలనే! ♦ నా సమ్మతం జేల! నా
పను లన్నింట మహాధికార మొనయన్ ♦ బాలించు బాధ్యత్వ మె
ప్డును నీకున్నదికాదె! యాజ్ఞను శిరం♦బున్ జేర్చి వర్తింతు! స
ర్వ నియంతృత్వముఁదాల్చి సేవిచటఁ దీ♦ర్పన్ వచ్చు గార్యంబులన్!" 106

"మోహనునియందుఁ బరివర్తనము"

క॥ అనుచుండ - మోహనుం డో
"ననబోఁడీ! నమ్మికొన్న ♦ నట్టేటి బడిన్
నను విడిచితె! కాఱడవికిఁ
జని తప మొనరింతు! గర్మ ♦ సన్న్యాసమునన్! 107

క॥ లలన! నిను వలతు ననుటో -
వలదనుటో - బ్రహ్మలోక ♦ పర్యంతము చ
ర్చల ఁజేయుచుంటిఁ! గడకును
వలదనుటనె సేమమును శు ♦ భంబని తేలెన్! 108

మ॥ 'శతపత్రేక్షణ! మూర్తమున్ దరిసె ని ♦ చ్చల్ వచ్చి కూర్చుండు' మం
చతివాత్సల్యముఁ జూపుచున్ జనకుఁ డా♦హ్వానింపఁ గోపించి ను
ద్ధతిఁ గాసారమునందు దూఁకి నను నిం ♦ దన్ ముంపఁ జాల్పడ్డ నిన్.
బ్రతిబంధంబుల పేరటాలిని గ్రహిం♦పన్ నే ద్తునే భార్యగన్! 109

క॥ బట్టబయలు లాచు మొగమునఁ
గొట్టినగతిఁ బనియుఁ జెడియెఁ! ♦ గొంపకుఁ బోదున్!
దెట్టగిలఁ బడఁగ నేటికి!
నొట్టు సుమీ నిన్నుఁ గోర, ♦ నుడురాజముఖీ! 110

గీ॥ అకట! నాపని గచ్చు వి ♦ చ్చయ్యె! నెట్లు
క్షోణిఁ దిరుగుదు! నాగాలి ♦ సోఁకెనేనిఁ,
బైఁ బడెడు గుండగొయ్యలఁ ♦ బట్టఁ దరమె!
నిట్లు తలవంపగు నటంచు ♦ నెన్నఁ డెఱుఁగ! 111

క॥ చే టెఱుఁగలేక నేనే
మాటలు కడు నేర్తు ననుచు ♦ మత్తిల్లుచు బల్
టాటోటు మాట లాడితి!
నోటికిఁ జిక్కిన ఫలంబు♦నున్ గోల్పోతిన్! 112

తే॥ ముందుగనె "వచ్చెరా! వెఱ్ఱి ♦ మోహనుఁ" డని
నన్నుఁగని బడిపిల్లలు ♦ నవ్వుచుండ్రు!
పూన్కి చెడి యూఱ కూరికిఁ ♦ బోదు నేని
నర నిముసమైన బ్రదుక నీ ♦ యరు! నిజంబు! 113

గీ॥ కాలు లఱచుచుఁ గాలంబుఁ ♦ గడుపు నాకు
భూజనులలోన – నాలుక ♦ ముల్లు విఱిగెఁ!
బీటపయిఁ బెండ్లి చెడిపోయి ♦ బేల నగుచు
దిండిచేటుగ బ్రదికెదు ♦ దేబె నైతి!" 114

క॥ అని నలినీరంజను దెసఁ
గనుఁగొని "నాకన్న నంద ♦ గాఁడవగుదు! కాం
తను రాజ్యముఁ బడసితి! నీ
ఘనయోగము గూర్చు నాకుఁ ♦ గడు సంతసమున్! 115

ఉ॥ ఓయి! యదృష్టవంతుఁడ! వ ♦ హో! పదివే లభినందనంబులన్
జేయుదు! నీ హిమాంశుముఖిఁ ♦ జేకొని యిప్డు వివాహమాడుచున్
వేయికుమాళ్ల తండ్రివయి, ♦ పేరును బెంపు గడించి – రాజ్యమున్
జేయుము! నిన్ జనుల్ వొగడ ♦ 'జే' యని యారవిచంద్రతారమున్! 116

క॥ అందఱకు మీకు వందలు
వందలు వందనము లిడెద! ♦ వైళమ నన్నున్
మందిరముఁ జేర సెలవిం
డిందుండఁగ నేల! యింటి ♦ కేగెద" ననుచున్, 117

చ॥ పలికిన – సైన్యనాథు "డెటొ ♦ వచ్చితి వీడకుఁ! బెండ్లి వెన్నలోఁ
గలిసె నటంచుఁ జింతిలకు! ♦ గారవ మారఁగ మూర్తమిప్డు క
న్నులఁగని యారగించి చన ♦ నూల్కొను! మాపు నృసింహరావు నీ
నిలయముఁ జేర్చి వచ్చు! గమ ♦ నింపుము! నింపుము మాకు మోదమున్! 118

క॥ అనఁగా – మోహనుఁ "డోడబడి
తిని! మాపటివేళ బయలు ♦ దేఱఁగ శకటం

బును దీర్చి యుంచుమని బం
టునకుఁ దెలిపివత్తు'' నని త ♦ టుక్కున వెడలెన్.　　119

చ॥ వడివడి మేడ డిగ్గి చని ♦ బంటును దెల్పుచుఁ – గాలుసేతులన్
గడుగుచు – దప్పిదీఱిచి యొ ♦ కానొకయించుక సేదదేఱి రే
గెడు తలపోఁతలన్ దఱచి ♦ కీడును మేలును జర్చఁజేసి య
య్యెడ నొక నిర్ణయంబును వ ♦ హింపక డెందము తత్తఱింపఁగన్!　　120

క॥ ''నరసింహరావు నధికృతి
కొరవడె! రక్షకుఁడు లేక ♦ కొనసాగను నేఁ!
బరతంత్రుఁడ! నొకగండఁడు
కర మనురక్తుండు నాకుఁ ♦ గావలె నెపుడున్!　　121

క॥ నలినీరంజనుఁ డిఁక నీ
యిల నేలు! నతండె నాకు ♦ నిఁక ది'' క్కనుచున్
దలఁచుచు మేడకుఁ జని నగ
వలరు మొగముతోడ నాతఁ ♦ డటఁ గూర్చుండెన్!　　122

"పుష్పావతీ వివాహము"

సీ॥ ఇందు నందన కెల్ల ♦ యెడలఁ దా నగుచు వీ
　　రనృసింహరావు కా ♦ ర్యములు నడుప!
గురుతర కార్య ద ♦ క్షుండు డిల్లీపుర
　　ధ్వజినీపతియు నుప ♦ ద్రష్టగాఁగ!
నరహరిసింహుఁ డా ♦ దర మొప్ప వలయు సం
　　భారముల్ గూర్పఁదో ♦ డ్పడుచు నుండ!
వేదశాస్త్రపురాణ ♦ వేది విప్రుఁ డుచిత
　　పరికరమ్ములు వాడి ♦ పను లొనర్ప!

గీ॥ మొనసి మంగళతూర్యముల్ ♦ బోరుకొనఁగ
నంద జానందముద్ర లా ♦ స్యముల నింప
సకల వైభవ ప్రాభవ ♦ సాంద్రమగుచు
వెలఁది పుష్పావతీదేవి ♦ పెండ్లి జరిగె!　　123

సీ॥ నీటైన పసపు వ ♦ న్నియ పెండ్లివలిపెంపుఁ
　　గాంతి నంపెఁగపూల ♦ కళలు నింప–

గళ లీను దివ్యమం ♦ గళ పీఠణంబులు
కలువతోరణములు ♦ గట్టుచుండ!
హృదయ మోహన రూప ♦ రేఖా విలాసముల్
లక్ష్మీవిలాస వా ♦ ల్లభ్య మూన!
నును(గపోలముల నిం ♦ పెనయు కాటుక రేఖ
భువన సౌందర్య వై ♦ భవము( దెలుప(!

గీ॥ దరుణి పుష్పావతీదేవి ♦ ధన్యమూర్తి
పెండ్లిపీటల( గూర్చుండు ♦ వేళయందు
నామె దర్శించి యానంద ♦ మందుటకును
స్వర్గవిభు వేయికనులైన( ♦ జాలకుండు! 124

గీ॥ హృదయమను పాదునం దంకు ♦ రించి పెరిగి
ప్రేమలత పల్లవించి పు ♦ ష్పించె ననగ
నవ్వధూవర మస్తంబు ♦ లందగించె(
బూలు మంత్రాక్షతలు తల( ♦ బ్రాలతోడ! 125

గీ॥ ఉజ్జ్వలములైన వజ్రంపు ♦ టుంగరములు
సైన్యపతి యీయ విప్రుడు ♦ శ్రౌతమంత్ర
పూర్వకంబుగ నప్పు డా ♦ శీర్వదించి
తోషమున నిచ్చుకొనిరె వ ♦ ధూవరులకు! 126

క॥ ధరణీ విబుధుని యాశీ
స్స్ఫురణంబులు సాగుచుండ ♦ మోహను( డంతన్
బిరబిర లేచి నిలిచి యం
దఱ మొగములు పాఱజూచి ♦ నగు చిట్లనియెన్! 127

"మోహను సంప్రార్థనము"

మ॥ "కలవృత్తాంతము రెండు వాక్యములలో ♦ గంభీరసింహేంద్ర! యో
నలినీరంజన! యో నృసింహపతి! యో ♦ నా సోదరీ రత్నమా!
తెలుపన్ గోరితి! నాలకించి విన( బ్రార్థింతున్ మిమున్ నల్వురన్!
వలదంచాడ(గ(బోక సత్కరుణ తోడన్ నన్ను( బాలింపుడీ! 128

ఉ॥ మీయెడ నాజ్ఞనొంది వడి ♦ మేడను డిగ్గుచు నేను గ్రిందికిన్
బోయిన యప్డు నాహృదయమున్ బరివర్తన మందిపోయె! నీ

తోయపలి నేఁ గలంచుటను ♦ దూఁకెఁ దటాకమునందుఁ! బెక్కు లేం
డ్లాయతభోగ మొందుచు మ ♦ హాస్మృపురాజ్ఞగ నుండనోపియున్! 129

సీ॥ అల వేళగాని వే♦ళల వచ్చి దూఁకి త
ర్జన భర్జనంబులు ♦ జరిపియుంటి!
నువిద ని! మ్మటుగాక ♦ యున్న – 'నప్పి'మ్మని –
నరసింహ విభుఁ బట్టి ♦ నలిపియుంటి!
నప్రమాణము లప్రి♦యము లవివేకముల్
వేలకువేలు గా♦వించియుంటిఁ!
గనుకట్టు జాలంపుఁ ♦ బనులు చూపి వెలంది
చిత్తమంతయు రోత ♦ చేసియుంటి!

గీ॥ నేను సేయని రోత లెం♦తేనియుండ!
విట్టి నను జెట్టపట్టఁగా ♦ నిష్టపడక –
తప్పుకోనలేక – పితృాజ్ఞ ♦ దాఁటలేక –
శరణమే లేక – తరుణి యీ ♦ చెఱువు సొచ్చె! 130

మ॥ తన ప్రాణంబును గోలుపోవుటకు సి♦ద్ధం బయ్యెఁ! బలెక్కి మా
టను నన్నాడఁగఁబోదు! కోపమునఁ జూ♦డన్ బోదు! శాంతంబుతో
నను నోర్చెన్! దెగఁ గాలునప్డును సుగం♦ధంబున్ లవంగైన బా
యని శ్రీగంధపుఁ జెక్కచందమున నీ♦యుష్ట్రాక్షి తావత్తెలెన్. 131

ఆ॥ బారుటీటె వలని ♦ బలమైన గాయముల్
మాని గుఱుతుగూడ ♦ మాయవచ్చు!
మిగులఁ బొగరువట్టి ♦ మిమ్ముఁ దిట్టిన తిట్లు
కోటియుగములైన ♦ గుఱుతు చెడవు! 132

క॥ ఒడలు ధరించిన మొదలె
ప్పుడు గానియు మఱచి తప్పి ♦ పొరపాటున నే
నుడివి యెఱుఁగ సత్యము! నా
యిడుమల కదె మూలమనుచు ♦ నెఱిఁగి తపింతున్! 133

చ॥ కఱకగు వాడియగ్రము చి♦గన్ – బిడి సానను దెచ్చి శీర్షమున్
దఱిమెనఁ బెట్టిరేని – బెడి ♦ దమ్మగు ఖడ్గముఁ దెచ్చి మేనిలో
గొఱగొఱ ప్రాణ ముండు వఱ♦కున్ గడికండలు రాలునట్టులన్
గరకర గోసినన్ – ఫలము ♦ గల్గదు! కల్గదు పుణ్యలేశమున్! 134

మ॥ సరసీజేక్షణఁ గూర్చి నే సలుపు దౌ♦ష్ట్యంబుల్ మహాదోషముల్
పరిహారంబుఁ గనంగ నీమె చరణ ♦ ద్వంద్వంబుపై వ్రాలి 'స
త్కరుణాదృష్టి క్షమింపుమీ'యని నమ♦స్కారంబుఁ గావింతు! నం
దఱు మీ సమ్మతిఁ జూపి కూర్మి యిరవొం♦దన్ నన్నుఁ బాలింపరే! 135

గీ॥ మీ రనుమతింతురేనిఁ బే♦ర్మిఁ గొనిపోయి
శక్తికొలఁది నేను బ్రతి వ♦త్సరమునందుఁ
బచ్చపోగులు గల చీర ♦ యిచ్చి కొలిచి
యబ్జముఖికిఁ బుట్టింటి మ♦ర్యాదఁ దీర్తు! 136

మ॥ వలదంచున్ నరసింహరాయఁ డొకటన్ ♦ వాపోవ - నాలింప కీ
జలమందున్ బడినప్డు - జాలిఁగొని యు♦త్సాహంబుతోఁ బ్రాణమున్
నిలిపెన్! నాకు మహోపకారియగు నీ ♦ నిర్ణిద్ర తేజోనిధిన్
నలినీరంజనుఁ గాదలాడితి - నితాం♦త క్రోధచిత్తుండనై! 137

మ॥ జననం బందిననాఁడె యీ నృపతికే ♦ జంజాటమై యుంటి! నేఁ
గొని పై మోపు ననర్థకంబులను బె♦ట్కుల్ దీర్చి నాసేమమే
తన సేమంబని యెంచి నా యవగుణో♦త్పాతంబు సైరించి నం
దను నల్లెలె! నృసింహరాయని కృపా♦తాత్పర్య మగ్గించెదన్! 138

మ॥ కలిఁ బుట్టొందిన భీమసేనుఁడగు నీ ♦ గంభీరసింహుండు దో
ర్బల విఖ్యాతుఁడు! రాజకీయబల సం♦పన్నాన్యుఁ! డీమేటి య
ద్దులు పూజించుచు - "జిత్తకోశమున నా♦కున్ సుంత తావిచ్చి నా
యలఘు క్షేమముఁ గోరుమీ" యనుచు సం♦ప్రార్థింతు వేళంగులన్! 139

మ॥ ధనమున్ నాజనకుండు కొ ట్లొసఁగె! నే ♦ దారిద్ర్యమున్ లేదు! నీ
ధనమున్ గ్రమ్మఱ నేను గైకొనుటయున్ ♦ ధర్మంబుగాఁ దోప! దిం
దున వైవాహికవేళ దీనిఁ జదివిం♦తున్ గానుకఁగా! దీసికొం"
డని విప్రోత్తము హస్తపంకజమునం ♦ దర్పించె హర్షంబునన్! 140

మ॥ "అనురాగోజ్జ్వలు లీ వధూవరులపై ♦ నాసక్తి దీపింప మో
హనసింహుండును ద్యాగ మింపలరఁగా ♦ నాశీస్సులన్ జేసి యి
చ్చిన పైకంబు పదాఱులక్ష లని యా♦శీరక్షతల్ చల్లి యా
ధనమున్ విప్రుఁడు వారిచేత నిడె మం♦త్రధ్యాన పూర్వంబుగన్! 141

ఉ॥ ఆవసుధామరోత్తమున ♦ కానరసింహవిభుండు నూత్న వ
స్త్రావళి నొక్కపళ్లెరము ♦ నం దిడి దక్షిణ వెట్టి యిచ్చి సం,

భావన చేసె! నాయన "శుభంబగు మీ"కని వేదమంత్రపుం
దీవన లిచ్చుచుం సెలవు దీసికొనెం దనయింటి కేగఁగం! 142

ఉ॥ అందఱు క్రిందికేగుచు మహానసశాలకుఁ బోయి తృప్తి చె
ల్వొందఁగ రుచ్యభోజ్యసర సాన్నములం భుజియించి నిద్దపుం
జందన చర్చలం సలిపి చల్లని కమ్మని తమ్ములంబు లా
నందముమీఱఁ జేకొని! రనంత ముదమ్మున మోహనుండునుం. 143

సీ॥ "కృప తప్పవలదు మీహృదయ కోశంబునం"
దనుచు గంభీరసింహునకు మ్రొక్కి!
"నాపాలిదైవంబవై పరగితి" వంచు
నరసింహపతికి వందన మొనర్చి!
"నా తప్పు గాచి మన్ననఁ జూపు" మనుచుఁ బు
ష్పావతి పదసార సముల కెరగి!
"నా నెయ్యపుం బెన్ని ధీ! నలినీరంజ
నా" యంచు వ్రాలి దండంబుఁ బెట్టి!

గీ॥ "మిమ్ముఁగని బుద్ధిపరివర్తి నమ్మి నొందె!
లోపములు వాసి నావృత్తి మేపుమీఱి
పెద్దమానిసిగాఁగ దీవింపుఁ" డనుచు
సాగిలం బడి మ్రొక్కిన - సైన్యవిభుఁడు, 144

క॥ "మే మెల్లర మెప్పుడు నీ
సేమము లరయుదుము! నీవు శ్రేయస్సౌఖ్య
శ్రీ మెఱయఁగ వర్ధిల్లుము!
కామిత ఫలసిద్ధి నీకుఁ గలుగుత మెపుడుం! 145

క॥ వినుము! నృసింహాధిప! యీ
తని నెప్పటియట్టు లాత్మ ధామముఁజేరం
గొని విడిచి రమ్మనఁగ-మో
హనుఁ డాతఁడు తరలిపోయి రమరపురి దెసం! 146

"నలినీరంజను పట్టాభిషేకము"

గీ॥ మఱుదినము సైన్యపతి విప్ర మణిని బిలిచి
"యొజ్ఞ! పట్టాభిషేక ము హూర్త మరయ -

నక్కరో" యటన్నఁ - జుక్కలు ♦ లెక్కపెట్టి
యతఁడు గురువార ముత్తమ ♦ మనుచుఁ దెలిపె!

చ॥ శివపురముఁ - రమాపురము ♦ శ్రీగిరిదుర్గము - ప్రాతకోటయుఁ
నవనగరంబు - యోధపురి ♦ నాగపురంబు - ననంతకోట - సం
జవనము పాళెగాండ్రకును ♦ జాబులు ఢిల్లిచమూవరుండు మై
త్రి వెలయఁ జేరఁగాఁ బనిచెఁ ♦ దీవ్రరయమ్మున నాశ్వికాళిచే!

సీ॥ 'నవనృపుం డొందు సం♦తత సౌఖ్య'మని వ్రాయు
స్వాగత పత్ర వ్ర♦జంబుతోడ -
బహువిధాల్పాహార ♦ పానీయములు గల్గి
మెఱుగారు పూలపం♦దిరులతోడఁ -
బరమ సౌగంధ్య బం♦ధురమైన దివ్య మం
దార మాలా తోర♦ణములతోడ -
వితతమై మార్దవా♦న్వితమునై మార్గమం
దమరు క్రొత్త మడుంగు ♦ గములతోడ!

గీ॥ దుర్గగోపురమునుండి ♦ త్రోవ - నాస
భా స్థలముదాఁక బయలు శో♦భలను నించె!
నొక్కగుంపయి రీవా మ♦హోద్విజనులు
నవనృపతిఁ గొల్వ వచ్చి రా♦నంద మెనయ!

ఉ॥ లోపల నాల్గువైపుల జి♦లుంగుఁ బనుల్ గల వింతచిత్రముల్
భూపమణి ప్రతానముల ♦ బొమ్మలు - రంగులపుల్గు మొత్తముల్
చూపులఁ దన్పు పూలగుము♦లుఁ మురిపెంపుల ప్రోవులైన యా
యా పసలారు సత్ఫల చ♦యమ్ముల ప్రోవులు గొల్పె నబ్రముఁ!

సీ॥ నీకైనకమ్మ ప♦న్నీటఁ దానం బాడి
విలువైన పట్టు వ♦ల్వాలు ధరించి -
తళుకు వజ్రాల సొ♦మ్ములు మేన ధరియించి
మలయజ మంజు చ♦ర్చల మునింగి -
యకలంక పుష్పమా♦లికలు ఱొమ్మునఁ దాల్చి
కరమున మండలా♦గ్రంబుఁ బట్టి -
తలపైని నాణిము♦త్యాల పాగా చుట్టి
నిల్వుటద్దంబున ♦ నీడ చూచి -

గీ॥ సారలోక సామ్రాజ్యాధి♦కార సంగ్ర
హమున కరుదెంచు జంభాసు♦రారి నేరు
సర్వసుభగ కల్యాణ వే♦షంబుతోడ
నాత్మకళ నలినీరంజ ♦ నుండు వెలిఁగె! 151

సీ॥ పండువెన్నెలఁబోలు ♦ వలిపెంపు హొంబట్టు
జిగిపనుల్ వెలుఁగొందు ♦ చీరఁగట్టి -
నలుదెసల్ నిగనిగల్ ♦ వెలయించు మెఱుఁగు వ
జ్రాల యుంగరము హ♦స్తమునఁబెట్టి -
దరహాస చంద్రికా ♦ స్ఫురితాస్య దీధితుల్
సురుచిర పరివేష ♦ శోభ నెఱప -
నల చతుర్దశభువ ♦ నాతి సుందరమైన
తనమూర్తి విశ్వమో♦హనతఁ గూర్ప -

గీ॥ నప్సరః పరివృతయైన ♦ యమరసార్వ
భౌము నర్ధాంగి దివ్యవై♦భవముతోడ -
నిఖిలభువన ప్రజా దర్శ ♦ నీయయగుచు
వెలఁది పుష్పావతీదేవి ♦ వెడలె నపుడు! 152

సీ॥ చంద్రమహల్ దుర్గ ♦ సైన్యేశుఁడు గజేంద్ర
సింగు బహిర్ద్వార ♦ సీమఁ గొలువ!
నృపుఁ గొల్వవచ్చి చే♦రిన పాళెగాండ్రెల్లఁ
గ్రమముగా బహుళాస♦నముల నుండ -
రాజకీయోద్యోగి ♦ రాజ తత్తదుచిత
స్థానంబులందుఁ ద♦త్పరత నుండ -
స్త్రీపురుషప్రేక్ష ♦ కోపసంఘములు సం
ఫుల్లాస్యములను గుం♦పులయి మూఁగ -

గీ॥ సింహపీఠంబు నిరుదెస ♦ క్షితిసురులును -
గవులును - బురోహితులును-వే♦ద్యులును వసింప -
వందిమాగధుల్ గుమిగూడి ♦ సందడింప -
సభ వెలింగెఁ జుక్కలతోడి ♦ నభము కరణి! 153

క॥ సొగసయిన మృదులగానము
నెగడెను! తూర్యములు మొఱసె!

నిగిడెఁ! గొలువుఁగూటము జా
యఁగ నలినీరంజనుఁడు ప్ర♦యాణంబయ్యెన్! 154

మ॥ ఘనశౌర్యాఢ్యుఁ బ్రతాపపుత్రకుని వే♦డ్కన్ దెచ్చి సింహాసనం
బునఁ గూర్చుండఁగఁజేసి మంజుతిలకం♦బున్ మోమునన్ దిద్ది శో
భన ఖడ్గంబును రాజదండముఁ గర♦ద్వంద్వంబునన్ బెట్టుచున్
గన దంభోధర నాద మొప్పఁ బలికెన్ ♦ గంభీరసింహేంద్రుఁడున్! 155

శా॥ "ఓ సామంత నృపాలులార! వివిధో♦ద్యోగి ప్రకాండంబు లా
రా! సర్వప్రజలార! పూర్వము ప్రతా♦పాధీశుఁ డీరాజ్యమున్
శ్రీసం యుక్తముగాఁగ నేలి రిపు లా♦జిన్ ముట్టఁగా నోడి - రీ
వా సర్వంసహ వీడి కాననములన్ ♦ బట్టెన్ గుటుంబంబుతో! 156

సీ॥ ఆ మహోబా ధరా♦ధ్యక్షుఁ డీ క్షోణికి
నరసింహవిభు ధరా♦వరు నొసర్చె!
నిందుకు మూన్నెలల్ ♦ ముందు స్వయంవరా
జిని హతశేషులఁ ♦ దునిమె ననుచు
"భారతసూర్య - స♦ర్వజగత్ప"తీత్యాది
బిరుదాంచితుండను పృ♦థ్వీవిభుండు
నాస్వామి వీరసే♦నా సమూహముఁ దెచ్చి
యల మహోబా మహీ♦శుల జయించె!

గీ॥ వారు పాలించుచున్న రీ♦వా ధరిత్రి
సార్వభౌముని యేల్బడి ♦ సంతరించెఁ!
దండ్రి రాజ్యంబుకొఱకుఁ బ్ర♦తాపు సుతుఁడు
చక్రవర్తికిఁ జిన్ని వి♦జ్ఞప్తిఁ బంచె! 157

మ॥ అల రీవాధిపుఁ జేసిరమ్మనుచు నా♦జ్ఞాప్తిఁ బాలించె మీ
రలరన్ నేను బ్రతాపరాట్తనయు రీ♦వాధ్యక్షుఁ గావింతు! నీ
నలినీరంజను గొల్చి రాజ్య మసమా♦న శ్రీ మహాశ్రేయముల్
గలుగన్ వర్తిలి మీరు వర్ధిలుఁ డుద♦గ్రప్రాభవోపేతులై! 158

మ॥ కలతన్ బెంచెడివారి నాప్రభుఁ డెఱుం♦గన్ నేర్చి దండింపఁగాఁ
గలఁ! డయ్యుగ్ర నృసింహమూర్తికినుకన్ ♦ గన్నెఱ్ఱసేయన్ మహా
విలయం బెత్తు! సముద్ర ముద్రిత మహో♦ర్వీచక్ర మల్లాడు! ని
శ్చల భక్తిన్ బ్రకటించి యీతనిని వి♦శ్వాసంబుతోఁ గొల్వుఁడీ! 159

మ॥ అని ముమ్మారును మ్రొక్కి బల్కి తపనీ♦య ప్రాజ్యక్రమాసనం
బునఁ గూర్చుండెను! పాళెగాండ్రొకొకఁడున్ ♦ భూషాసమూహంబు - నూ
తన చామీకర వస్త్రముల్ నృపు పద ♦ ద్వంద్వంబు నందుంచి యు
ప్పనముల్ జేసి నమస్కరించిరి కవుల్ ♦ వర్ణింప శోభంగులన్! 160

మ॥ వరగాంగేయ వినిర్మితం - బతుల దీ♦వ్యద్వజ్రమాణిక్య భా
స్వర కోటీరము నొక్క పేటిక రహిం♦పన్ దెచ్చి యామోహను
డరుసం బారఁగ నాత్మమిత్రునకుఁ ద్యా♦గారంభుఁడై నెయ్యపు
మ్మొలుఁగుం గానుకగ నప్పగించుకొనెఁ జే♦ర్మిన్ లోకు లగ్గింపఁగన్! 161

మ॥ తన సింహాసనసీమ నుండియును గ్రిం♦దన్ డిగ్గి కేల్మోడ్చి వం
దనముల్ జేయుచు "నాపయిన్ బరమవా♦త్సల్యంబు పై వార దే
వుని చందంబున వచ్చి సాయపడి యీ♦భూరాజ్య మిప్పించె! నీ
ఘనశౌర్యాఢ్యు మహోపకారిఁ దలఁతున్ ♦ గంభీరసింహ ప్రభున్! 162

సీ॥ పక్షితీర్థాన కటా ♦ క్షేక్షణంబుల-కెల్ల
వారు ముద్రొప్పున నే ♦ వారుచుండు!
శే మహాబాహు గ♦ర్జా మహాధ్వనికిఁ గృ
తాంతుని గుండె వ్ర♦య్య లయి పోవు!
నే భయదాటోపు ♦ ప్రాభవంబున కోడి
బలవైరి సిగ్గునఁ ♦ దలను వాల్చు!
నే బలోద్దీప్త బా♦హాబలోద్ధతిఁ గాంచి
గరుడుం డడలి విహం♦గమత నొందు!

గీ॥ నా చతుర్భుజ వంశ దు♦గ్ధాబ్ధిచంద్రు
సకలగుణసాంద్రు బృథ్వీరా♦జన్యచంద్రు
చరణములు గొల్చి రాజ్యంబు ♦ సలుపువాఁడ
నలఘు మతులార! రేవా ప్ర♦జాళులార! 163

మ॥ ఎపుడున్ నాకును రాజకీయ గురుఁడై ♦ యేపారు నీమాన్యుఁ డ
ష్టపు డిచ్చోటికి వచ్చి యేల్బడి స్థిరం♦బై యుండ-నాలోపముల్
గృపమైఁ జూపి తొలంచి - ప్రేమ నను వీ♦క్షింపంగఁ బ్రార్థింతు! నే
గపటం బించుక లేని భక్తిని మహా ♦ గంభీరసింహ ప్రభున్! 164

గీ॥ జనుల మే లెంచ కీ ప్రపం♦చం బఖిలముఁ
బాలన మొనర్చు నొక చక్ర♦వర్తికన్నఁ

ప్రజలు తనివోంద నొక్క కు♦గ్రామ మేలు
పిన్న యధికారి వంద్యుండు ♦ వేయిగతుల! 165

సీ॥ అణుమాత్ర మవినయం ♦ బగపడ నోర్వఁ డీ
విశ్వ ప్రపంచంబు ♦ విలయమొందఁ
జేయునం చెవని సు ♦ శ్రీకటాక్ష విభూతిఁ
గాంక్షించి యెప్పు డ ♦ ఖండ భరత
ఖండ ప్రజాకోటి ♦ క్ష్మాతలాధీశ సం
తతి తదాదేశముల్ ♦ దలను దాల్చి
చూపెట్టియుండు! నా♦క్షోణీశ పూజ్యుండు
విక్రమరాశి గం♦భీరసింహ

గీ॥ విభునకును మేర విచ్చిన ♦ వెలితి గాదె!
క్షితిని బోషింపఁజాలిన ♦ శ్రీపతికిని
భక్తిఁ దేమిచ్చి తృప్తిఁ గూ♦ర్పంగఁ గలఁడు!
హృదయ పుష్పంబు భక్తి న♦ర్పించిగాక! 166

మ॥ సమరోర్వీ సమదారిభూవరుల మ♦స్తంబుల్ విదారించు నీ
సమవర్తి ప్రతిమానమూర్తికి నమ♦స్కారంబు లర్పించి డెం
దమునం దంతకు నంతకున్ బెఱుగు శ్ర♦ద్ధాభక్తులన్ బుష్ప హా
రముఁ గంఠంబున వైచి కొల్తు'' నని హా♦రంబున్ సమర్పించుచున్. 167

ఉ॥ ''ప్రేమకు భక్తికిన్ వెల ల♦భించునె! యైనను భక్తితో జగ
త్క్షేమము లెప్డు కొల్చి విన♦తుల్ బొనరించు మహోగ్రవిక్రమో
ద్దామున 'కుంగరంబు'నుప♦దన్ బొనరించెద'' నంచు మైత్రిపెం
పాముకొనంగ నీయఁ బృత♦నాధిపుఁడున్ స్మితమంజు మూర్తియై, 168

క॥ ''ముదమున నీవిదు నుంగర
మిది నెయ్యఁపుఁగానుకయగుట ♦ నెంతయు హర్షం
బొదవించె! నీదుమైత్రిని
మది మఱువనటంచు దీని ♦ మన్నింతుఁజుమీ! 169

ఉ॥ 'భూపరిపాలనం బెడసి ♦ పూజ్యతమాసి ప్రతాపరాట్కులం
బాపెనుచీఁకటిన్ బడియె' ♦ నంచు దిసంతులుకొట్టినట్టి యా
పాపుల నోరు లన్నియును ♦ వామపదంబున దన్నునట్లు ధా
త్రీపరిపాలనం బనుమ ♦ తించి యశంబు గడింపు మిత్రమా! 170

గీ॥ బహుళసంపత్సమృద్ధి నీ ♦ వంశమెపుడు
వర్ధిలెడుఁగాక! శుభము చా ♦ ప్పడెడుఁగాక!
యాయురారోగ్య బహువిజ ♦ యంబులొసఁగి
చిన్నిమిత్ర! యాశ్వసుఁడు ర ♦ క్షించుఁగాక!" 171

క॥ అని యాశీర్వాదమొన
ర్చిన – నలినీరంజనుండు ♦ చిత్తాంబుజమం
బునఁబొడము కృతజ్ఞత – శిర
మునువాలిచి తెలిపి – చంద్ర ♦ ముఖిఁ గనుగొనుచున్, 172

మ॥ "తొలుతన్ నన్ననినంతనుండియును జే ♦ తోమోదమొప్పార ని
శ్చలరాగంబును నాపయిన్ నిలిచి క ♦ ష్టంబుల్ మహోత్పాతముల్
వలగొన్నన్ బెఱువోక ధైర్యమిగుచిం ♦ పన్ నిల్పి నన్గొల్చు ము
ద్దులపుష్పావతి! నిన్ను నేమఱక కొ ♦ ల్తున్ దేవతామాత్రగన్! 173

సీ॥ లలన! నామదిఁగల ♦ వలపును దెల్పంగ
రీవామహాధరి ♦ త్రిని మదీయ
జనకుఁ డేలుట – నేను ♦ సకలవైభవముల
న్గనట మంచిదె కాని ♦ నాదుమామ
సంసారమెపుడు క ♦ ష్టము లొందఁగానొర్వఁ!
బృథ్వీమహీంద్రుఁ న ♦ ర్థించి మామ
గారి కీరాజ్యంబుఁ ♦ గూరుచువాఁడె న
న్నుద్వాహమొందఁ న ♦ న్హాఁడగునంచు

గీ॥ శపథమునుజేసి నన్నట్లు ♦ సలుపఁజేసి
యల సమక్ష పరోక్షము ♦ లందు నాదు
హితము మనసారఁగోరితి! ♦ వింతకన్న
వలపు గలిగిన పరమ దై ♦ వతము గలదె! 174

సీ॥ అది నే మాటాడు ♦ నవుడు నాతల్లిదం
డ్రులు భవానీప్రతా ♦ పులను గూర్చి
ననుఁగూర్చి మిగుల సం ♦ తాపమందుచు నరుం
తుదవేదనల నొంది ♦ తూలునవుడు
నీప్రేమాలఁ జత్రాయి ♦ నియతి నిల్చితిఁ! దెర
నవలప్రోయుకవె గో ♦ ప్యతవటించి

తిని! గాని జాలిఁగ్రా ♦ కొని "నేన నీమేన
బావ" నం చొకపల్కు ♦ పలికి నీదు

గీ॥ వ్యథఁ దొలంగింపఁబూనని ♦ పాపమతిని!
జాలిఁదలఁపని క్రూరు – దు ♦ శ్శీలు – నిండు
మనమునను నలినీరంజ ♦ నుని క్షమించి
యేలుకొను మింకఁ బుష్పావ ♦ తీలతాంగి!" 175

క॥ అని చంద్రాననకరమును
దనకరకమలమునఁ గొనుచుఁ ♦ దద్దయుఁ బ్రేమం
బున నొత్తెను! సతి యులరుచు
"నను నగ్గింపంగఁదగునె ♦ నాథ" యనంగన్, 176

మ॥ ననువుందొయ్యలి! సర్వసద్గుణములన్ ♦ నాకన్న నీవెక్కుడై
తనరన్ – మెచ్చితి" నన్న – భూసురుఁడు చే ♦ తన్ సామృతంబై తన
ర్చిన శాంకాయను సాక్షతం బతని కి♦చ్చెన్! సర్వకల్యాణముల్
చినుకన్ సాగఁగఁజేసె మంత్రమహితా ♦ శీర్వాద మీభంగిగన్! 177

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేనమార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు! 178

గద్య: ఇది శ్రీ కామేశ్వరీదేవీ కరుణా కటాక్ష వీక్షా సమాసాదిత – రసవ
త్కావ్య నిర్మాణ చాతురీ ధురీణ – సుగుణగణ పారీణ–దుర్భాక వంశ
దుగ్ధాంభోరాశి రాకాశైరవమిత్ర – సుజనజనానుగ్రహపాత్ర –
శాలంకాయనగోత్ర పవిత్ర – వెంకటరామనార్య పుత్ర – కవి
సార్వభౌమ – సుకవిరాజరాజ – వీరప్రబంధ పరమే
శ్వర – మహాకవి మార్తాండ – సాక్షాద్వీర
ప్రతాపాభినవ టాడిత్యాది – బహుళబిరుద
విఖ్యాత – సుకవిరాజశేఖర – రాజశేఖర
శతావధాని ప్రణీతంబయిన పుష్పావతీ
ప్రబంధము పంచమాశ్వాసము

సంపూర్ణము

